# మద్రాసు తెలుగు - సామాజిక భాషా పరిశీలన

# MADRAS TELUGU - A SOCIO LINGUISTIC STUDY






K. MEHERMANI, M.A., M.Phil., Ph.D.

# మద్రాసు తెలుగు - సామాజిక భాషా పరిశీలన

# MADRAS TELUGU - A SOCIO LINGUISTIC STUDY







**Dr. Smt. K. MEHERMANI,** M.A., M.Phil., Ph.D.,

# మద్రాసు తెలుగు - సామాజిక భాషా పరిశీలన

# MADRAS TELUGU - A SOCIO LINGUISTIC STUDY

రచయిత :

**Dr. Smt. K. MEHERMANI,** M.A., M.Phil., Ph.D.,
Principal
D. R. W. College
Gudur, Nellore Dt. A.P.
Pin : 524 101.

ప్రథమ ముద్రణ : మార్చి 1999

ప్రతులు : 500

వెల :



This book is Published with the Financial assistance of S. V. University Tirupathi, under their scheme "S.V.U. - U.G.C. - un-assigned grant Group (C) Publication of Doctoral Thesis."

ముద్రణ : శ్రీ అన్నపూర్ణ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, నెల్లూరు.

# అంకితం

విద్యాబోధనతో పాటు జీవితంలో ఈ స్థాయికి ఎదగడానికి అన్ని విధాల ప్రోత్సహించి, సహకరించిన గురువర్యులు డా॥ ఎస్. అక్కిరెడ్డిగారికి

విద్యా పోషకులుగా కళాశాల కార్యదర్శులుగా నిరంతర విద్యా వ్యాప్తికి కృషి సల్పుతూ నన్ను ఆశీర్వదించి నా అభ్యున్నతికి కారకులైన మావయ్యగారు డా॥ సి. ఆర్. రెడ్డి గారికి

పి. హెచ్. డి. పట్టా పుచ్చుకునే వరకూ ఎన్ని ఆటంకాలు వచ్చినా వెన్నుతట్టి ఉత్సాహపరచి జీవితాశయాన్ని నెరవేర్చుకోవడానికి తోడుగా నిలిచిన శ్రీవారు అనిల్ కుమార్‌గారికి

అభిమానంతో, ఆప్యాయతతో, ప్రేమతో

— మెహర్‌మణి

"LANGUAGE IS BOTH AN EXPRESSION OF CULTURE AS WELL AS A VEHICLE FOR CULTURAL TRANSMISSION. IT IS BOTH A CAUSE AND AN INDEX OF SOCIAL AND CULTURAL CHANGE".

D. P. PATTNAYAK

## కృతజ్ఞతలు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పర్యవేక్షకులు లేకుండా స్వయంకృషితో పరిశోధన సాగించడానికి నాకు అవకాశాన్ని కల్పించిన సహృదయులు కీ. శే. ఆచార్య జి. ఎన్. రెడ్డి గారు.

నా పరిశోధనకు తగిన సలహాలనిచ్చి సహకరించిన వారు కీ. శే. ఆచార్య జి. నాగయ్య, కీ. శే. ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి, డా. పి. సి. నరసింహారెడ్డి, డా. జె. ప్రతాపరెడ్డి, ఆచార్య యమ్. నాగేశ్వరరావు.

నా పరిశోధన విషయ సేకరణకు సహకరించిన వారు మద్రాసు నగర పాలక సంఘోద్యోగులు, Tamil Nadu Archives సిబ్బంది, Tamil Nadu statistical department వారు, భాషా విశేష సేకరణలో సహకరించిన వ్యవహర్తలు పద్దెనిమిది మంది.

అవసరమైనప్పుడల్లా లేదనక సెలవు మంజూరుచేసి పరిశోధన పూర్తి చేయడానికి, ఈ గ్రంధాన్ని ప్రచురించడానికి ఆశీర్వదించి, ప్రోత్సహించిన వారు మా కాలేజి (D. R. W. College, Gudur.) కార్యదర్శి డా. సి. ఆర్. రెడ్డి, ఎమ్. ఎస్.

నా పరిశోధక వ్యాసానికి తొలి ప్రతిని తయారు చేయడంలో సహకరించిన వారు మా కళాశాల చరిత్రోపన్యాసకురాలు శ్రీమతి రమాదేవి, సీనియర్ అసిస్టెంట్ శ్రీమతి లక్ష్మీకుమారి, అటెండర్ శ్రీమతి అన్నపూర్ణమ్మ. గ్రంథ ప్రచురణ సమయంలో ప్రూఫ్ రీడింగ్ చేసినవారు ఆంధ్రోపన్యాసకురాలు శ్రీమతి శ్రీలక్ష్మి .

పరిశోధక వ్యాసాన్ని పూర్తి చేయడానికి ఆది నుండి అంతం వరకు సహకరించిన వారు మద్రాసు విశ్వ విద్యాలయ తెలుగు శాఖ పరిశోధక విద్యార్థినులు కుమారి డి. విజయలక్ష్మి కుమారి నళిని, కుమారి యమ్. విజయకుమారి, శ్రీమతి ఎస్. పి. వసంత

కుటుంబ బాధ్యత వహించి ఇంటా బయట సహకరించి నా పరిశోధన పూర్తి చేయడానికి తోడ్పడ్డవారు మా శ్రీవారు అనిల్ కుమార్,

తోడి కోడళ్ళు శ్రీమతి ప్రసూన, శ్రీమతి ప్రభావతి.

మద్రాసు విశ్వవిద్యాలయంలో నా విద్యార్థి దశ ప్రారంభమైన నాటి నుండి ఈ పిహెచ్. డి. సిద్ధాంత వ్యాసం పూర్తి అయ్యేవరకు సహాయపడి పరిశోధనా రంగంలో నన్ను తీర్చి దిద్ది, ఈ గ్రంధంపై తమ అమూల్యాభిప్రాయాన్ని వ్రాసినవారు డా. ఎస్. అక్కిరెడ్డి, ఎమ్. ఎ. పిహెచ్. డి., ప్రధానాచార్యులు, తెలుగు శాఖ, మద్రాసు విశ్వవిద్యాలయం.

ఈ పరిశోధక గ్రంథాన్ని ప్రచురించడానికి ఆర్థిక సహాయాన్ని అందించిన వారు శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయాధికారులు. ఈ గ్రంథాన్ని ముచ్చటగా అతి స్వల్ప కాలంలో ముద్రించిన వారు శ్రీ అన్నపూర్ణ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, నెల్లూరు వారు.

అందరికీ నా హృదయపూర్వక ధన్యవాదాలు.

— మెహర్‌మణి.

# విజ్ఞాన సర్వస్వం

డా॥ శ్రీమతి మెహర్‌మణిగారి "మద్రాసు తెలుగు - సామాజిక భాషా పరిశీలన" అన్న పిహెచ్. డి. సిద్ధాంత వ్యాసం ఒక విజ్ఞాన సర్వస్వం. తక్కిన విజ్ఞాన సర్వస్వాలకు, ఈ విజ్ఞాన సర్వస్వానికి తేడా ఉంది. అవి బహు కర్తృకాలైతే, ఇది ఏక కర్తృకం. అవి దాదాపు సమగ్రాలైతే, ఇది సర్వసమగ్రం. తక్కిన విజ్ఞాన సర్వస్వాలకు నిర్దేశకుడు ఉంటాడు. ఈ విజ్ఞాన సర్వస్వానికి అధికారిక నిర్దేశకుడు లేక పోవడం మరో ప్రత్యేకత.

"మద్రాసు తెలుగు - సామాజిక భాషా పరిశీలన" - అన్న సిద్ధాంత వ్యాసాన్ని చదివితే మద్రాసు నగరానికి చెందిన విషయాలన్నీ అంటే భౌగోళిక, రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంఘిక, వైజ్ఞానిక, విద్యా విశేషాలు ఎన్నో తెలియవస్తాయి.

"యదిహాస్తి తదన్యత్ర
యన్నేహాస్తి నతత్ క్వచిత్"

ప్రపంచంలో ఉన్నదంతా మహాభారతంలో ఉంది. మహాభారతంలో లేనిది మరెక్కడా లేదన్నట్లు మద్రాసు నగరానికి సంబంధించిన అన్ని విషయాలు ఈ సిద్ధాంత వ్యాసంలో ఉన్నాయి. మద్రాసు నగరానికి సంబంధించి ఈ సిద్ధాంత వ్యాసంలో లేనివి మరెచ్చట లేవనడంలో అతిశయోక్తికాదేమో!.

ఈ సిద్ధాంత వ్యాసాన్ని రెండు భాగాలు చేసి పరిశీలించవచ్చు. మొదటిది మద్రాసు నగరానికి చెందిన విశేషాల వివరణ. ఈ భాగాన్ని చదివినంత వరకు ఏదో చరిత్రను చదివిన అనుభూతినికాక, ఒక చారిత్రక నవలను చదివిన అనుభూతిని పొందుతారు పాఠకులు. సత్యానికి భంగం కలుగకుండా విషయ సమగ్రతతో ఆకర్షణీయమైన శైలీ విన్యాసంతో సిద్ధాంత వ్యాసాన్ని నడిపారు. డా. మెహర్‌మణిగారు, ఈ భాగం ఈ సిద్ధాంత వ్యాసంలో రాబోయే భాషా విశ్లేషణకు మంచి పునాదిగా పని చేసింది. ఈ భాగం పరిశోధకురాలి విషయ సేకరణ సామర్థ్యానికి, పరిశోధనాసక్తికి నిదర్శనం.

ఇక రెండవ భాగం సామాజిక భాషా విషయక సిద్ధాంత వ్యాసం. ఈ భాగమంతా డా. మెహర్‌మణిగారి సొంతమని చెప్పాలి. భాషా పరంగా ఒక సిద్ధాంతాన్ని చేయాలంటేనే ఎంతోకష్టపడాలి. ఈ సిద్ధాంత వ్యాసంలో కొన్ని వందల సిద్ధాంతాలు చేయబడ్డాయి. ఇన్ని సిద్ధాంతాలు చేయడానికి ఈ పరిశోధకురాలు ఎంత కష్టపడి ఉంటారో !

"విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్" అన్నట్లుగా పరిశోధకుని

పరిశ్రమ పరిశోధకుడే తెలిసికోగలడు కాని అన్యులు కాదు. మెహర్‌మణిగారి శ్రమకు, బుద్ధి కుశలతకు ఈ సిద్ధాంత వ్యాసంలోని పట్టికలు అద్దం పడతాయి.

ఏదో డిగ్రీవస్తే చాల్లే అనే భావనతోకాక, తాను తీసుకున్న అంశానికి న్యాయం చేకూర్చాలన్న దీక్షతో సిద్ధాంత వ్యాసాన్ని రచించారు - డా. మెహర్‌మణి గారు. ఈ సిద్ధాంత వ్యాసాన్ని గురించి నేనెంత చెప్పినా తక్కువే అవుతుంది. సిద్ధాంత వ్యాసాన్ని చదవండి మీకే తెలుస్తుంది - నామాటలోని సత్యం, సిద్ధాంత వ్యాసంలోని విలువ.

పరిశోధనా ప్రమాణాలు పడిపోతూన్న ఈ రోజుల్లో డా. మెహర్‌మణి గారు ఒక ప్రామాణిక సిద్ధాంత వ్యాసాన్ని రచించి భావి పరిశోధకులకు మార్గదర్శకులయ్యారు. అందుకు ఆమెను అభినందిస్తూ డా. మెహర్‌మణి లాంటి పరిశోధకురాలు నా విద్యార్థి అని చెప్పకోవడానికి గర్విస్తూ మెహర్‌మణిగారు ఇలాంటి గ్రంథాల్ని భవిష్యత్తులో అనేకం రచించాలని ఆకాంక్షిస్తున్నాను.

ఆశీస్సులతో

**అక్కిరెడ్డి.**

# విషయ సూచిక



## అనుబంధాలు

## ఒక మాట

భాష సమాజంలో వ్యక్తుల మధ్య సుస్థిరమైన సంబంధాన్ని నెలకొల్పి ఆ బంధాన్ని పెంపొందిస్తుంది. వ్యక్తి మాటను, ఉచ్చారణను బట్టి అతని ప్రాంతం సాంఘిక స్థితి గతుల్ని గుర్తించవచ్చు.

భాషకు, సమాజానికి మధ్య దగ్గర సంబంధముండడం వల్ల భాషలో సమాజం ప్రతిఫలిస్తుంది. సాంఘిక సామాజిక పరిస్థితుల వల్ల, జాతి, మత, వర్గ, లింగ భేదాల వల్ల, ప్రాంతీయత, పరిసర ప్రభావాల్ని బట్టి భాషలో మార్పులేర్పడతాయి. సాంఘికస్థితి గతులతో పాటు, సామాజిక విలువలు కూడా భాషని ప్రభావితం చేస్తాయి.

ఆంధ్ర దేశంలో వున్న మాండలికాలతో పాటు మద్రాసు తెలుగును కూడా ఒక ప్రత్యేక మాండలికంగా పేర్కొంటూ పరిశోధక వ్యాసాలు వెలువడ్డాయి. ప్రత్యేక మాండలికంగా పేర్కొనబడ్డ మద్రాసు తెలుగు భాషా స్థితి గతులపై పరిశోధన చేయాలనే భావనతో ఈ అంశాన్ని పరిశోధనకు స్వీకరించడం జరిగింది.

మూడు శతాబ్దాల కాలంగా పరభాషా వ్యవహర్తల మధ్య వుండి, భిన్న భాషా సంస్కృతులకు నిలయమైన మద్రాసు తెలుగు భాషలో కొన్ని ప్రత్యేక లక్షణాలు కనిపిస్తున్నాయి. ఆ ప్రాంతానికి సంబంధించిన సామాజిక భాషా పరిశీలన చేసి మద్రాసు తెలుగువారి భాషా సంస్కృతులు ఆంధ్రుల భాషా సంస్కృతుల కంటే ఎలా భిన్నంగా వున్నాయో ఇందులో నిరూపించ బడింది.

'Madras Statistical Department' తయారు చేసిన Census Reports మద్రాసు నగర పురపాలక సంఘ రెవిన్యూ డిపార్ట్‌మెంటు వారు పరిపాలనా సౌకర్యం కొరకు విభజించుకొన్న 'Tamil Nadu Government Gazette - Part II Section 2' లోని Madras City and environs topographical Maps వ్యవహర్తలను ఎన్నుకోడానికి ఆధారమయ్యాయి.

వ్యవహర్తల కులం, ప్రాంతం, భాషా వైవిధ్యానికి కారణాలవుతాయి కాబట్టి మద్రాసు నగర జనాభాలో అయిదు శాతం కంటే ఎక్కువగా వున్న కులాలకు సంబంధించిన వ్యక్తుల్ని వ్యవహర్తలుగా స్వీకరించడం జరిగింది. రెడ్డి, నాయుడు, దేవాంగ, బ్రాహ్మణ, వైశ్య, విశ్వ బ్రాహ్మణ, చాకలి, మాల, మాదిగ అనే తొమ్మిది కులాలు మాత్రమే పరిశోధనార్థం తీసుకోబడ్డాయి. ఒక్కొక్క కులానికి ఇద్దరు చొప్పున మొత్తం పద్దెనిమిది మంది వ్యవహర్తలను తీసుకోవడం జరిగింది. లింగ భేదాన్ననుసరించి ఒక్కొక్క కులానికి ఒక స్త్రీ, ఒక పురుషుడు, విద్యార్హతల్ని బట్టి ఒకరు చదువుకొన్నవారు, ఒకరు చదువులేని వారుగా స్వీకరించడం జరిగింది. మద్రాసు నగరం భౌగోళికంగా ఉత్తర దక్షిణ మద్రాసులుగా విభజింప బడింది. ప్రాంతీయతను బట్టి ఒక వ్యవహర్త ఉత్తర మద్రాసు నుండి మరొక వ్యవహర్త దక్షిణ మద్రాసు నుండి గ్రహింపబడ్డారు. ప్రత్యేకంగా తయారు చేయబడ్డ ప్రశ్నావళి సహాయంతో వ్యవహర్తలతో ముఖాముఖీ సంభాషించి సంభాషణ టేప్‌చేసి పరిశీలించడం జరిగింది.

ఈ సిద్ధాంత వ్యాసం తొమ్మిది అధ్యాయాలుగా విభజించబడింది. 'సామాజిక భాషా సంబంధాలు' అనే మొదటి అధ్యాయంలో సమాజానికి, భాషకు గల సంబంధం, సామాజిక భాషా శాస్త్ర నిర్వచనం, ప్రయోజనం. పరిశోధనా పరిధి, ఉద్దేశం మున్నగు అంశాలు వివరింపబడ్డాయి. రెండవ అధ్యాయంలో మార్పుల కాలవాలమైన మద్రాసు నగర పుట్టుక, చరిత్ర, వికాసం వివరించబడింది. 'మద్రాసు నగర ప్రజా జీవన సరళి' అనే మూడో అధ్యాయంలో మద్రాసు నగర సాంఘిక, సామాజిక, ఆర్థిక స్థితిగతులు, మద్రాసులోని తెలుగువారి కులాలు, వారి ఆచార వ్యవహారాలు, సాంఘిక, సామాజిక, ఆర్థిక, భాషా పరంగా నగరంలో వారికున్న స్థానం మున్నగు విషయాలు చెప్పబడ్డాయి.

అన్య భాషా ప్రభావం అనే నాల్గో అధ్యాయంలో ఆయా భాషలు ఏ విధంగా మద్రాసు తెలుగును ప్రభావితం చేశాయనే విషయం వివరింపబడింది.

మద్రాసు తెలుగు భాషలోని వర్ణాల వ్యాప్తిని నిర్ణయించి మద్రాసు తెలుగు భాషా పదాల్ని ప్రామాణిక తెలుగు భాషా పదాల్తో పోల్చి ధ్వని సంబంధమైన మార్పుల్ని గుర్తించి అవి ఏర్పడ్డానికి కారణాలు, ఏర్పడిన పరిస్థితులు అయిదవ అధ్యాయంలో వివరించబడ్డాయి. మద్రాసు తెలుగు భాషా రూప నిర్మాణ విధానం ఆరవ అధ్యాయంలో చెప్పబడింది. మద్రాసు తెలుగు భాష సంధి స్వరూపం ఏడవ అధ్యాయంలో వివరించబడింది.

మద్రాసు తెలుగు భాష - సాంఘిక విశేషాలు అనే ఎనిమిదవ అధ్యాయంలో సాంఘిక, సామాజిక, ఆర్థిక పరిస్థితులు, మత, జాతి విభేదాలు, భాషపై ఎటువంటి ప్రభావాన్ని చూపిస్తాయో, వాటి ప్రభావంవల్ల మద్రాసు తెలుగు భాష ప్రామాణిక తెలుగు భాషకంటే విలక్షణమై ప్రత్యేకతను ఎలా సంతరించుకుందో వివరించబడింది.

'పరిశోధనా ఫలితాలు' అనే చివరి అధ్యాయంలో మద్రాసు తెలుగు సామాజిక భాషా పరిశీలన వల్ల తేలిన ఫలితాలు, మద్రాసు తెలుగుపై ఇంకా జరగాల్సిన పరిశోధన, మద్రాసు తెలుగు భాషా పరిశోధకులకు సూచనలు పేర్కొనబడ్డాయి.

ఈ సిద్ధాంత వ్యాసానికి మద్రాసు నగర పురపాలక సంఘ విభాగాలు, అన్యదేశ్యాలు ప్రత్యేక పదజాలం, వ్యవహర్తల వివరణ, ప్రశ్నావళి అనే ఐదు అనుబంధాలు చేర్చబడ్డాయి.

ఈ సిద్ధాంత వ్యాసంలో మద్రాసు సామాజిక భాషా పరిశీలన చేయబడింది. నా ఈ పరిశోధన భావి పరిశోధకులకు కొంతైనా వుపకరిస్తే నా ప్రయత్నం సఫలమయిందని భావిస్తాను.

*******

## సంక్షిప్తాల వివరణ

| | | |
|---|---|---|
| 1. | ఏ. వ. | ఏక వచనం |
| 2. | ప్రా. తె. | ప్రామాణిక తెలుగు |
| 3. | బ. వ. | బహువచనం |
| 4. | బాల.వ్యా | బాల వ్యాకరణం |
| 5. | మ.తె. | మద్రాసు తెలుగు |
| 6. | శ॥ | శతాబ్దం |
| 7. | సం॥ | సంవత్సరం |

# 1. సామాజిక భాషా సంబంధాలు

సామాజిక భాషా సంబంధాలు అనే ఈ అధ్యాయంలో సమాజానికి భాషకిగల సంబంధం, సామాజిక భాషాశాస్త్ర నిర్వచనం, ప్రయోజనం, పరిశోధనా పరిధి, ఉద్దేశం మున్నగు అంశాలు పరిశీలింపబడతాయి.

మానవుని మనోగత భావాల్ని వ్యక్తీకరించడానికి వుపకరించే సాధనం భాష. భాషకు, సమాజానికి, సంస్కృతికి సంబంధముంది. భాష నిర్వచనాన్ని, భాషప్రయోజనాన్ని, గూర్చి అనేకులు అనేక విధాలుగా చెప్పారు. "A language is a Complex system of speech habits"[1] 'అలవాట్ల సంక్లిష్ట వ్యవస్థే భాష' అని హాకెట్ అభిప్రాయం.

"Language is not simply a means of Communicating information but also a very important means of establishing and maintaining relationships with other people"[2]

భాష భావ వ్యక్తీకరణ సాధనం మాత్రమే కాక ఇతర వ్యక్తులతో, సంఘంలో సంబంధాన్ని ఏర్పరచి వృద్ధి పొందించడంలో కూడా సహకరిస్తోంది.

"Language is both an expression of culture as well as vehicle for Cultural Transmission it is both a cause and an Index of a social and cultural change"[3] భాష సంస్కృతి బింబమే కాదు. సంస్కృతి విస్తరణ సాధనం కూడాను. అది సాంఘిక సాంస్కృతిక మార్పులకు కారణమే కాక ఆరెంటి సూచికూడాను.

కరుణాకరన్‌గారు భాషనుగూర్చి "Language is a powerful medium of communication, and it is used to carry out the formal and informal social functions of the society"[4]

భాషకి సమాజానికి సన్నిహితమైన సంబంధం వుంది. భాష లేకుండా మానవ మాజం మనలేదు. భాష మానవుడికి సమాజానికి మధ్య వారధి లాంటిది. వ్యక్తిగత వితానికి, సమాజంలో అతని మనుగడకి ఆధారభూత మయ్యేది భాష. భాష ఒక వ్యక్తికి ంరొక వ్యక్తికి మధ్య మాత్రమేకాక ఒక కుటుంబానికి మరొక కుటుంబానికి మధ్యకూడా ం దాన్ని చూపిస్తుంది.

భాషలో సమాజం ప్రతిఫలిస్తుంది. అందువల్ల సాంఘిక సామాజిక మార్పులు భాషా వైవిధ్యానికి దారితీస్తాయని చెప్పవచ్చు. పరిసర ప్రభావం, సామాజిక స్థితిగతులేకాక, సాంఘిక విలువల ప్రభావంకూడా భాషపై వుంటుంది.

---

1. Hocket : "A Course in Modern Linguistics" - P. 137
2. Peter Trudgill : "Socio Linguistics" -An Introduction. P. 13
3. D. P. Patnayak : "Language, Culture and Science" - Multilingualism and Mother Tongue Education - Mysore 1981. P.4
4. Karunakaran : "Studies in Tamil sociolinguistics" P. 28

భాషా శాస్త్ర విభాగాల్లో ఒక నూత్న భాగంగా భాషా పరిశోధకులచే గుర్తింపబడింది సామాజిక భాషా శాస్త్రం. దీని ఆవశ్యకతని ప్రపంచ భాషావేత్తలు ఇప్పడిప్పడే గుర్తిస్తున్నారు. "Sociolinguistics is a branch of linguistics which studies the links between language and Society"[5] భాషకు సంఘానికి వుండే సంబంధాన్ని అధ్యయనం చేసే సామాజిక భాషా శాస్త్రం భాషా శాస్త్రంలో ఒక విభాగం.

సామాజిక భాషాశాస్త్రాన్ని Bright ఈ విధంగా నిర్వచించాడు. "Socio linguistics is an important and major branch of linguistics deals with the speech behaviour in its social context."[6] వ్యవహర్తయొక్క సాంఘిక ప్రవర్తనను తెలియజేసే సామాజిక భాషా శాస్త్రం భాషా శాస్త్రంలో అతిముఖ్యమైన బృహత్తర విభాగం.

"Sociolinguistic surveys help the process of standardization in the following ways : to enrich the vocabulary of the language, and to modernize the lexicon and grammer. This implies cooperation between researchers, planners, policymakers and educationists."7

సామాజిక బాషాశాస్త్రం భాషా పదజాలాన్ని పెంపొందించడానికి, పదజాలాన్ని వ్యాకరణాన్ని ఆధునీ కరణం చేయడానికి వుపకరిస్తుంది. అంటే పరిశోధకుల మధ్య విద్యావేత్తలమధ్య, యోచకుల మధ్య, తాంత్రికుల మధ్య సహకారాన్ని కలుగజేస్తుందని భావం.

భాషలో మార్పు సహజం. ఈ మార్పుకి కారణం సాంఘిక, భౌగోళిక, సామాజిక రాజకీయ పరిస్థితులు. సమాజపరంగా భాషలో ఏర్పడే మార్పుల్ని సామాజిక భాషా శాస్త్రం వల్ల తెలుసుకోవచ్చు. వ్యక్తి విద్య, అతనికి సంఘంలో గల స్థానం. అతని ఆర్థిక స్థితిగతులు అతని భాషను ఎలా ప్రభావితం చేస్తాయో ఈ సామాజిక భాషా శాస్త్రం తెలియజేస్తుంది.

కాలాను గతంగా ప్రాచీన భావాలు ఆచారాలు పోయి నాగరికుల్లో ఆధునిక భావాలు ఏర్పడడం వల్ల సాంఘిక మార్పులు ఏర్పడతాయి. సాంఘిక, సామాజిక మార్పులు భాషను ప్రభావితం చేస్తాయి. కాబట్టి సామాజిక భాషాశాస్త్రం సహాయంతో సంఘంలో ఏర్పడే మార్పుల్ని భాషను ఆధారంగా చేసుకొని తెలుసుకోవచ్చు.

భాష కూడా ఒక సాంఘిక శాస్త్రమే. కాబట్టి చరిత్ర, సాంఘిక చరిత్ర మొదలైన సాంఘిక శాస్త్రాలతో సామాజిక భాషాశాస్త్రానికి కూడా సన్నిహిత సంబంధముంటుంది. చరిత్ర ప్రాచీన భాషా స్వరూపాన్ని తెలుసుకోవడానికి ఉపకరిస్తుంది. సమాజ తత్వ శాస్త్రం సంఘంలోని వర్తమాన స్థితిగతుల్ని పరిశీలిస్తుంది. మారుతున్న ఆచార వ్యవహారాల్ని భాషా రూపాలు ఏర్పడే విధానాన్ని సామాజిక భాషాశాస్త్రం ద్వారా తెలుసుకోవచ్చు.

---

5. Peter Trudgill : "Sociolinguistics" An Introduction. P. 14
6. Bright W. : "Sociolinguistic Variation and language Change - 1962 P. 32.
7. Karunakaran : "Studies in Tamil sociolinguistics".

"Socio linguistics is that part of linguistics which is concerned with language as a social and cultural phonomenon. It makes use of the subject matter. methodology or findings of the other social sciences like socialogy, social anthropology social Psychology etc"[8] - భాషా శాస్త్రంలో ఒక భాగమైన సామాజిక భాషా శాస్త్రం భాషా సంబంధిత సాంఘిక, సాంస్కృతిక దృగ్విషయం. ఇది సాంఘిక మానవ శాస్త్రం, సాంఘిక మానసిక శాస్త్రం, సమాజ శాస్త్ర సంబంధిత విషయాల్ని అనువర్తన విధానాన్ని వుపయోగించు కుంటుంది. అని Peter Trudgill సామాజిక భాషా శాస్త్ర నిర్వచనం అని ప్రయోజనాన్ని తెలియజేశాడు.

## 1.1 పరిశోధనా ఉద్దేశం - పరిధి

భారత దేశంలోని బహు భాషా వ్యవహృత ప్రాంతాల్లో మద్రాసు నగరం అతి ముఖ్యమైంది. భారత దేశంలోని భిన్న జాతులకు, వర్గాలకు, కులాలకు, భాషలకు, సంస్కృతులకు సంబంధించిన ప్రజలు మద్రాసు నగరానికి వలస వచ్చి ఒకటిగా కలిసి జీవిస్తున్నారు. ఈ ప్రజలు మద్రాసు నగరానికి రావడానికి కారణాలు అనేకం. 1. వృత్తి 2. వ్యాపారం 3. విద్య. అంతేకాక పట్టణ నాగరికతకు, సంస్కృతికి ఆకర్షితులై వలసపోవడంకూడ జరుగుతుంది. కుటుంబ తగాదాలు, సాంఘిక ఘర్షణలు, వ్యవసాయం లాభసాటికాక పోవడం, సాంస్కృతికమైన అనేక కారణాల వల్ల ఈ రకమైన వలస యేర్పడింది.

కుటుంబంలో సంపాదించు వార్ననుసరించి వలస వచ్చే పద్ధతి మరొకటుంది. ఇంతే కాక వైవాహిక కారణాలవల్ల, ఉద్యోగ బదిలీల వల్ల వలస పోవడం జరుగుతుంది. సాధారణంగా వలస పోవడం అవసరార్థం జరుగుతుందే కాని అభిరుచులవల్లకాదు. ఈ కారణాలవల్ల భారతదేశంలోని నలుమూలలనుండి ప్రజలు మద్రాసు నగరానికి రావడంవల్ల ఈ నగరం భిన్న, భాషా సంస్కృతులకు నిలయమై ప్రత్యేకతను సంతరించుకొంది.

చిరకాలంగా భిన్న భాషా వ్యవహర్తల మధ్య నున్న తెలుగు భాష ఆయాభాషా సంస్కృతుల ప్రభావం వల్ల ప్రత్యేకతను సంతరించుకొని ఒక ప్రత్యేక మాండలికంగా ఏర్పడ్డట్టు పూర్వపు పరిశోధనలు నిరూపించాయి.

మద్రాసు నగరం లాంటి బహుశాబ్ద వ్యాప్తిగల ప్రాంతంలోని భాషను తీసుకొని సామాజిక భాషా పరిశీలన చేస్తే ఆ భాషలోని విలక్షణతను గుర్తించవచ్చుననే ఉద్దేశంతో మద్రాసు తెలుగును నా పరిశోధనార్థం గ్రహించడం జరిగింది.

ప్రత్యేక మాండలికంగా పరిగణింపబడుతున్న మ. తె. ను ప్రా. తె. తో పోల్చి సామాజిక భాషా పరంగా మ. తె. విలక్షణతను గుర్తించాలనే ఉద్దేశంతో "మద్రాసు తెలుగు సామాజిక బాషా పరిశీలన" అనే అంశాన్ని నా పరిశోధనాంశంగా తీసుకొన్నాను.

---

Peter Trudgill : "Socio linguistics - An Introduction" P. 32

ఒక భాషని సామాజిక దృష్టితో పరిశీలించాలంటే ఆ భాష వ్యవహరింపబడే ప్రాంతంలోని సాంఘిక ఆర్థిక స్థితిగతుల్ని సంపూర్ణంగా తెలుసుకోవాలి. తమిళనాడు రాష్ట్రాన్ని అంతటినీ స్వీకరించి విషయ సేకరణ చేయడం కష్టమనే భావనతో నా పరిశోధనను మద్రాసు నగరానికి (Madras City) మాత్రమే పరిమితం చేసుకున్నాను.

మద్రాసు నగరంలోని పురపాలక సంఘ విభాగాలు మొత్తం 150. మద్రాసు నగరం దక్షిణ మద్రాసు, ఉత్తర మద్రాసు అని రెండుగా విభజింపబడింది.

మద్రాసు నగరంలో భిన్నకులాలకు భిన్న సాంఘిక స్థాయికి, భిన్న ప్రాంతాలకు చెంది భిన్న విద్యార్హతలు కల్గిన వారిని వ్యవహర్తలుగా స్వీకరించడం జరిగింది. వ్యవహర్త సాంఘిక స్థాయి, భాషా జ్ఞానం, భాషా భేదం, వ్యవహర్త నివాస స్థలానికి సంబంధించి, వ్యవహర్త సాంఘింక, సామాజిక కార్యకలాపాలకు సంబంధించి, వ్యవహర్త స్వీయాభిప్రాయాలు ప్రమాదాలు, పోట్లాటలు, వ్యవహర్త జీవిత ధ్యేయం, ఆశయాలు, వ్యవహర్త దిన చర్య మొదలైన వాటికి సంబంధించిన ప్రశ్నలువేసి, వాటి మూలంగా వచ్చిన జవాబులను టేపు రికార్డు చేసి వివరంగా పరిశీలించడం జరిగింది. నా పరిశోధనార్థం స్వీకరింపబడ్డ 18 మంది వ్యవహర్తలు, మద్రాసులో నివసించే స్థలాలు రేఖా పటంలో గుర్తించబడి అనుబంధంలో ఇవ్వబడింది.

సామాజిక భాషా పరిశీలనలో ధ్వనివిజ్ఞానం, రూప నిర్మాణ విజ్ఞానం, అర్థవిజ్ఞానం ముఖ్యమైనవి. సామాజిక భాషా పరిశీలనకు వాక్య విజ్ఞాన పరిశీలన అంతగా తోడ్పడదనే భావనతోను, సిద్ధాంత వ్యాసం పెరిగి పోతుందనే భావనతోను ఈ సిద్ధాంత వ్యాసంలో వాక్య విజ్ఞానాన్ని చేర్చలేదు. సాంఘిక విశేషాలపై దృష్టిని కేంద్రీకరించి పరిశోధన సాగించడం జరిగింది.

*******

# 2. మద్రాసు నగర పుట్టుక చరిత్ర వికాసం

## 2.1. మద్రాసు నగరం పుట్టుక :

మద్రాసు నగరం దక్షిణ భారత దేశానికి సింహద్వారం లాంటిది. ఈ నగరం పుట్టుకకు ఒక కారణం, దీని అభివృద్ధికి ఒక చరిత్ర ఉన్నాయి. మద్రాసు స్థలనామాన్ని గూర్చి చరిత్రకారుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ అభిప్రాయాలన్నీ 'మద్రాసు నగర స్థలనామాలు' అనే సిద్ధాంత వ్యాసంలో సమగ్రంగా వివరించబడ్డాయి.[1] అందువల్ల ఆ విషయాలన్నీ ఈ సిద్ధాంత వ్యాసంలో చర్చించలేదు.

నేటి మద్రాసు నగరం బ్రిటిషు వారు భారత దేశానికి రాకపూర్వం చిన్న గ్రామాలుగా ఉండేది. బ్రిటిషువారికి అది వ్యాపార కేంద్రంగా మారి క్రమ వికాసాన్ని పొంది మహానగరంగా రూపొందింది.

1653 సంవత్సరానికి పూర్వం నుండి జావాలోని బాంటం (Bantum) అధినేతకు సామంత రాజ్యంగా వుండిన మద్రాసు పట్నం క్రమేపి వృద్ధిపొంది 1702 నాటికి స్వతంత్ర ప్రతిపత్తిని పొందింది. 1743 నాటికి ఈ నగరం దక్షిణ భారత దేశంలో పెద్ద నగరంగా రూపొందింది.

నేడు మద్రాసు నగరాన్ని సందర్శించిన వారెవరైనా అనుకూలము, ఉపయుక్తము, స్వాభావికము, లాభకరం కాని సముద్రతీరంలో బీటలు వేసిన ఇసుక ప్రాంతాన్ని మద్రాసు నగర నిర్మాణానికి ఎలా ఎన్నుకున్నారని ఆశ్చర్యపడక తప్పదు. "The choice was fortuitions rather than deliberate and was governed by political rather than geographical considerations"[2] ఈ ప్రదేశాన్ని నగర నిర్మాణానికి ఎన్నుకోవడం ఆకస్మికంగా జరిగిందేకాని బుద్ధిపూర్వకంగా జరగలేదు. భౌగోళిక పరిస్థితులకంటే రాజకీయ పరిస్థితులే ఈ నగర నిర్మాణానికి దారి తీశాయి అని రాన్సన్ అన్నారు.

17 వ శతాబ్దపు మధ్య భాగంలో బ్రిటిషువారు భారత దేశంలో స్థిరపడి మద్రాసు నగర ఆవిర్భావానికి పునాది వేశారు. యూరపు దేశీయులు తూర్పుతీర ప్రాంతంలో ఎక్కువగా నూలుగుడ్డలు ఆ ప్రాంతంలోని సాలెవాండ్ల నుండి కొని విదేశాలకు ఎగుమతి చేస్తుండేవారు. డచ్చివారు పులికాట్ సరస్సు ప్రాంతంలో వ్యాపారం చేస్తుండేవారు. బ్రిటిషు

1) కొత్తపల్లి సరస్వతీదేవి - "మద్రాసు నగర స్థలనామాలు" ఎమ్. ఫిల్. సిద్ధాంతవ్యాసం. 1980

2. C.W. Ranson : "A City in Transition" - Studies in the social life of Madras -1938 P.P. 99

వ్యాపారులు పులికాట్ సరస్సుకు ఉత్తరంగా వున్న ఆర్మగోన్ ప్రాంతంలో వ్యాపారం చేస్తుండేవారు. కాని ఆ ప్రాంతం వారికి అనుకూలంగా లేకపోవడం వల్ల అక్కడినుండి వేరేచోటికి మార్చదలిచారు.

ఆర్మగోన్ (Armagon) కర్మాగారానికి ప్రధానాధికారియైన ఫ్రాన్సిస్ డే (Fransis day) విజయనగర రాజుల పాలనలో, పులికాట్ సరస్సు నుండి సాంధోమ్ వరకు గల ప్రాంతానికి గవర్నరుగా వ్యవహరించు దామెర్ల వెంకటాద్రి తమ్ముడైన దామెర్ల అయ్యప్ప నాయకుని కలిసి, 1639 లో మద్రాసు గ్రామానికి సమీపంలో కోట నిర్మించుకోడానికి కొంత స్థలం పొందడం మాత్రమే కాక, నాణేలను ముద్రించి వారికిచ్చిన ప్రాంతంలో చలామణి చేసుకోడానికి, ఆ ప్రాంతంలో వచ్చే పన్నుల రాబడిలో కొంత భాగం పొందడానికి, ఓడరేవులో సుంకాలు వసూలు చేసుకోడానికి అనుమతి పొందారు.

సెయింట్ జార్జి కోటను నిర్మించిన తరువాత, దానికి ఉత్తరంగా ఉన్న ప్రాంతాన్ని చెన్నపట్నంగా, దక్షిణంగా ఉన్న ప్రాంతాన్ని మద్రాసుగా వ్యవహరించారు. ఆంగ్లేయుల పరిపాలనలో ఈ రెండు గ్రామాలు ఒకటిగా చేరిపోయి క్రమ వికాసాన్ని పొందాయి. ఒకటిగా చేరిపోయిన ఈ ప్రాంతాన్ని దేశీయులు చెన్న పట్నమని, విదేశీయులు మద్రాసని, వ్యవహరించారు.

## 2.2. మద్రాసు నగరం చరిత్ర

1639 లో సెయింట్ జార్జి కోటను నిర్మించి బ్రిటిషువారు వ్యాపారాన్ని అభివృద్ధి చేస్తున్న సమయంలో 1646లో మద్రాసు గోల్కొండ నవాబుల వశమయింది. తిరిగి గోల్కొండ పతనం తరువాత మద్రాసు ప్రాంతం 1687 లో మొగలుల కైవశమయింది. వారి కాలంలోనే ఆంగ్లేయులు ఈస్టిండియా కంపెనీని స్థాపించడానికి అనుమతి పొందారు. భారత దేశంలో బ్రిటిషువారు సామ్రాజ్యాన్ని స్థాపించడానికి ఇదే పునాదయింది. 17 శ॥ ఉత్తరార్ధంలో వివిధ గవర్నర్ల పాలనలో మద్రాసు ప్రత్యేక చరిత్రను సంతరించుకొంది.

1687 లో ఎలిహీఏల్ (Elihi Yale ) గవర్నరుగా నియమింప బడ్డాడు. ఈ గవర్నరు పరిపాలనా కాలంలో పురపాలక సంఘం ఏర్పాటు చేయబడింది.

1698 లో థామస్ పిట్ (Thomas Pitt) గవర్నరుగా నియమింపబడ్డాడు. ఈ కాలంలో మద్రాసు నగరం ఆర్థిక, వ్యాపార రంగాల్లో గుర్తింపదగిన అభివృద్ధిని సాధించింది.

నికోలాస్ మోర్స్ (Nicholas Morse) గవర్నరుగా ఉన్న కాలంలో (1744-46) ఇంగ్లీషు వారికి, ఫ్రెంచి వారికి యుద్ధం ప్రారంభమయింది. 1744 లో ఫ్రెంచి వారికి మద్రాసు కైవశమయింది. తిరిగి 1749 లో మద్రాసు బ్రిటిషు వారి ఆధీనంలోకి వచ్చింది. 1755 నుండి 1763 వరకు జార్జి పిగోట్ (George Pigot) గవర్నరుగా వున్నప్పుడు మద్రాసు నగరంలో ఈస్టిండియా కంపెనీ వారు వ్యాపార పాలక సంఘాన్ని (Trading Corporation) ప్రప్రథమంగా నెలకొల్పారు. పరిసర ప్రాంతంలో వున్న చిన్న చిన్న గ్రామాల్ని

కోటల్ని, కర్మాగారాల్ని, ఈ సంఘ అధీనంలోకి తెచ్చారు. ఈ కారణంగా కంపెనీ అధికారం మరింత ప్రబలింది.

1767 లో చార్లెస్ బుచ్చర్ (Charles Bouchier) గవర్నరయ్యాడు. సేనా నిర్వహణ కోసం 1768 లో మద్రాసు సమీపంలోని చెంగల్‌పట్ ఆంగ్లేయుల ఆధీనంలోకి వచ్చింది.

1781 లో లార్డ్ మెకర్టనీ (Lord Macartney) మద్రాసు గవర్నరయ్యాడు. ఈ కాలంలో మద్రాసు అతి ముఖ్యమైన నౌకాశ్రయమయింది.

మేజర్ జనరల్ మెడోస్ (Major General Medows) గవర్నరయ్యాడు. ఈ కాలంలో దక్షిణ భారత దేశంలో ఆంగ్లేయుల స్థానం సుస్థిరమయింది. డచ్చి, ఫ్రెంచి మొదలైన విదేశీయ శక్తుల్ని అణచివేసి కంపెనీ స్థిరత్వాన్ని పొంది వ్యాపార రీత్యా అత్యంత అభివృద్ధిని సాధించింది.

1803-1820 మధ్య కాలంలో సర్ ఎడ్వర్డ్ ఇలియట్ (Sir Edward Elliot) గవర్నరుగా వున్నప్పుడు అనేక సంస్థలు ఏర్పడ్డాయి. ఎడ్వర్డ్ ఇలియట్ 1814 లో మన్రో (Munro) అధ్యక్షతలో న్యాయ సంస్థను నెలకొల్పాడు. ఈ సంస్థ పరిపాలనకు సంబంధించి అనేక మార్పుల్ని చేసింది. 1820 లో సర్ థామస్ మన్రో (Sir Thomas Munro) గవర్నరుగా నియమింపబడి 1827 వరకు కొనసాగాడు. మన్రో అక్షరాస్యతను పెంచడానికి ఎంతో కృషి చేసాడు. మొట్టమొదటి సారిగా ఆంగ్ల విద్యను మద్రాసులో నెలకొల్పింది ఈయనే. అంతేకాక "Board of Public instructions" అనే పేరుతో ఒక సంస్థని ఏర్పరచి సామాన్య విద్యని అభివృద్ధి పరచడానికి ఎంతో కృషి చేశాడు.

19 వ శ॥ ప్రారంభంలో సాంకేతిక, వృత్తి విద్యాలయాల స్థాపనకు ప్రాముఖ్యత ఇవ్వబడింది. 1862 లో మద్రాసులో ఉన్నత న్యాయస్థానం ఏర్పాటు చేయబడింది. 1845 లో రైల్వే కంపెనీ ఏర్పాటు చేయబడింది. 1858 లో మద్రాసు ప్రధాన కేంద్రంగా దక్షిణ భారత రైల్వే సంస్థ ఏర్పడింది.

1872 నుండి 75 వరకు గవర్నరుగా వుండిన లార్డ్‌హోబర్ట్ (Lord Hobart) మద్రాసులో మొట్టమొదటి సారిగా నౌకాశ్రయ ప్రణాళికను ప్రవేశ పెట్టాడు. 20 వ శ॥ ప్రారంభం నుండి క్రమంగా గవర్నర్ల అధికారాలు తగ్గుతూ వచ్చాయి. 1947 ఆగష్టు 15న బ్రిటిషువారు భారత దేశాన్ని విడిచి పెట్టినా బ్రిటిషువారి పరిపాలనకు స్మృతి చిహ్నంగా మద్రాసు పట్టణం నిలిచి పోయింది.

## 2.3 మద్రాసు పట్టణం క్రమవికాసం

ఆంగ్లేయులు మద్రాసులో కోటను నిర్మించిన తరువాత తమ అధికారాన్ని చుట్టు పక్కల వున్న చిన్న చిన్న గ్రామాలకు విస్తరింపజేసి, వాటిని కంపెనీ అధీనంలోకి తెచ్చారు.

పరిపాలనా సౌకర్యార్థం 1688 లో పురపాలక సంఘం (కార్పొరేషన్) ఏర్పరుపబడింది. ఈ విధంగా విస్తరించిన నగరాన్ని 1904 వరకు ఎనిమిది పురపాలక విభాగాలుగా చేసి పరిపాలించారు. 1919 నాటికి 20 విభాగాలయ్యాయి. 1936 నాటికి

30 విభాగాలయ్యాయి. 1947 లో 40 విభాగాలయ్యాయి. స్వాతంత్ర్యానంతరం 1959లో పురపాలక సంఘ విభాగాలు 50 కి పెరిగాయి. 1968 నాటికి 100 విభాగాలయ్యాయి. 1978 నాటికి 120 విభాగాలు, 1979 నాటికి 150 విభాగాలు అయ్యాయి. 1981 జనాభా లెక్కల నాటికి 150 విభాగాలు నిలిచి వున్నాయి.

బ్రిటిషు వారు భారత దేశానికి రాకపూర్వం మద్రాసు కేవలం 29.09 చ. కి. మీ. వైశాల్యం కలిగిన చిన్న గ్రామం. 1871 నుండి 1931 నాటికి అది 68.17 చ. కి. మీ. కు విస్తరించింది. 1946 నాటికి 119.79 చ. కి. మీ. 1978 నాటికి 170 చ. కి. మీ. విస్తరించి 1981 జనాభా లెక్కల నాటికి 170 చ. కి. మీ. విస్తరణ కలిగి వుంది.

ఈ విధంగా విస్తరించిన ప్రస్తుత మద్రాసు నగర హద్దులు.

| | | |
|---|---|---|
| తూర్పున | - | బంగాళాఖాతం |
| పడమర | - | విల్లివాక్కం, తిరుమంగళం, సెన్‌చ్చేరి, కోయంబేడు, విసపాక్కం |
| ఉత్తరాన | - | సెలైవ్వల్, కొడంగయ్యూర్, కొళత్తూర్ |
| దక్షిణాన | - | వేళచ్చేరి, తరమణి, కానగం, తిరువాన్మయూర్. |

డచ్, ఫ్రెంచ్, పోర్చుగీస్, ఆంగ్లేయుల మధ్య వ్యాపారరీత్యా వచ్చిన అంతః కలహాలు మద్రాసు నగరాభివృద్ధికి దోహదకారులయ్యాయి.

చరిత్ర ప్రసిద్ధి చెందిన సెయింట్ మేరీస్ చర్చి 1680 లో కోటలో నిర్మింపబడింది. కోటలో కొంత భాగంలో ప్రస్తుతం ఎగువ సభ, దిగువ సభ, సచివాలయం పనిచేస్తున్నాయి. కోటలోని పురావస్తు ప్రదర్శనశాల దక్షిణ భారత దేశంలో బ్రిటిషు వారి కార్య కలాపాలకు ప్రత్యక్ష నిదర్శనంగా నిలిచిపోయింది.

1768 లో నవాబు అలీ ( నవాబ్ వాలాజ్) చే చేపాక్ రాజ భవనం నిర్మించబడింది. కర్నాటక నవాబు మరణానంతరం ఈ ఆస్తిని వేలం వేయడం వల్ల కంపెనీ వారి స్వాధీనమయింది. ప్రస్తుతం మద్రాసు విశ్వ విద్యాలయపు సెనేటు వుండే ప్రాంతంలో నవాబుల కాలంలో ఫిరంగులు భద్రపరచబడేవి. ప్రస్తుత విశ్వ విద్యాలయ భవనం వున్న ప్రాంతం పూర్వం నవాబు గారి స్నాన మండపం. సముద్ర తీరానికి అభిముఖంగా వున్న భవన సముదాయం కర్నాటక నవాబుల రాజ ప్రాసాదులుగా వుండేవి. ప్రస్తుతం ఆ భవనాల్లో రెవిన్యూ బోర్డ్ ఆఫీసు మున్నగు కార్యాలయాలు పనిచేస్తున్నాయి.

మద్రాసు నగరం లోని ముఖ్యమైన రహదారి మౌంటురోడ్డు 1795 లో ఏర్పరుచబడింది. ఇది సెయింట్ జార్జి కోట నుండి సెయింట్ థామస్ మౌంట్ వరకు వ్యాపించి వుంది.

1777 లో గుఱ్ఱపు పందేల వినోదస్థలం ఏర్పాటు చేయబడింది. "రాజాజి" హాలుగా వ్యవహరింపబడుతున్న భవనం 1798 లో నిర్మింపబడింది. ఈ భవనం దేవాలయాన్ని పోలి వుంటుంది. 1804 లో కేంద్ర ఖైదీల గృహం నిర్మింపబడింది.

మద్రాసులోని టంకశాల భవనాల నిర్మాణం 1807 లో పూర్తిగావింపబడింది. ఇక్కడే నాణేల ముద్రణ జరిగేది.

మద్రాసులోని దూరవాణి కేంద్రం (Telephone Exchange) 1881 లో ప్రారంభింప బడింది. ప్రస్తుత దూరవాణి కేంద్ర భవనం 1925 లో నిర్మింపబడింది. మద్రాసుకు దక్షిణ ప్రాంతంలోనున్న అడయార్ నది పడమర నుండి తూర్పుకు ప్రవహించి శాంథోమ్‌కు దక్షిణంగా సముద్రంలో కలుస్తోంది. 1837-47 లో ఈ నదిపై ఎలిఫిన్ స్టోన్ వద్ద పెద్ద వంతెన కట్టబడింది.

మద్రాసు నగరానికి మధ్యగా ప్రవహించే కువ్వం నది నగరాన్ని రెండు విభాగాలుగా చేస్తోంది. ఈ నది మీద అనేక వంతెనలు నిర్మింపబడ్డాయి. అందులో ప్రసిద్ధి చెందింది. "వెలింగ్టన్ వంతెన" ఇది సెయింట్ జార్జి కోట నుండి సెయింట్ థామస్ మౌంట్‌కు పోయే మార్గంలో వుంది.

బకింగ్ హామ్ కాలువ నగరానికి దక్షిణంలో ప్రవహిస్తోంది. దీనిపై కూడా అనేక వంతెనలు కట్టబడ్డాయి.

సెయింట్ జార్జి కోట కేంద్రంగా మద్రాసు నగరం ఉత్తర, దక్షిణ, పడమరలుగా విస్తరింపబడింది. ఈ నగరానికి ముఖ్యంగా మూడు ద్వారాలున్నాయి. తూర్పున సముద్రపు ద్వారం. ఇది ఓడరేవు రహదారి. ఇది జార్జిటౌనుకు ఈశాన్యంగా కువ్వం నది ముఖ ద్వారం నుండి మెరీనా బీచి, శాంథోమ్‌ల వరకు విస్తరించి వుంది. మిగిలిన రెండూ కోటకు పడమరగా ప్రారంభమై మౌంటురోడ్డు, పూనమల్లి హైరోడ్డు, ఎస్ప్లనేడు, బ్రాడ్వే వరకూ పోతున్నాయి. ఈ మూడు రహదారులు కీలకమైన రహదారులుగా ఏర్పడి నగరాన్ని నాలుగు విభాగాలుగా చేస్తున్నాయి.

**మొదటి విభాగం :**

ఇది చాలా ప్రసిద్ధి గాంచింది. ఈ విభాగంలో చరిత్ర ప్రసిద్ధిపొందిన మైలాపూరు, ట్రిప్లికేను వుండడమే కాక, చేపాకు, జామ్ బజారు, మీర్ సాహెబ్ పేట మున్నగు ప్రదేశాలు కర్నాటక నవాబుల కాలం నుంచి ప్రసిద్ధిపొంది వున్నాయి.

పరిపాలనా సంబంధమైన కార్యాలయాలు, విద్యా సంస్థలు మెరీనా బీచి పొడవునా, నేపియర్ వారధి నుండి శాంథోమ్ క్రైస్తవ ప్రార్థనా మందిరం వరకూ విస్తరించి వున్నాయి. ఈ ప్రాంతపు ఔన్నత్యంచే ఆకర్షితులై అనేకులు ఇక్కడ నివాస స్థలాల్ని ఏర్పరచుకున్నారు.

**రెండవ విభాగం :**

రెండవ విభాగం వుత్తరాన కోటనుండి కొత్త చాకలిపేట వరకు, తూర్పున సముద్ర తీరం వరకు, పడమర వ్యాసర్పాడి, సెంబియం వరకు వ్యాపించి వుంది.

ఈ విభాగం అధిక జనాభా కలిగి నాలుగు చదరపు మైళ్ళ విస్తీర్ణాన్ని కలిగి

వుంది. ఈ ప్రాంతంలో వ్యాపారం మీద ఆధారపడి జీవించే వారి సంఖ్య ఎక్కువ. ఈ విభాగంలో వ్యాపార సంస్థలు, ఓడరేవు, ప్రసిద్ధిచెందిన చైనా బజారు, బర్మా బజారు మొదలైన విదేశీ విక్రయ శాలలు వుండడం వల్ల ఈ ప్రాంతంలో జన సంచారం ఎక్కువ. ఈ ప్రాంతం వ్యాపార కేంద్రమవడం వల్ల డబ్బు చలామణి ఎక్కువ. వ్యాపార నిమిత్తం ఇతర ప్రాంతాల నుండి వలస వచ్చిన వారు ఈ ప్రాంతంలో ఎక్కువగా స్థిరపడినట్లు తెలుస్తోంది.

**మూడవ విభాగం :**

మూడవ విభాగం దక్షిణాన ఎగ్మూరు నుండి చూలై వరకు, వుత్తరాన పులియం తోపు, తూర్పున పెరియ మేట్టు, పడమర ఐనావరం వరకూ వ్యాపించి వుంది. ఈ ప్రాంతంలో పరిశ్రమలు ఎక్కువగా వున్నాయి.

ఈ ప్రాంతంలో బకింగ్‌హామ్, కర్నాటక మిల్లు, చూలై మిల్లు, పెరంబూరు రైలు కర్మాగారం మొదలైనవి వున్నాయి. ఇంతే కాక ఇక్కడ కుమ్మరి పని, బొమ్మలు చేయడం, నేత పనిలాంటి కుటీర పరిశ్రమలు, తోలు పరిశ్రమలు కూడా ఈ ప్రాంతంలో వున్నాయి. ఈ ప్రాంతం కార్మికుల్ని ఎక్కువగా ఆకర్షిస్తుంది. ఈ ప్రాంతంలో రైలు కర్మాగారం, సైనిక స్థావరం వుండడం వల్ల ఐరోపా దేశీయులు ఎక్కువ సంఖ్యలో ఇక్కడ స్థిరపడ్డారు.

**నాల్గవ విభాగం :**

దక్షిణానికి ఆగ్నేయంగా ఈ విభాగం వుంది. ఇది తూర్పున అడయార్ నుండి బీచి వరకు, పడమర సైదాపేట వరకు, దక్షిణాన గిండి వరకు, వుత్తరాన నుంగంబాకం వరకు వ్యాపించి వుంది. ఈ ప్రాంతం చాలా వరకు నివాస ప్రాంతంగా వుంది. ఉన్నతాదాయం వున్నవారు, అన్ని జాతుల వారు, కులాల వారు ఈ ప్రాంతంలో నివసిస్తున్నారు. ఈ ప్రాంతంలో చలన చిత్ర పరిశ్రమ ఎక్కువగా అభివృద్ధి చెందింది. ఈ ప్రాంతం "దక్షిణ హాలివుడ్"గా కూడ వ్యవహరింపబడుతోంది.

సేనలను సెంట్ థామస్ మౌంటు, పూనమల్లి లోని సేనా స్థావరాలకు తరలించడానికిగాను బ్రిటిషు వారి కాలంలో మౌంటు రోడ్డు, పూనమల్లి హైరోడ్డు నిర్మింపబడ్డాయి.

శాంథోమ్‌కు తంతి తపాలా సౌకర్యాలను కలిగించడానికి మౌంటురోడ్డు నుండి కువ్వం శాఖల ప్రక్కలగా వాలాజా రోడ్డు, అక్కడి నుండి ట్రిప్లికేన్ హైరోడ్డు నిర్మింపబడ్డాయి.

బ్రిటీషు వారి పరిపాలనా కాలంలో మద్రాసు నగరంలో పెద్ద పెద్ద భవనాలు, ప్రాసాదాలు, కర్మాగారాలు అనేకం నిర్మించబడ్డాయి.

1851 లో ఎగ్మూరులోని ప్రభుత్వ పురావస్తు ప్రదర్శనశాల స్థాపించబడింది. 'లార్డ్ కన్నెమెర' గవర్నరుగా వున్న కాలంలో అతనిపేర ఈ ప్రదేశంలో ఒక గ్రంథాలయం స్థాపించబడింది. దానికి 'కన్నెమెర గ్రంథాలయ'మని పేరు. ఈ కన్నెమెరా గ్రంథాలయాన్ని

పురావస్తు ప్రదర్శన శాలను ప్రతిరోజు అనేకులు సందర్శిస్తుంటారు.

ప్రస్తుతం మెరీనా బీచికి ఎదురుగా గుండ్రటి ఆకారంలో వున్న భవనం 1840 లో నిర్మింపబడింది. ఇది ఐస్‌హౌస్ లేక వివేకానందా హౌస్ అని వ్యవహరింపబడుతోంది. బ్రిటిషు వారి కాలంలో భారత దేశానికి దిగుమతి చేసుకొనే ఐస్ గడ్డలు ఈ భవనంలో నిలువ చేయబడేవి కనుక ఈ భవనానికి ఆపేరు వచ్చింది. మద్రాసులో 'ఐసు' ను తయారు చేయడం మొదలు పెట్టిన తర్వాత ప్రభుత్వం ఈ భవనాన్ని స్వాధీనపరచుకొంది. ఈ భవనంలో వివేకానంద స్వామి కొంతకాలం నివసించడం వల్ల దీనిని 'వివేకానంద హౌస్'గ వ్యవహరిస్తూ వచ్చారు. ప్రస్తుతం ఈ భవనం ప్రధానంగా నిరాధారుల నివాస గృహంగా మారింది.

1891 లో అడయార్ నదీ తీరంలో ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన 'తియసాఫికల్ సొసైటీ' స్థాపింపబడింది. విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని పెంపొందించడమే ఈ సంస్థ ముఖ్యోద్దేశం.

1891 లో న్యాయ కళాశాల భవనం నిర్మింప బడింది. 1906 లో మద్రాసులో విద్యుచ్ఛక్తి కంపెనీ నెలకొల్పబడింది. 1907 లో మొట్టమొదట ఇండియన్ బ్యాంకు మద్రాసులో ప్రారంభింపబడింది. 1913 లో నగర పురపాలక సంస్థ ప్రస్తుతమున్న భవనంలోకి మార్చబడింది. ఈ భవనం రాజప్రతినిధి రిప్పన్ ప్రభువు జ్ఞాపకార్థం నిర్మింపబడి ప్రస్తుతం రిప్పన్ భవనంగా వ్యవహరింప బడుతోంది.

1956 లో మద్రాసులో రక్షకభట కార్యాలయం, ఆకాశవాణి కేంద్ర భవనాలు నిర్మింపబడ్డాయి. 1962 లో రాష్ట్ర ఉన్నత న్యాయస్థాన భవనాలు నిర్మింప బడ్డాయి.

ప్రభుత్వ కార్యనిర్వహణ భవనం 1967 లో నిర్మింపబడింది. 1976 లో మౌంటురోడ్డు వెడల్పు చేయబడి పునర్నిర్మించ బడింది.

ఈ విధంగా ఆదిలో చిన్న గ్రామంగా వున్న మద్రాసు ప్రత్యేక చరిత్రను ంతరించుకొని బ్రిటిషువారి ప్రాపకంలో దినదినాభి వృద్ధిని పొంది ప్రస్తుతం భారత ేశంలో అతి ముఖ్య నగరంగా పరిగణింపబడుతోంది.

1688 లో పురపాలక సంఘం ఏర్పడ్డప్పుడు ఎనిమిది విభాగాలుగా వుండిన మద్రాసు నగరం క్రమ వికాసాన్ని పొంది నేడు 150 విభాగాలుగా అభివృద్ధి చెందింది. సంఘ విభాగాల్ని అనుబంధంలో ఇవ్వడం జరిగింది.

# 3. మద్రాసు నగర ప్రజా జీవన సరళి

ప్రారంభంలో చిన్న గ్రామంగా వుండిన మద్రాసు నగరం ఏ విధంగా క్రమ వికాసాన్ని పొంది మహా నగర మయిందో వివరింపబడింది. ఈ అధ్యాయంలో మద్రాసు నగర సాంఘిక, ఆర్థిక, సామాజిక స్థితిగతులతో పాటు ఈ నగరం లోని తెలుగు ప్రజలు, వారి కులాలు, ఆచార వ్యవహారాలు, సాంఘిక, సామాజిక, ఆర్థిక స్థితి గతులు వివరించబడతాయి.

## 3.1 మద్రాసు నగర భౌగోళిక పరిస్థితులు

మద్రాసు తమిళనాడుకు ఈశాన్యంగా బంగాళాఖాతం ఒడ్డున వుంది. ఈ నగరం 12, 13 అక్షాంశాలకు, 80.12, 80.19 రేఖాంశాలకు మధ్య ఇసుక ప్రదేశంలో సముద్ర తీరం వెంబడి 'తిరువాన్‌ముయూరు' నుండి 'తిరువత్తియూరు' వరకు మెరక పల్లాలైన భూమిపై అర్థ చంద్రాకారంలో 20.60 కి. మీ. విస్తృతిని కలిగి వుంది. మద్రాసుకు తూర్పున బంగాళాఖాతం, పడమర, ఉత్తర, దక్షిణాల్లో చెంగల్పట్టు జిల్లా ఉన్నాయి.

మద్రాసు నగరానికి 25.60 కి. మీ. వ్యాపించిన సముద్ర తీరముంది. ఒక కి. మీ. చదును గాను, నగర సముద్రతీర ప్రాంతంలో 42' లోతు, 5 కి.మీ. తరువాత 63' లోతును కలిగి వుంది. తీరం వెంబడి ముఖ్యమైన ఉత్తర పవనాలు, దక్షిణ పవనాలు వీస్తాయి. ఉత్తర పవనాలు అక్టోబరు నుండి ఫిబ్రవరి వరకు, దక్షిణ పవనాలు ఆగష్టు నుండి సెప్టెంబరు వరకు వీస్తాయి.

## 3.2 ఉష్ణోగ్రత - వర్షపాతం

మద్రాసు నగరం సమ శీతోష్ణ ప్రాంతంగా వుంది. భౌగోళికంగా మద్రాసు ప్రాంతం ఉష్ణ ప్రాంతంలో వుంది. సముద్రం పై నుండి వీచే చల్లని వాయువుల వల్ల వేడి తగ్గి సమశీతోష్ణ వాతావరణం ఏర్పడుతోంది. మద్రాసు నగర శీతోష్ణ కాలాల్ని క్రింది విధంగా చెప్పవచ్చు.

1. శీతా కాలం - జనవరి, ఫిబ్రవరి
2. వేసవి కాలం - మార్చి నుండి జూలై
3. నైరుతీ ఋతుపవనాలు - జూన్ నుండి సెప్టెంబర్ వరకు
4. వర్షా కాలం - అక్టోబర్ నుండి డిసెంబర్ వరకు

అత్యల్ప ఉష్ణోగ్రత 20 డిగ్రీల కంటే తక్కువ వుండదు. అత్యధిక ఉష్ణోగ్రత 41 డిగ్రీలకు మించి వుండదు. ఇది చాలా ఆరోగ్యకరమైన వాతావరణం. మార్చి నుండి ఉష్ణోగ్రత హెచ్చడం ప్రారంభమవుతుంది. ఇతర తీర ప్రాంతాల్లో లాగే మద్రాసులో కూడా తుఫానులు, గాలి వానలు మే, నవంబరు మధ్యకాలంలో వస్తాయి. తుఫానులు ఎక్కువగా బంగాళాఖాతంలో పడమర గాను, వాయవ్యం గాను, తూర్పు తీరం వెంబడి వస్తాయి. కనీసం సంవత్సరానికి ఒక తుఫానుగాని గాలివాన గాని, వాయుగుండం గాని ఏర్పడి

దాని ప్రభావాన్ని మద్రాసు నగరంపై చూపుతుంది. సంవత్సరమంతా వాతా వరణం చల్లగా వుంటుంది. మే నుండి జూలై వరకు 65%, అక్టోబర్ నుండి జూన్ వరకు 80% గాలిలో తేమ వుంటుంది. దీనికి తోడు సముద్రపు గాలుల వలన 20% నుండి 30% వరకు గాలిలో తేమ ఏర్పడుతుంది. మద్రాసు నగరంలోని వర్షపాతానికి, ఉష్ణోగ్రతకు సంబంధించిన నిష్పత్తి క్రింది పట్టికలో చూపబడింది.

ఉష్ణోగ్రత

అత్యధిక 41

అత్యల్ప 20

వర్షపాతం

1285.6. మి.లీ.

## 3.3 మద్రాసు నగర జనాభా

1981 జనాభా లెక్కల ప్రకారం మద్రాసు నగర జనాభా - 3276622. పురుషులు 1694107. స్త్రీలు 1582515. భాషా పరంగా జనాభా లెక్కలు తయారు చేయబడలేదు. అందువల్ల 1971 జనాభా లెక్కల ప్రకారం మద్రాసులో వివిధ భాషల్ని మాట్లాడే వారి సంఖ్య క్రింది పట్టికలో చూపబడింది.

మద్రాసు నగరంలో వివిధ భాషా వ్యవహర్తల సంఖ్య (1971 లెక్కల ప్రకారం)

| 1 అస్సామీ | | | 2 ఉర్దూ | | |
| --- | --- | --- | --- | --- | --- |
| పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం |
| 11 | 16 | 27 | 73724 | 68172 | 141896 |

3

ఒరియా

| పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|
| 117 | 78 | 195 |

4

కన్నడ

| పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|
| 9403 | 8300 | 17703 |

5

కాశ్మీరం

| పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|
| 28 | 18 | 46 |

6

గుజరాతి

| పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|
| 10329 | 9584 | 19913 |

7

తమిళం

| పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|
| 950988 | 869286 | 1820274 |

8

తెలుగు

| పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|
| 152087 | 145101 | 297188 |

9

పంజాబి

| పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|
| 1240 | 997 | 2237 |

10

బెంగాలి

| పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|
| 954 | 600 | 1554 |

| 11 మరాఠీ | | | 12 మలయాళం | | |
|---|---|---|---|---|---|
| పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం |
| 8761 | 8033 | 16794 | 57095 | 34986 | 92081 |

| 13 సంస్కృతం | | | 14 సింధి | | |
|---|---|---|---|---|---|
| పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం |
| 16 | 12 | 28 | 5559 | 2819 | 8378 |

| 15 హిందీ | | |
|---|---|---|
| పురుషులు | స్త్రీలు | మొత్తం |
| 17307 | 13945 | 31252 |

(గమనిక :- తెలుగు అక్షర క్రమంలో భాషల్ని ఇవ్వడం జరిగింది)

## 3.4 భాష, కులం, మతం

### 3.4.1 భాష :-

ఏ సముద్ర తీర పట్టణమైనా బహు భాషా జనులకు, బహు సంప్రదాయాలకు కలయికగా వుంటుంది. మద్రాసు నగరం కూడా అంతే . అనేక భాషల్ని మాట్లాడే వాళ్ళని ఇక్కడ చూడవచ్చు. వారిలో ఎక్కువ మంది ద్రావిడ భాషల్ని మాట్లాడే వాళ్ళు.

1953 లో ఆంధ్ర రాష్ట్ర అవతరణ జరిగే వరకూ మద్రాసు నగరం సంయుక్త రాష్ట్రానికి రాజధానిగా ఉండేది. సంయుక్త రాష్ట్రంలో తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ భాషా ప్రాంతాలు కలిసి వుండేవి. ఆ కారణంగా మద్రాసు నగరంలో తెలుగు, తమిళ,

కన్నడ, మలయాళ భాషా వ్యవహర్తలు కలిసి వుండే వారు.

నేడు మద్రాసు నగరంలో వ్యవహారంలో నున్న భాషల్లో ముఖ్యమైన భాష తమిళం. తమిళ భాషా వ్యవహర్తలు మద్రాసు నగరంలో ఇతర భాషా వ్యవహర్తల కంటే మూడు రెట్లు ఎక్కువగా వున్నారు. మద్రాసు నగరంలో తమిళుల తరువాత అధిక సంఖ్య కలవారు తెలుగువారు. తెలుగు వారు, మద్రాసు నగర జనాభాలో ఐదవ వంతు వున్నారు. ఈ రెండు భాషలతో పాటు నగరంలో ఆంగ్ల భాష ఎక్కువగా వ్యవహరింపబడుతోంది. న్యాయస్థానం లోను, కళాశాలల్లోను, వ్యాపార సంస్థల్లోను ఆంగ్ల భాషని వాడుతున్నారు. ఈ భాషలే కాక హిందీ, పంజాబీ, గుజరాతి, బెంగాలి మొదలైన ఉత్తరాది భాషలు కూడా మద్రాసు నగరంలో వ్యవహరింపబడుతున్నాయి. మద్రాసు నగరం వాణిజ్య కేంద్రమైనందున బిన్నభాషా వ్యవహర్తలు స్థిర నివాసమేర్పరచుకొన్నారు.

రాజకీయ కారణాల వల్ల మద్రాసు నగరంలో తమిళ భాషకి ప్రాధాన్యత ఏర్పడింది. అందువల్ల తమిళ భాషాప్రభావం తెలుగుపై ఎక్కువగా పడింది. 1967 లో తమిళ నూతన సంవత్సరం నాడు మద్రాసు రాష్ట్ర నామాన్ని రాష్ట్ర ప్రభుత్వం 'తమిళనాడు' గా మార్చింది. తమిళ సంస్కృతిని వెల్లడి చేసే విధంగా 1968 లో మద్రాసు నగరంలో ప్రారంభింపబడిన ప్రపంచ తమిళ మహాసభల సందర్భంగా మెరీనా సముద్ర తీరమంతటా ఔవైయార్, తిరువళ్ళువర్, కంబర్, సుబ్రహ్మణ్య భారతి, భారతి దాసన్ మొదలైన తమిళ కవుల విగ్రహాలు ప్రతిష్ఠింపబడ్డాయి. తమిళ భాషాభి వృద్ధికి తోడ్పడ్డ క్రైస్తవ మత గురువులైన కాల్డువెల్, పోపు విగ్రహాలు కూడా ప్రతిష్ఠింపబడ్డాయి. భాషాభిమానంతో తమిళులు మద్రాసు నగర స్థల నామాల్ని, వీధుల పేర్లను తమిళీకరిస్తున్నారు. పరిపాలనా సంబంధిత విషయాల్లోనూ తమిళ భాష ఆధిక్యతని పొందింది.

### 3.4.2 కులము - నగర జీవనము

భారత దేశంలో కులం సమాజానికి ఉక్కు కవచం లాంటిదని, సామాజిక జీవన విధానం కులతత్త్వం మీదే ప్రధానంగా ఆధారపడి వుందని చెప్పబడింది. భారత దేశ సమాజావతరణను గూర్చి తెలియజేస్తూ Sir. C.W. Ranson గారు "Caste is the steel frame of Indian society viewed simply as one of the most notable and impressive phenomena in the whole history of the social evolution"[1] అని కులాన్ని నిర్వచించారు.

The imperial Gazetter of india లో కులాన్ని గూర్చి ఈ నిర్వచనం ఇవ్వబడింది. "caste is a collection of families or groups of families bearing a common name which usually denotes or is associated with a specific occupation, claiming common decent from a mythical ancestor, human or

---

1. Ranson C.W. "A city in transition" - studies in the social life of Madras - 1938 p.p. 98

divine professing to follow the calling, and regarded by those who are competent to give an opinion as forming a single homogeneous community"[2]

భారత దేశంలో కుల భేదం పాటింపబడుతోంది. ముఖ్యంగా అగ్రకులాలకు, నిమ్న కులాలకు మధ్య అంతరం ఎక్కువగా కనబడుతోంది. నూతన నగర జీవనంలో భేద భావం లేకుండా అన్యోన్యంగా వుండాలని భావింపబడే సందర్భాల్లో ఈ కులతత్వం ప్రత్యక్షమై అనేక సవాళ్లను ఎదుర్కొన వలసి వస్తోంది.

నగరంలో మధ్య తరగతికి చెందిన వ్యాపారులు, ప్రభుత్వోద్యోగులు, న్యాయవాదులు, డాక్టర్లు, ఉపాధ్యాయులు అనేకులు భిన్నకులాలలకు చెందిన వారున్నారు. వ్యాపార సంబంధమైనట్టి, వృత్తి పరంగా వుండే ఉమ్మడి అవసరాల ఆధారంగా ఏకీభావంతో మెలిగేందుకు ప్రయత్నం చేస్తున్నారు. ఈ నూతన సంపూర్ణ సమానత్వం ముందు పూర్వపు కుల ఆచార భేదాలు నిలువలేక పోతున్నాయి.

సమాజ జీవనంలో నైతే నేమి, సాధారణ వృత్తి పరమైన కార్యకలాపాల్లో నైతేనేమి. కులతత్త్వాన్ని అనుసరించడం అననుకూలం కావడమే కాక అనేక సందర్భాల్లో కులతత్త్వాన్ని అనుసరించడానికి వీలుకాని పరిస్థితుల్లో కులభేదాల్ని విడిచిపెట్టవలసి వస్తోంది.

విద్యావంతులైన వారు సామాజిక జీవన పరిస్థితుల ననుసరించి పూర్వాచార పరాయణత్వం కలిగిన తమ ఆచారాల్లో అనేక రకాల మినహాయింపులకు ప్రభావితమౌతున్నారు. ఈ మినహాయింపులు సాధారణంగా పెండ్లిండ్ల విషయంలో కనబడుతున్నాయి. కాని కొన్ని సందర్భాల్లో వర్ణాంతర వివాహాలు జరిగినా వారి వారి కుల వివాహ నిబంధనల్ని మాత్రం అతి జాగ్రత్తగా నిలబెట్టుకొంటున్నారు. కొన్ని సందర్భాల్లో నేటికీ వర్ణాంతర వివాహాల వల్ల పురుషుడు ఉమ్మడి కుటుంబంలో సభ్యత్వాన్ని పోగొట్టుకొనడం ఆస్తి హక్కు పోగొట్టు కోవడం కూడా జరుగుతోంది.

కులాల వారిగా పరిశీలిస్తే మద్రాసు నగర జనాభా విషయంలో చాలా ఆసక్తిదాయకమైన విషయాలు వెలుగులోకి వస్తాయి. మద్రాసు నగర జనాభాలో హిందువులు ఎనిమిదో వంతున్నారు. ఈ జనాభాలో ఆరవ వంతు ఏదో ఒక నిమ్న జాతికి చెందిన వారై వున్నారు. అంటే వీరు ఆది ఆంధ్రులుగనో, ఆది ద్రావిడులుగనో వున్నారు.

మద్రాసు నగరానికి ఆది ద్రావిడులు కుటుంబ సమేతంగా వలస పోతుండగా ఇతర పారిశ్రామిక ప్రదేశాలకి పురుషులు మాత్రమే వలస పోతున్నారు.. మద్రాసులోని నిమ్న జాతులవారు కలకత్తా, బొంబాయి నగరాల్లోని నిమ్నజాతుల వారిలా కాక శారీరకంగా శ్రమించి మద్రాసులో ప్రముఖ స్థానాన్ని సంపాదించుకున్నారు.

మద్రాసులోని ఆది ద్రావిడులు చాలా మంది పూరిపాకల్లో జీవితాన్ని గడుపుతున్నారు. మద్రాసు నగర సాంఘిక జీవన ప్రభావం పరిసర గ్రామాల మీద కూడా

2. Hunter W.H. "The Imperial Gazetter of India vol. III P.P. 246

నగరంలోని ప్రజలు కులభేదాన్ని నిలబెట్టుకుంటున్నారనడానికి ుపడుతున్నాయి. ఒకే కులానికి చెంది ఒకే భాషను మాట్లాడువారు ' సంఘంగా ఏర్పడి ఐకమత్యంతో సమాజాన్ని ఉద్ధరించడానికి అనేక ' కార్య కలాపాలు నడుపుతున్నారు. మద్రాసులో వున్న బ్రాహ్మణ సంఘం, రెడ్డి జన సేవా సంఘం, నాయుడు సంఘం, సెలవయార్ (చాకలి) ్మణ సంఘం, ఆది ద్రావిడ సంఘం, ఆది ఆంధ్ర సంఘం మొదలైన గా తీసుకోవచ్చు.

### 3.4.3 మతం

శం విలక్షణమైన నాగరికత, స్పష్టమైన మత విశ్వాసంతో కూడిన గా ప్రపంచ దేశాల్లో పేరు పొందింది. భారత దేశం భిన్న మతాలకు, , భిన్న భాషలకు, భిన్న జాతులకు నిలయమైనా మొదటి నుండి ుత సహనం కనబడుతోంది.

శంలోని ప్రధాన మతాలు 1. హిందూ మతం 2. క్రైస్తవ మతం 3. రత దేశాన్ని మహమ్మదీయులు పరిపాలించేటప్పుడు వారి మత ్కృతి ఎక్కువగా సంఘంలో ప్రాముఖ్యతని పొందింది. ఆంగ్లేయుల ో క్రైస్తవ మతానికి ఎక్కువ ప్రచారం లభించింది. భారత దేశంలో ే కాక బౌద్ధ, జైన, సిక్కు మతాలు కూడా వున్నాయి.

నగరంలో కూడా పైన చెప్పిన మతాల వారందరూ నివసిస్తున్నారు. ్లామ్, క్రైస్తవ మతస్థులు అధికంగా వున్నారు. మద్రాసులో కళావైభవాన్ని అనేక పురాతన కట్టడాలు, దేవాలయాలు, వస్తు ప్రదర్శన శాలలు మతాలకు, సంస్కృతులకు నిదర్శనాలుగా నిలిచి వున్నాయి.

లోని 'సెయింట్ మేరీస్ చర్చి' బ్రిటిషు వారిచే మొట్టమొదట భారత క్రైస్తవుల ప్రార్థనా మందిరం. ఇంకా మద్రాసులో గల అనేక క్రైస్తవుల ట్ లాండ్' నాగరికతా సంబంధమైన పెద్ద దేవాలయాలు బ్రిటిషువారి ో నిర్మింపబడి వారి మతానికి, సంస్కృతికి స్మృతి చిహ్నాలుగా నిలిచి

నగరంలో బిషప్పులనబడే ముగ్గురు క్రైస్తవ మత గురువులున్నారు. ్లీషు ప్రొటెష్టియన్స్ మత గురువు. ఇద్దరు రోమన్ కాథలిక్ మత ు (ప్రొటెష్టియన్లు) వారికి 15 ప్రార్థనా మందిరాలు, ఒక క్రైస్తవ మత ంరం వున్నాయి. రోమన్ కాథలిక్కులకు 13 మందిరాలు, 2 క్రైస్తవ మందిరాలు వున్నాయి. ఇవి కాక మూడు స్కాటిష్ చర్చీలు, ఎనిమిది ుయాలు, ఇంకా అనేక సమావేశ గృహాలు, ప్రార్థనా మందిరాలుగా

వుపయోగించు క్రైస్తవ మిషనరీల బడిగదులు అనేకం వున్నాయి.

లండన్ క్రైస్తవ మత సంఘం, వెస్లావిన్ క్రైస్తవ చర్చి సంఘం, లూథరన్ చర్చి సంఘం, అమెరికన్ చర్చి సంఘం, స్కాట్‌లాండ్ చర్చి సంఘం, బేప్టిష్టు చర్చి సంఘం, బైబుల్ సువార్త సంఘం, క్రైస్తవ జ్ఞాన సంఘం లాంటి సంఘాలు అనేకం మద్రాసు నగరంలో వున్నాయి.

ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో మద్రాసులోని భిన్న మతస్థుల వారు ఆర్థిక, సాంఘిక, రాజకీయ కారణాల వల్ల క్రైస్తవులుగా మారినట్లు ఆధారాలు కనబడుతున్నాయి.

సెయింట్ థామస్ అనే క్రైస్తవ మత ప్రవక్త ప్రస్తుతం శాంథోమ్ అని పిలువబడే ప్రాంతానికి వచ్చి ఆప్రాంతంలో వున్న ప్రజలందర్నీ, క్రైస్తవ మతస్థులుగా మారుస్తున్నందుకు కోపించి కొందరు ఇతనిని ప్రస్తుతం సెయింట్ థామస్ మౌంట్‌గా వ్యవహరింపబడుతున్న కొండపై చంపేశారని, అతని శరీరాన్ని శాంథోమ్‌లో పాతిపెట్టి అక్కడ సమాధి కట్టినట్లు చారిత్రకాధారాలు కనబడుతున్నాయి. దీన్నిబట్టి ఆకాలంలో ఇతర మతస్థులు అనేకులు బలవంతంగానో, అవసరార్థమో క్రైస్తవ మతాన్ని స్వీకరించినట్లు తెలుస్తుంది.

హిందువుల పాలనలో మద్రాసు నగరంలో గొప్ప దేవాలయాలు నిర్మింపబడ్డాయి. మహా భక్తులున్న ముఖ్య ప్రదేశాలు అనేకం వున్నాయి. వీరోచితమైన కథానాయకులకు ప్రసిద్ధి చెందిన ప్రదేశంగా మద్రాసు నగరాన్ని చెప్పవచ్చు.

ఆంగ్లేయులు భారత దేశానికి రాకపూర్వం కూడా మద్రాసు కేవలం జాలరుల నివాస గ్రామంగా కాక సామాజిక స్పృహ కలిగిన సంస్కార వంతులకు నిలయంగా వుండేది. మద్రాసులో వున్న శాంథోమ్, మైలాపూరు, తిరువళ్లికేణి, తిరువత్తియూరు మొదలైన ప్రదేశాలన్నీ పూర్వం మత ప్రాధాన్యతకి, సామాజిక జీవన స్రవంతులకి ఆలవాలమైన ప్రదేశాలుగా వుండేవి. నేటికీ అవి అలాగే వున్నాయి.

తిరువళ్లికేణిలో గల దేవాలయం బహుశా ఎనిమిదివ శతాబ్దపు మధ్యకాలం నాటిదిగా చారిత్ర కాధారాలు కనబడుతున్నాయి. ఎనిమిదవ శతాబ్దంలో కంచిని పాలించు చుండిన నందివర్మన్, పల్లవమల్ల అనే పల్లవ రాజులు దీన్ని అభివృద్ధి చేసినట్లు తెలుస్తోంది. అదే కాలంలో తిరుమంగై ఆళ్వారు, ఆయన కుమారుడు దంతివర్మన్ కూడా దీన్ని అభివృద్ధి చేసినట్లు ఆ దేవాలయంలోని శిలా ఫలకం వల్ల తెలుస్తోంది. తమిళనాడులో గల 108 సాంప్రదాయిక పవిత్ర విష్ణు దేవతా పీఠాల్లో ఇది ముఖ్యమైందిగా చెప్పబడుతోంది.

ఇంగ్లీషు, ఫ్రెంచి, డచ్చి, మహమ్మదీయుల మధ్య ఈ ప్రాంతంలో జరిగిన యుద్ధాలకు ఈ ట్రిప్లికేనులోని పార్థసారథి స్వామి దేవాలయం తరచుగా నిలయమైనట్లు చారిత్రకాధారాల వల్ల తెలుస్తోంది.

1672 లో ఫ్రెంచి వారు శాంథోమ్‌ను, మహమ్మదీయులు పార్థసారథి దేవాలయాన్ని స్వాధీన పరచుకున్నారు. తరువాత ఫ్రెంచి వారు ఈ దేవాలయాన్ని మహమ్మదీయుల నుండి స్వాధీనం చేసుకున్నారు. అందులో రక్షణ కోసం సేనల్ని

వుంచారు. 1673 లో డచ్చి వారు సముద్ర తీరంలో యుద్ధ నావల్ని నిలిపి ఫ్రెంఛి వారి నుండి ఈ దేవాలయాన్ని వశపరచుకొన్నారు. తరువాత కొంత కాలానికి మహమ్మదీయులు మరల ఆ దేవాలయాన్ని స్వాధీన పరచుకొన్నారు. బ్రిటిషు వారు ఈ దేవాలయాన్ని స్వాధీనపరచుకొనేంత వరకు ఇది మహమ్మదీయుల ఆధీనంలోనే వుంది. మద్రాసు నగరంలో వున్న దేవాలయాల్లో పార్థసారథి స్వామి దేవాలయం పూర్వం యుద్ధాలకు ఆట పట్టైంది. ఈ దేవాలయాన్ని గూర్చి ఒక కథ జనవ్యవహారంలో వుంది. ఈ దేవాలయానికి వేంచేసి యుండు శ్రీ పార్థసారథి స్వామి శ్రీకృష్ణ భగవానుని అవతారమని, ఈయనే అర్జునుడికి కురుక్షేత్ర యుద్ధ భూమిలో రథసారథియై అర్జునుడికి దైవ సంబంధమైన ఆధ్యాత్మిక సారాంశాన్ని బోధించాడని అదే భగవద్గీతగా రూపొంది ప్రపంచ జనావళి కంతటికి ఆధ్యాత్మిక ప్రవర్తనా నియమావళిగా రూపొందిందని చెప్పబడుతోంది.

ఈ దేవాలయంలో సం॥ పొడవునా అనేక ఉత్సవాలు జరుగుతుంటాయి. వీటిలో ముఖ్యమైనవి వైకుంఠ ఏకాదశిరోజు నుండి పదిరోజులు జరిపే బ్రహ్మోత్సవాలు. ఈ సమయంలో తెప్పోత్సవం కూడా జరుపుతుంటారు. మొత్తం మీద ఈ దేవాలయం మద్రాసులో వైష్ణవ మతస్థులకు అత్యంత ముఖ్యమైన దేవాలయంగా ప్రసిద్ధిపొందింది.

మద్రాసు నగరంలో మత సంబంధంగా అత్యధిక ప్రాముఖ్యాన్ని పొందిన స్థలం 'మైలంపూర్' 16, 17 శతాబ్దాల్లో మైలాపూర్‌కు, పోర్చుగీసు వారి నగరంగా చెప్పబడిన శాంథోమ్‌కు చాలా సన్నిహిత సంబంధముండేది. దీని పూర్వీకుల చరిత్ర క్రీ. పూ. నుండి క్రీ. శ. 16 వ శతాబ్ది వరకు వుండేది. దీని ప్రాముఖ్యం ఆ కాలం నాటి 'కేకసికల్', 'గ్రయికే', రోమన్ దేశ ఖగోళ శాస్త్రకారుల దృష్టికి పోయింది.

మైలాపూర్‌లోని ప్రఖ్యాతమైన కపాలేశ్వర స్వామి దేవాలయానిక్కూడ పురాతనమైన చరిత్ర వుంది. ఈ చరిత్రనుబట్టి ఇది ఒకప్పుడు జైన, శైవ మత ప్రధాన కేంద్రంగా వున్నట్లు తెలుస్తుంది. ఒకప్పుడు ఈ దేవాలయం సముద్రానికి సమీపంగా వుండేదని, తరువాతి కాలంలో దానిని ప్రస్తుత దేవాలయమున్న ప్రాంతంలో నిర్మించినట్లు తెలుస్తోంది.

ఈ కపాలేశ్వర స్వామి దేవాలయంలో పార్వతీదేవి నెమలి రూపంలో కన్పించే శిల్పం, శైవ మత సంబంధమైన మాహాత్మ్యాన్ని తెలిపే శిల్పాలు వుండడం వల్ల దీనిని క్రీ. పూ. నిర్మింపబడ్డ శైవమత ప్రాధాన్యత పొందిన దేవాలయంగా చెప్పవచ్చు. ఈ దేవాలయంలో వున్న విగ్రహాల్నిబట్టి ఇది అరవైమూడు నాయన్మారుల కూడలి అని తెలుస్తోంది.

ఈ దేవాలయంలో శివరాత్రి పర్వదినం సమయంలో ఉత్సవాలు చేస్తారు. సంవత్సరం పొడవునా ఏదో ఒక ఉత్సవం చేస్తుంటారు. తెప్పోత్సవం కూడ ఇక్కడ జరుగుతుంది. మైలాపూరు వైష్ణవులకు కూడా ముఖ్యమైన ప్రదేశం. ఇక్కడ అనేక వైష్ణవ దేవాలయాలు వున్నాయి. మైలాపూర్‌లో జైన దేవాలయంకూడా వుంది.

'తిరువాన్మయూర్' అనే ప్రదేశంలో 'మరుందీశ్వర దేవాలయం' వుంది. శ్రీ మద్రామాయణ కావ్య రచయితయైన వాల్మీకి మహర్షి ఈ ప్రదేశంలో శివుని ఆరాధించినట్లు ఒక ఐతిహ్యముంది. ఈ దేవాలయంలోని ఈశ్వరుడు వాల్మీకీశ్వరుడని కూడా వ్యవహరింపబడుతున్నాడు. క్రీ. శ. 11 వ శ॥ లో రాజరాజ నరేంద్రుని కుమారుడైన రాజేంద్ర చోళుడు ఈ దేవాలయాన్ని నిర్మించినట్లు చారిత్రకాధారాలున్నాయి.

ఎగ్మూరులో కన్నెమెరా గ్రంధాలయం, పురావస్తు ప్రదర్శనశాల వున్న ప్రదేశంలో ఒకప్పుడు చరిత్ర ప్రసిద్ధి చెందిన సర్వదేవతాలయముండినట్లు ఆధారాలున్నాయి. ఇది ఒక పెద్ద సంస్థానంగా వుండేదని దేవాలయ పాలక వర్గం దీన్ని ఆంగ్లేయులకు అమ్మేశారని కూడా చెప్తున్నారు.

'వడపళని' లో సుబ్రహ్మణ్యస్వామి (మురుగన్) దేవాలయం వుంది. క్రీ. శ. 17 వ శ॥ లో ఈ ప్రాంతంలో 'అణ్ణాస్వామి నాయకన్' అనే భక్తుడుండేవాడని అయన తమిళనాడులోని దివ్య క్షేత్రమైన 'పళని' ని దర్శించి వచ్చిన తరువాత అతనికి కలలో మురుగన్ కనిపించి అతడి ఇంటిలో వుంటానని చెప్పగా అతడు తన ఇంటిలోనే ఆదేవుణ్ణి ప్రతిష్ఠించి ఇంటిని గుడిగా మార్చినట్లు స్థల పురాణంలో చెప్పబడింది.

'ముత్యాలపేట' అంటే 'జార్జి టవున్' లోని 'బ్రాడ్వే'కు తూర్పుగా రెండు హిందూ దేవాలయాలున్నాయి. 1725 లో నిర్మింపబడ్డ 'కచ్చాలీశ్వర దేవాలయం' తంబుచెట్టి వీధికి ఉత్తరాన 'మల్లేశ్వర దేవాలయం' ఉన్నాయి.

పెదనాయకన్ పేట' అంటే జార్జి టవున్లో బ్రాడ్వేకు పడమరగా నగర ఆవిర్భావానికి సమకాలీన మరియు నగర రక్షకుడైన చెన్నకేశ్వర దేవస్థానముంది. ఈ నగరంలోని ప్రధాన వ్యాపారుడైన 'అలఘునాధ పిళ్ళై' చేత 17 వ శ॥ చివరి కాలంలో ఏకాంబరేశ్వర దేవస్థానం మింటు వీథిలో ఏర్పాటు చేయబడింది. బేరి చెట్లకు చాలా పవిత్రమైన కందస్వామి దేవస్థానం అక్కడి వ్యాపారులచేత 16 వ శ॥ లో ఏర్పాటు చేయబడింది. ఇవే కాక ఇంకా అనేక దేవస్థానాలు నగరంలో అనేక చోట్ల ఏర్పాటు చేయబడ్డాయి. వీటితో పాటు మార్వాడీలు ఎక్కువగా వుండే మింటు వీథిలో రెండు జైన దేవాలయాలు వున్నాయి.

'బెసెంట్ నగర్' లోని అష్టలక్ష్మిగుడి కూడా వైష్ణవ దేవాలయాల్లో ప్రసిద్ధి పొందింది. త్యాగరాయ నగర్‌లో వున్న శివ విష్ణు ఆలయం, శైవ, వైష్ణవ మత సామరస్యానికి నిదర్శనం. ఈ దేవాలయాలతో పాటు అనేక శక్త్యాలయాలు మద్రాసులో వున్నాయి. దాదాపు ప్రతి వీథిలో వినాయకుని గుడి కట్టబడి వుంది.

మహమ్మదీయుల కాలంలో వారి మత ప్రచారార్థం మసీదులు అనేకం కట్టబడ్డాయి. వీటిల్లో ముఖ్యమైనది 'ఆయిరం విళక్కు మాస్క్' (వెయ్యి దీపాల మసీదు) ఏర్పాటు నవాబుల కాలంలో నవాబు కుమారుడైన 'ఉపిదత్తుల్ ఉమల్' అనే నవాబు ఈ మసీదును కట్టించి మహమ్మదీయుల పండుగైన మొహరం నాడు ఇక్కడే

వేయిదీపాలను వెలిగించాడని అందుచేతనే దీనికి అయిరం విళక్కు (అయిరం అంటే వెయ్యి అని, విళక్కు అంటే దీపం అని తమిళంలో అర్థం) మసీదు అని పేరు వచ్చింది. ఆంగ్లంలో ఇది 'తౌసన్డ్ లైట్స్ మాస్క్'గా వ్యవహరింపబడుతోంది. మద్రాసు నగరంలో 33 మసీదులున్నాయి.

మత పరంగా ఇంతటి ప్రసిద్ధిపొందిన మద్రాసు నగరం భిన్న మతాలకు, జాతులకు, సంస్కృతులకు నిలయమైనప్పటికి భిన్నత్వంలో ఏకత్వాన్ని ప్రదర్శిస్తూ విలక్షణమైన నాగరికత, సంస్కృతుల్ని ప్రదర్శిస్తూ భారత దేశంలో ప్రసిద్ధ నగరంగా వుంది.

## 3.5 మద్రాసు నగర సాంఘిక, సామాజిక, ఆర్థిక స్థితిగతులు

### 3.5.1 సాంఘిక పరిస్థితులు

భారత దేశంలో మద్రాసు నగరం సాంఘికంగా అత్యుత్తమ స్థానాన్ని పొంది వుంది. దానికి కారణాలు అనేకం అవి.

#### 3.5.1.1 విద్య :

భారత దేశంలో స్థిర పడిన బ్రిటిషువారు 1695 లో పాఠశాలల స్థాపనావశ్యకతను గుర్తించారు. సెయింట్ మేరీ ధర్మ సంస్థ వారు 1716 లో పాఠశాలలను ప్రారంభించారు. 1826 సం॥లో సర్ థామస్ మన్రో ప్రజా విద్యా బోధన సంస్థను స్థాపించి ఉపాధ్యాయ శిక్షణా పాఠశాలను నిర్వహించారు. ఈ పాఠశాల క్రమంగా అభివృద్ధి చెంది మద్రాసు హైస్కూలుగాను ఆ తరువాత ప్రస్తుత ప్రెసిడెన్సీ (రాజధాని) కళాశాల గాను అభివృద్ధి చెందింది. పాఠశాలల్లో ఉన్నత తరగతులకు ఆంగ్ల భాషా బోధనావసరాన్ని 1830 లో గుర్తించారు.

సర్వదేశ సంబంధిత కళలను బోధించే పాఠశాలను 1850 లో డా॥ హంటర్ స్థాపించాడు. తరువాతి కాలంలో అది ప్రస్తుత కళాశాలగా వృద్ధి చెందింది. ప్రభుత్వం ఈ కళాశాలను 1855 లో స్వాధీన పరచుకొంది. 'లాండ్ సర్వే' పాఠశాలను ప్రభుత్వం వారు 1834 లో ప్రథమంగా స్థాపించారు. భూమిశిస్తు శాఖలో పని చేయడానికై కొంత మందికి ఈ పాఠశాలలో శిక్షణ ఇవ్వబడింది.

1841 లో మద్రాసు విశ్వవిద్యాలయ నిర్వహణ సంఘం ఏర్పరచబడింది. తరువాత వైద్యవిద్య, సాంకేతిక విద్యా తరగతుల ఆవశ్యకతను గుర్తించి 1859 లో సాంకేతిక పాఠశాలను ఏర్పరచారు. ఆ పాఠశాల 1862 లో కళాశాలగా వృద్ధిపరచి శిక్షణ ఇచ్చి ప్రభుత్వానికి ఇతర ప్రైవేటు సంస్థలకి కావలసిన సాంకేతిక నిపుణుల్ని తయారు చేశారు.

వైద్య పాఠశాలను 1835 లో ప్రారంభించారు. అది 1851 లో మద్రాసు వైద్య కళాశాలగా వృద్ధి చెందింది. లార్డ్‌ఎలిఫిన్ స్టోన్ కాలంలో కేంద్ర విద్యా విధానం అమల్లోకి వచ్చింది. రాష్ట్రం లోని పాఠశాలల్లో ఆంగ్ల, తెలుగు సాహిత్యాలతో పాటు ఆధ్యాత్మిక విద్య, విజ్ఞాన శాస్త్రం బోధింపబడేవి. 1842 లో జాన్ అండర్‌సన్‌చే ప్రారంభింపబడిన సమావేశ

...చ్చయప్ప విద్యా సంస్థల్లోను, జార్జ్‌టవున్‌లో వున్న పాఠశాలలోను మత

...బోధన ప్రారంభింపబడింది.

... పావెల్ ప్రథమ ప్రధానోపాధ్యాయుడుగా పూర్వపు పచ్చయప్ప పాఠశాలకు ... తరువాతి కాలంలో జార్జి నార్టన్ మరికొందరి కృషి ఫలితంగా ఆ ...గా వృద్ధి చెందింది.

...లోని క్రిష్టియన్ కళాశాల, తాంబరం లోని క్రిష్టియన్ కళాశాల, క్రైస్తవ ...దేశ సంస్థ పాఠశాలలకు పరంపరగా వెలువడ్డాయి. ఎ.జి.ఆర్. బతనాటే ...చనా విభాగాన్ని ప్రారంభించి దాన్ని విమ్నాత్న పరచి ప్రెసిడెన్సీ కళాశాలగా ...పొందించారు. 1891 లో ప్రత్యేక న్యాయ శాస్త్ర కళాశాల ఏర్పడేవరకు ...బోధన ఈ కళాశాలలో జరిగింది. 1856 లో సాధారణ ఉపాధ్యాయ ... ప్రస్తుతపు ఉపాధ్యాయ శిక్షణా కళాశాల ప్రారంభింపబడింది.

1857 లో మద్రాసు విశ్వ విద్యాలయం స్థాపించ బడింది. ఇది మొదట ప్రెసిడెన్సీ కళాశాల్లో ప్రారంభింప బడింది. ప్రత్యేక విశ్వ విద్యాలయంగా 1914 ...బడింది. 1923 లో సాధారణ విద్యాబోధనకు, గురుకుల విద్యాబోధనకు ... కావింపబడింది. ఒకే విశ్వ విద్యాలయం రాష్ట్రానికంతటికి ...దించడం కష్టమైనందున 1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ...బడింది.

మద్రాసు విశ్వ విద్యాలయంలోని ఉపాధ్యాయ వర్గం, విద్యార్థినీ విద్యార్థుల

...

...

367

విద్యార్థులు



| పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|
| 1818 | 726 | 2544 |

1933 లో జార్జి స్టాన్లీ పేరుతో వైద్య పాఠశాల ప్రారంభింప బడింది. 1938 లో ... వైద్య పాఠశాలను దీనితో మిళితం చేసి ప్రభుత్వ స్టాన్లీ వైద్య కళాశాలగా ...

1876 లో సైదాపేట్‌లో వ్యవసాయ కళాశాల ప్రారంభింపబడింది. ఇది 1908 ...కోయంబత్తూరుకు మార్చబడింది. 1902 లో వేపేరిలో ఒక పశువైద్య కళాశాల ... బడింది. ప్రస్తుత కీల్పాక్ వైద్య కళాశాల 1960 లో ప్రారంభింపబడింది.

‌లోని భారత సాంకేతిక విద్యా సంస్థ ప్రారంభింపబడింది.

లో సెయింట్ జార్జి కోటలో స్థాపింపబడిన కళాశాల ప్రాచ్య తాళపత్ర మార్చబడింది. కల్నల్-కోలిన్-మెకన్జీ భారత దేశంలో పరిశోధన చేసి ల్ని, చరిత్ర సంబంధ ప్రతుల్ని, దస్తావేజుల్ని, శిలాశాసనాల్ని వెలికి తెచ్చారు.

మద్రాసు విశ్వ విద్యాలయం లోని గ్రంథాలయంలో కల్నల్ మెకన్జీ క ప్రాచ్యదేశ వ్రాత ప్రతులున్నాయి.

మను లలిత కళాసంస్థ 1936 లో భారత నృత్య విద్వాంసురాలైన శ్రీమతి ంభింపబడింది. ఇది సత్సంప్రదాయాల్ని సంతరించుకొంది. ఇక్కడ శిక్షణ న్ విద్యార్థులు నాట్యకళలో ప్రసిద్ధిపొంది భారత దేశ సంప్రదాయాల్ని, ం ప్రపంచమంతటా వ్యాపింప చేస్తున్నారు.

ం నగరంలోని వివిధ కళాశాలల, పాఠశాలల వివరాలు క్రింది పట్టికలో

## విద్యా సంస్థలు I



**కళాశాలలు**

2 — సాంఘిక, సామాన్య శాస్త్ర కళాశాలలు — 13

3 — వైద్య కళాశాలలు — 4

4 — న్యాయశాస్త్ర కళాశాల — 1

6 — ఉన్నత విద్యా కళాశాలలు — 104

7 — వాస్తు కళాశాలలు — 2

విద్యా సంస్థలు II



**పాఠశాలలు 2**



| 1 | 2 | 3 |
|---|---|---|
| మెట్రిక్యులేషన్ పాఠశాలలు 110 | మాధ్యమిక పాఠశాలలు 247 | ప్రాధమిక పాఠశాలలు 347 |



| 4 | 5 |
|---|---|
| వృత్తి విద్యాశాలలు | వయోజన విద్యా కేంద్రాలు 306 |



| | | |
|---|---|---|
| [illegible] | టైపు మరియు షార్ట్ హాండ్ 220 | ఇతర వృత్తి విద్యా కేంద్రాలు 22 |

### 3.5.1.2 మద్రాసు నగర రక్షక భట వ్యవస్థాపన

1832 లో 'జార్జి నార్టన్' రక్షక భట చట్ట నిబంధనల్ని అనుసరించి రక్షక భట చట్టం XIII ను ఏర్పరచినారు. 1856 లో ఈ చట్టం అమల్లోకి వచ్చింది. ఈ విధంగా అప్పుడు మొదట మద్రాసు నగరంలో రక్షక భట వ్యవస్థ స్థాపితమయింది. 1959 లో జిల్లా రక్షక భట నిబంధనా చట్టం XXIV అమల్లోకి వచ్చింది.

'ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్' అనే అధికారి పదవి ఏర్పరచి అతడి అధికార పరిధిలోకి ఈ వ్యవస్థ తీసికొని రాబడింది.

1892 లో రైల్వే రక్షక భట వ్యవస్థ ప్రారంభింపబడింది. స్వాతంత్య్రం వచ్చిన తర్వాత నేర పరిశోధనకు శునకాల్ని ఉపయోగించడాన్ని మొట్టమొదట మద్రాసు నగరమే ప్రారంభించింది. 1946 లో నిస్తంత్రి (Wireless Grid) విద్యుత్సమాచార సాధనాలుపయోగం ప్రారంభింప బడింది. 1956 లో రక్షక భట కార్యాలయం మెరీనా సముద్ర తీరానికి అభిముఖంగా కట్టబడింది. మద్రాసు నగరంలో ప్రస్తుతం మొత్తం 164 రక్షక భట కార్యాలయాలున్నాయి.

### 3.5.1.3 తంతి, తపాలా వ్యవస్థ

తంతి తపాలా సౌకర్యాలేర్పడిన ప్రారంభదశ ప్రస్తుత వ్యవస్థ కంటే భిన్నంగా వుండేది. 1736 లో ఈస్టిండియా కంపెనీతో సవివరమైన సంప్రదింపులతో తంతి తపాలా శాఖ ప్రారంభింపబడింది. 40 సం॥ తరువాత 1774 లో ఒక తపాలా శాఖాధికారి నియమింపబడి పౌర సంబంధమైన జాబులకు తపాలా ఖర్చులు నిర్ణయించడం జరిగింది.

పక్షం రోజుల కొకసారి మద్రాసు నుండి కలకత్తా, బొంబాయి, నగరాలకు రైలు ద్వారా తపాలా బంగీలను చేరవేయు పద్ధతి 1786 లో ఏర్పరుపబడింది. తపాలా బంగీలను రైలుద్వారా తీర ప్రదేశాలకు చేరవేయు పద్ధతి మొదటిసారిగా 1856 లో మద్రాసు లో ప్రారంభింప బడింది. తపాలా బిళ్ళలు వాడే పద్ధతి ప్రధమంగా 1854 లో ప్రవేశపెట్టబడింది. ఈ వ్యవస్థ మొత్తం తంతి తపాలా నిర్వాహకుని (Director General) ఆధ్వర్యంలో వుంచబడింది. 1870 - 1880 మధ్యలో విలువ చెల్లించే తపాలా రవాణా పద్ధతి (V.P.P.) డబ్బును తపాలా ద్వారా పంపే పద్ధతి (M. O.) ప్రవేశపెట్టబడింది.

వ్యాపార సంస్థల్లో, కార్యాలయాల్లో, ఇతర సంస్థల్లో పని చేసే వారికి అనుకూలంగా వుండేందుకుగా లేట్ ఫీ సౌకర్యం తపాలా ఆఫీసుల మూలంగా ఏర్పరుప బడింది. ఇటువంటి తపాలా ఆఫీసు దక్షిణ మద్రాసులో ఒకటి, మరొకటి ఉత్తర మద్రాసులో ప్రారంభింప బడ్డాయి. సంచార తపాలా కార్యాలయాలు అన్ని రోజుల్లోను, సెలవు దినాల్లోను పనిచేస్తాయి. తరువాత కొంత కాలానికి ఇవి పట్టణ ముఖ్య కూడల్లలో సాయంకాలం, రాత్రులు కూడా పని చేయడం ప్రారంభించాయి. మద్రాసులోని విమానాశ్రయంలో రాత్రింబవళ్ళు తపాలా కార్యాలయం పని చేస్తుంది. మద్రాసులోని మౌంటురోడ్డులోను, పారీసులోను, నగర ప్రధాన తపాల కార్యాలయాలు నెలకొల్పబడ్డాయి. "సెంట్రల్ సిటీ" అనే పేరుతో కొత్తగా ఏర్పరుప బడింది. ప్రస్తుతం ప్రధానంగా మూడు తపాలా విభాగాలున్నాయి. నగరంలో వున్న అన్ని తపాలా కార్యాలయాలు ఈ మూడింటి ఆధ్వర్యంలో వున్నాయి. మద్రాసులో 239 తపాలా కార్యాలయాలు, 19 ఉపతపాలా కార్యాలయాలు, 98 'టైమ్ స్కేల్' తపాలా కార్యాలయాలు, '6 ఎక్స్ట్రా డిపార్ట్మెంటల్' ఉప తపాలా కార్యాలయాలు, 1 ఎక్స్ట్రా డిపార్ట్మెంటల్ బ్రాంచ్ ఆఫీసు వున్నాయి. వీటిల్లో 8 తంతి కార్యాలయాలతో కూడి వున్నాయి.

తపాలా సౌకర్యం కోసం అనేక నూతన పథకాలు తయారు చేసి దిన దినాభివృద్ధి

ప్రయత్నం చేస్తున్నారు.

**తంతి సౌకర్యం :**

మద్రాసులోని మౌంటురోడ్డు లోని తపాలా కార్యాలయంలో నున్న తంతి ... అతి పెద్దది. మద్రాసుకు దక్షిణంగా వున్న ముఖ్యమైన అన్ని కేంద్రాలతోను, ... ఉన్న అన్ని కేంద్రాలతోను దీనికి సంబంధముంది. తంతి సౌకర్యం కొన్ని ...ల్లో మోర్స్ (Morse) పద్ధతిలోను, కొన్ని కార్యాలయాల్లో తంతి అచ్చు పద్ధతి ... Printer) ఏర్పరుప బడింది. అన్ని కార్యాలయాలకు బొంబాయి, కలకత్తా, ఢిల్లీ లాంటి ... నగరాలని కలుపుతూ తంతి సౌకర్యమేర్పరుప బడింది.

## 3.5.1.4 దూరవాణి సౌకర్యం

మద్రాసులో దూరవాణి ప్రక్రియ 86 సం॥ చరిత్ర కలది. ప్రప్రధమంగా 1881 ... ఓరియంటల్ దూరవాణి, విద్యుత్ కంపెనీ లిమిటెడ్ వారు ఇంగ్లాండులో దూరవాణి ... ఏర్పరచారు. వాటి వ్యాపార శాఖలు మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాలకు ...బాయి.

మద్రాసు టెలిఫోను కంపెనీ అనుపేరుతో 1923 లో మద్రాసులో దూరవాణి ... స్థాపించబడింది. 1963 వరకు ఈ సంస్థ ఓరియంటల్ సంస్థకి అనుబంధంగా ... ప్రభుత్వం టెలిఫోను సంస్థను జాతీయం చేసిన తరువాత ప్రభుత్వ తంతి ... దూరవాణి సంస్థను నిర్వహిస్తోంది. 1908 లో ఎర్రబాలు చెట్టివీధిలోని ... కేంద్రాన్ని బ్లాకర్స్ వీధిలోని దూరవాణి కేంద్రాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ... కాలానికి అయస్కాంత పద్ధతిలో దూరవాణి ప్రక్రియని నిర్వహించడానికి ...

...స్తుత దూరవాణి కేంద్ర భవనం 1925 లో ప్రారంభింప బడింది. అప్పడు ... ప్రక్రియ ప్రారంభింప బడింది. మద్రాసు దూరవాణి ప్రక్రియ సుమారు ... మైళ్ళ వరకు విస్తరించింది.

1967 లో తనంతటదే తానే ఏ దిశలోనైనా సంబంధం కలిగించుకొనే పద్ధతిలో ... వాణి వుత్పత్తి వ్యాపార సంస్థచే భారత దేశంలో మొట్టమొదటి సారిగా ... మాంబళంలోని దూరవాణి కేంద్రంలో స్థాపించబడింది. ప్రస్తుతం మద్రాసు ... 509 పబ్లిక్ దూరవాణి కేంద్రాలున్నాయి.

## 3.5.1.5 రాకపోకలు - రవాణా సౌకర్యాలు

దక్షిణ భారత దేశానికి రాజధానిగా వుండిన మద్రాసు నగరం అన్ని మిలటరీ ... మూడు ముఖ్యమైన రహదారుల్లో సుదీర్ఘమైన, సువిశాలమైన వంతెనలు ... బ్రిటీషు వారి పరిపాలనా కాలం నుండి చిన్న పెద్ద వాహనాల రాకపోకలకు ... వున్నాయి. భారత దేశపు ఇతర పెద్ద నగరాల్తో మద్రాసు నగరాన్ని కలిపే

చక్కటి రహదారులు, రైలు మార్గాలు ఇక్కడ వున్నాయి. మద్రాసులో పెద్ద ఓడరేవు, అంతర్జాతీయ విమానాశ్రయం వున్నాయి.

### 3.5.1.5.1 రైలు మార్గం

మద్రాసులో రెండు రైలు మార్గాలున్నాయి. 1. మద్రాసు రైలు మార్గం 2. తూత్తుకూడి రైలు విభాగం. దక్షిణ భారత రైలు మార్గం మద్రాసు నుండే ప్రారంభమవుతుంది. మద్రాసు రైలు మార్గంలో నగరానికి ఉత్తరంగా వున్న రాయపురం చివరి స్టేషనుగా వుండేది. 1873 లో ప్రస్తుత మద్రాసు సెంట్రల్ స్టేషన్ ప్రారంభింపబడే వరకు ఆఫీసు సామానుల్ని రవాణా చేయడానికి ఈ స్టేషన్నే వాడే వారు. ప్రయాణ సౌకర్యాల కోసం 1876 లో మద్రాసు నుండి తూత్తుకూడికి రైలు మార్గం ప్రారంభింపబడింది. దీని చివరి స్టేషను మద్రాసులోని ఎగ్మూరులో వుంది. మొట్టమొదట ఈ రైలు స్టేషను ఓడరేవు అవసరాలకై నిర్మించబడినా ఇది ప్రధానంగా ప్రయాణికుల ప్రయాణ సౌకర్యాల కోసం, వస్తువుల్ని రవాణా చేయడానికి కూడా ఉపయోగింప బడుతోంది.

విద్యుదీకరణం చేయబడిన రైలు మార్గం ప్రస్తుతం తాంబరం నుండి మద్రాసు బీచ్ స్టేషను వరకు 29 కి. మీ. పొడవున విస్తరించింది. ప్రతిరోజు 256 సార్లు మద్రాసు బీచ్ నుండి తాంబరానికి ఈ రైళ్ళు ప్రయాణం చేస్తాయి. ఒక్కొక్క రైలుకి సుమారు 1,600 మంది ప్రయాణికులుంటారు.

'బ్రాడ్‌గేజ్' లైన్లో ప్రయాణికులకి ఫార్సెల్లకి మద్రాసు లోని సెంట్రల్ స్టేషన్ ప్రధాన నిలయం. మీటర్ గేజ్ లైన్లకి మద్రాసులోని బీచి స్టేషను నిలయం. మద్రాసులో వున్న బ్రాడ్‌గేజ్ లైన్లు మద్రాసు నగరాన్ని భారత దేశంలోని ఇతర పెద్ద నగరాలైన కలకత్తా, ఢిల్లీ, బొంబాయి, బెంగుళూరు, హైదరాబాదు మొదలైన పెద్ద నగరాల్తో కలుపుతున్నాయి.

మద్రాసు ఓడరేవుకి ప్రత్యేకించి రైలు మార్గాలున్నాయి. ఈ మార్గాలు దక్షిణ రైల్వేకి కలుపబడి ఓడరేవు సంఘంచేత నడుపబడుతున్నాయి.

### 3.5.1.5.2 రోడ్డు రవాణా మార్గం

మద్రాసు నగరంలోని ప్రజలు ప్రయాణాలకు రైళ్ళ తరువాత ప్రధానంగా బస్సుల మీద ఆధారపడుతున్నారు. మద్రాసు నగరంలో ముఖ్యమైన రోడ్డు రవాణా సంస్థ "పల్లవన్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్" ఈ సంస్థ అధీనంలో సుమారు 2000 బస్సులున్నాయి. రోజుకు సుమారు 26 లక్షల జనాభా ఈ బస్సుల్లో ప్రయాణిస్తున్నారు. ఎక్కువ జన సంచారం వుండే "ఆఫీసు, స్కూళ్ళు" వేళల్లో ఈ సంస్థ ప్రత్యేకించి 50 చిన్న బస్సుల్ని, పిల్లలకు, స్త్రీలకు ప్రత్యేకించి 430 బస్సుల్ని 300 ఎక్స్‌ప్రెస్ బస్సుల్ని అదనంగా నడుపుతుంది. ఈ సంస్థ మద్రాసు నగరంలోనే కాక చుట్టు పక్కల జిల్లాలకు కూడా బస్సుల్ని ఏర్పాటు చేసింది.

మద్రాసు నగరం నుండి తమిళనాడు రాష్ట్రంలోని ఇతర దూర ప్రాంతాలకు

[illegible] రవాణా సంస్థ" అనే మరొక సంస్థ వుంది. ఈ సంస్థ రాష్ట్రం మొత్తంలోని [illegible]ంతాలన్నిటికి బస్సుల్ని నడుపుతుంది. ఈ సంస్థలో 520 బస్సులున్నాయి. [illegible] సుమారు 44000 మంది ప్రయాణం చేస్తారు.

ఇంతే కాక మద్రాసు నగరంలో 2036 ఆటో రిక్షాలు, 2604 టాక్సీలు, 3182 [illegible] టాక్సీలు, 151 అదనపు సౌకర్యం కలిగిన బస్సులు, 114 ప్రవేటు రవాణా [illegible] తిరుగుతున్నాయి. నగరంలోని ఇతర ప్రాంతాలకు బొగ్గును రవాణా [illegible]5,366 గూడ్సు బండ్లు ఉపయోగింపబడుతున్నాయి.

మద్రాసు నగరంలో సగటు మనిషి రవాణా సౌకర్యం సైకిలు. వీటి సంఖ్య ఇతర [illegible] వాహనాల కంటే ఎక్కువ. నగరంలో సుమారు ఆరు లక్షల సైకిళ్ళు తిరుగుతున్నాయి. [illegible] సమయాల్లో బస్సుల్లో ప్రయాణం చేయడం కష్టమైనందున చాలా మంది సైకిళ్లను [illegible] కొరకు ఉపయోగిస్తున్నారు. 1980 లో జరిగిన మద్రాసు నగర 'ట్రాఫిక్ సర్వే'లో సామాన్య ప్రజలు ఎక్కువ మంది బస్సుల్లోను, సైకిళ్లతోను, కాలి నడకను ప్రయాణం చేస్తున్నారని తేలింది.

మద్రాసులో 1,370 కి. మీ. పొడవున రోడ్డు వేయబడి వుంది. ఇది నగరంలోని అన్ని ముఖ్య ప్రాంతాల్ని కలుపుతుంది.

### 3.5.1.5.3 నౌకా మార్గం

మద్రాసు నగరానికి, ఆంధ్ర రాష్ట్రానికి మధ్యలో నున్న బకింగ్‌హామ్ కాలువలో చాలా వరకు పడవల ద్వారా రవాణా జరుగుతోంది. ముఖ్యంగా యిందులో బొగ్గు, ఉప్పు, ధాన్యం, వంట చెరకు, రవాణా చేయబడుతోంది. మద్రాసు నగరంలో జరిగే వర్తక వ్యాపారాలకు ఈ నౌకా మార్గం అత్యధికంగా ఉపయోగ పడుతోంది. ఈ నౌకా మార్గం [illegible] దేశాలకు, ద్వీప కల్పాలకు ప్రయాణం చేయడానికి ప్రజలకు ఉపయోగకారిగా వుంది

### 3.5.1.5.4 విమానాశ్రయం

మద్రాసు నగరానికి మీనంబాకంలో అంతర్జాతీయ విమానాశ్రయం వుంది. ఇందులో 'ఇండియన్ ఎయిర్ లైన్స్' అని, 'ఎయిర్ ఇండియా' అని రెండు విభాగాలున్నాయి. [illegible] బొగ్గు రవాణాకు, దేశీయ ప్రయాణికులకు సంబంధించి 'ఇండియన్ ఎయిర్ లైన్స్' సంస్థ అంతర్జాతీయ ప్రయాణికులకు సంబంధించి 'ఎయిర్ ఇండియా' సంస్థ పని చేస్తున్నాయి. ఈ విమానాశ్రయం మద్రాసు నగరాన్ని భారత దేశంలోని ఇతర పెద్ద నగరాలతో కలపడం మాత్రమే కాక భారత దేశంలోని ముఖ్యమైన యాత్రా స్థలాలు, వ్యాపార కేంద్రాల్ని కూడా కలుపుతోంది. మద్రాసులోని రాకపోకల సాధనాల వివరాల్ని తరువాత పేజీలోని పట్టికలో చూడవచ్చు.

## మద్రాసు రోడ్డు రవాణా సంస్థ

| సంస్థ పేరు | ప్రధాన నిలయం | ప్రయాణించు జిల్లాలు | బస్సుల సంఖ్య |
|---|---|---|---|
| 1. పల్లవన్ రవాణా సంస్థ | మద్రాసు | మద్రాసు జిల్లా | 2605 |
| 2. తిరువళ్ళువర్ రవాణా సంస్థ | మద్రాసు | తమిళనాడు మొత్తం | 847 |

మద్రాసులోని ఇతర వాహన వివరాలు

### I. వ్యాపార సంబంధ వాహనాలు

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| స్టేజి క్యారేజీలు | ఆటో రిక్షాలు | సామాన్య టాక్సీలు | టూరిస్ట్ టాక్సీలు | లగ్జరీ బస్సులు |
| 4990 | 6152 | 1160 | 4092 | 93 |

| 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|
| ప్రైవేటు రవాణా వాహనాలు | వస్తు రవాణా వాహనాలు | ట్రాక్టర్లు | ఇతర వాహనాలు | మొత్తం వాహనాల సంఖ్య |
| 165 | 14,760 | 179 | 429 | 32,020 |

### II. వ్యాపారేతర వాహనాలు

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| మోటారు కారులు | మోటారు సైకిళ్ళు | స్టేషను వేగన్లు | జీపులు | సామాన్ల వేగన్లు |
| 86,189 | 2,01,407 | 272 | 443 | 15,106 |




### 3.5.1.6 విద్యుచ్ఛక్తి

మద్రాసు నగరానికి ఎన్నూరు థర్మల్ పవర్ స్టేషను నుండి, బేసిన్ బ్రిడ్జీ పవర్ [illegible] నుండి విద్యుత్తు సరఫరా అవుతుంది. మద్రాసులో కర్మాగారాలు ఎక్కువగా [illegible] వల్ల మద్రాసులో పెద్ద విద్యుత్ కేంద్రాలు ఏర్పాటు చేయబడ్డాయి.

### 3.5.1.7 నీటి సరఫరా

1872 లో రక్షిత నీటి పథకం మద్రాసులో ప్రవేశ పెట్టబడింది. నగరానికి త్రాగే [illegible] హిల్స్' వద్ద గల చెరువు నుండి సరఫరా చేయబడుతోంది. 'పూండి' [illegible] గల నీటిని 'కార్తాలియార్' నది ద్వారా 'రెడ్‌హిల్స్' సరస్సుకు, 'చంబరంబాకం' [illegible] తీసుకొని వచ్చి అక్కడి నుండి దిగువ, ఎగువ కాలువల ద్వారా 'చోళవరం, [illegible] జలాశయాలకి చేర్చబడుతోంది.

[illegible] కీల్పాకు దగ్గర వున్న నీటి సరఫరా ప్రక్రియకి నూతన సాంకేతిక వడపోత [illegible] అమర్చారు. ఇక్కడ నీరు శుభ్రపరచబడి పైపుల ద్వారా నగరంలో అన్ని ప్రాంతాలకు [illegible] చేయబడుతోంది.

[illegible] రోజుకి మద్రాసు నగరంలో పెరిగిపోతున్న జనాభాకు మంచినీరు చాలక [illegible] వల్ల కృష్ణా జలాన్ని నగరానికి తీసుకురావాలనే పథకం చాలా కాలం నుండి [illegible] పరిశీలనలో వుంది. ఈ పథకం సూత్రప్రాయంగా అన్ని దశలలోను [illegible]బడింది

### 3.5.1.8 ఫల పుష్పాలు

మద్రాసు నగరం సుందర దృశ్యాలకు, మామిడి, కొబ్బరి తోటలకు, జామ, ఆరంజి [illegible] ప్రసిద్ధి చెందింది. మద్రాసు నగరంలో జనాభా వృద్ధికాక ముందు నగరంలో [illegible] ముందు, వెనుక కొబ్బరి, జామ తదితర చెట్లు ఎక్కువగా వుండేవి. ఇప్పటికి [illegible] ఇండ్ల ముందు పచ్చటి చెట్లు, పూల తీగెలు, పూలచెట్లు, పండ్ల చెట్లు ఎక్కువగా [illegible] నగరంలో గల పీపుల్స్ పార్క్, నేపియర్ పార్క్, మైలేడి చిల్డ్రన్ పార్క్, గిండీ [illegible] పార్క్, నెహ్రూ పార్క్, నాగేశ్వరరావు పార్క్, ఇండి పెండెన్స్ పార్క్, అణ్ణా పార్క్, [illegible] పార్కుల్లోను, రాజ్ భవన్‌లోను, థియసాఫికల్ సొసైటీ ఆవరణలోను, ఇంకా [illegible] ముందు పచ్చటి పూలచెట్లు, ఫల వృక్షాలు కనిపిస్తాయి.

మద్రాసుకు దక్షిణంలో అడయారులోను, ఉత్తరంలో తండయార్‌పేటలోను నిమ్మ, మామిడి, చింత, వేప, అరటి, కొబ్బరి, తాటి, చవక తోటలు ఎక్కువగా కనబడతాయి. నగరంలో చాలా వరకు చవక చెట్లనే వంట చెరకుగా వాడుతున్నారు. కాలక్రమేణ జనాభా అభివృద్ధి చెందడం వల్ల పూల తోటలు, వనాల పెంపకం తగ్గుతూ వచ్చింది.

3.5.1.9 భవన నిర్మాణం

మద్రాసులోని భవన నిర్మాణాన్ని పరిశీలిస్తే భిన్న నాగరికత, సంస్కృతులకు ఈ నగరం నిలయమని స్పష్టమౌతుంది. హిందూ, మొగల్, ఆంగ్ల సంప్రదాయాలకి సంబంధించిన భవనాలు ఆనాటి సంస్కృతిని వెల్లడిస్తున్నాయి.

సెయింట్ జార్జి కోటలోని పురావస్తు ప్రదర్శనశాల భారత దేశంలో బ్రిటీషు వారి కార్యకలాపాలకు ప్రత్యేక నిదర్శనం. తాళ పత్రాలు, జాబులు, నాణేలు, పింగాణి పాత్రలు, వస్త్రాలు, చూపరులను ఆకట్టుకొనే విధంగా వుంటాయి.

శాంథోమ్‌లోని సెయింట్ థామస్ చర్చి 'గోతిక్' శిల్పకళా నైపుణ్యాన్ని వెల్లడిస్తోంది. ఎగ్మూరులోని 'పాంతియన్‌రోడ్'లో వున్న నేషనల్ ఆర్ట్ గేలరీ 'హిందూ,' 'సెరాసెనిక్' శిల్ప కళకు నిదర్శనంగా నిలిచి వుంది. ప్రాచీన వర్ణ చిత్రాలు, ఆధునిక కళా ఖండాలు, ఎన్నో యిందులో పొందుపరచి వున్నాయి. రాజపుత్రుల, మొగలుల, దక్షిణ భారతీయుల అరుదైన వర్ణ చిత్రాలు ఇక్కడ భద్రపరచబడి వున్నాయి. ఆర్ట్‌గేలరీకి ప్రక్కన ప్రభుత్వ పురావస్తు ప్రదర్శనశాల వుంది. ఇక్కడ వున్న వస్తు సముదాయం పల్లవుల, చోళుల, పాండ్యుల నాటి శిల్పకళా వైభవాన్ని వెల్లడిస్తున్నాయి. క్రీ.శ. 2వ శ॥ చెందిన అమరావతిలోని బుద్ధుని స్థూపంలో గల శిల్పకళా ఖండాలు ఇక్కడ భద్రపరచబడి వున్నాయి.

ఈ వస్తు ప్రదర్శనశాలకు మరొకవైపు స్త్రీలకు, పిల్లలకు విడివిడిగా వైద్యశాలలు నిర్మింపబడి వున్నాయి. భారత దేశంలో గల పెద్ద వైద్యశాలల్లో ఇవి చెప్పదగినవి. మరొకవైపు విక్టోరియా సాంకేతిక విద్యాలయాల భవనాలున్నాయి. ఈ భవన సముదాయం మద్రాసు నగర అవసరాలకి అనుగుణంగా కట్టబడి వున్నాయి. గులాబీరంగు మట్టితో చేయబడిన ఇటుకలతో మొగలుల సంప్రదాయాల్ని అనుసరించి వున్నాయి. ఈ భవనానికి ముందున్న ద్వారం అక్బరు పాదుషా కలలుగన్న ఫతేపూర్ సిక్రీ కోట ద్వారం మాదిరిగా అరబ్బీ నాగరికత తొణికిసలాడే విధంగా వుంది.

ఈ భవనంలో గల పెద్ద హాలు లోపల చలువ రాతితోను, పైకప్పు మద్రాసు సున్నంతోను కట్టబడి వున్నాయి. దీనిని దాటిన తరువాత నివాస యోగ్యమైన నుంగంబాకం వస్తుంది. ఇక్కడ కాలేజీ అని పిలువబడే భవన సముదాయంలో విద్యాశాఖాధికారి కార్యాలయం, ప్రభుత్వ కార్యాలయాలు, వ్యాపార సంస్థలకు సంబంధించిన పెద్ద భవనాలు అనేకం నిర్మింపబడి వున్నాయి.

శాంథోమ్‌నుండి సెయింట్ జార్జికోట వరకు రెండుమైళ్ళ పొడవు సముద్ర తీరముంది. ఈ తీర ప్రాంతం పొడవున పెద్ద పెద్ద భవనాలు నిర్మింపబడి వున్నాయి.

[illegible] పాలనా సంబంధమైన కార్యాలయాలు, గ్రంథాలయం, మద్రాసు [illegible] సభా మందిరం మొదలైన భవనాలున్నాయి. ఇవి నవాబుల కాలంలో [illegible] చేత నిర్మింపబడ్డాయి.

[illegible] సుందరమైన చేపాకు ప్రాసాదం, ప్రెసిడెన్సీ కళాశాల భవనాలు ఇటలీ దేశ [illegible] శైలిలో నిర్మింపబడ్డాయి. మరొక వైపు సన్నని స్తంభాలు కల సమ్మెటాకారపు [illegible] మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధంగా వుంది. దాని తరువాత మద్రాసు [illegible] బోర్డ్ వారి భవన సముదాయం నిర్మింపబడి వుంది. ఆ తరువాత క్వీన్ [illegible] భవనాలున్నాయి.

జార్జి టౌనుకు దక్షిణ భాగంలో తూర్పు ప్రక్కన ఎస్ప్లనేడు, హైకోర్టు భవనాలు, [illegible] కళాశాల, మద్రాసు దూరవాణి కేంద్ర భవనాలున్నాయి. దక్షిణాన ప్రాచీన [illegible] కళాశాల భవనం, పచ్చయప్ప హాలు వున్నాయి. ప్రసిద్ధమైన వై. యం. సి. ఎ. [illegible] ఇక్కడే వుంది.

జార్జి టౌనుకు ఉత్తర దక్షిణాలుగా ఓడరేవు ప్రక్కన బీచ్ స్టేషను వున్న [illegible]లో పారిస్ నుండి ఇన్‌కమ్ టాక్స్ భవనం వరకు గంభీరమైన భవనాలు [illegible] వున్నాయి వీటిలో నేషనల్ ఇంపీరియల్ మర్కంటైల్ భవనాలున్నాయి. జనరల్ పోస్టాఫీసు. టెలిగ్రాఫ్ ఆఫీసు, పురాతనమైన చిన్న గోపురాకార ఓడరేవు ఆఫీసు, బీచిరైలు స్టేషను వున్నాయి

ఎగ్మూరు రైల్వే స్టేషను భారత అరబ్బీ మిళితమైన నాగరికతకు చిహ్నంగా నిర్మింపబడింది. మద్రాసు నగర కార్యనిర్వహణ భవనం 1907 లో నిర్మింప బడింది. [illegible] తమిళంలో 'తమిళగ అరసు తలమై చెయిలగం' అని వ్యవహరిస్తున్నారు.

ఇటుకలతో చెరువులు నిర్మించి వాటిలోనికి దిగడానికి అనువుగా మెట్లుపెట్టి మధ్యలో మండపాన్ని నిర్మించిన విధం మద్రాసు నగరంలో చెప్పుకోదగ్గ ఆకర్షణ. ఇవి ముఖ్యంగా హిందూ దేవాలయాల ముందు నిర్మించినట్లు తెలుస్తుంది. పార్థసారథి దేవాలయానికి, కపిలేశ్వర దేవాలయానికి, వడపళని గుడికి ముందున్న మండపాలు చెప్పుకోదగ్గవి

మౌంటు రోడ్డులోని భవనాలు చాలా వరకు వ్యాపార కేంద్రాలుగా వున్నాయి. ముఖ్యంగా 14 అంతస్తులు కలిగిన జీవిత భీమా సంస్థ భవనం, స్పెన్సర్ టవర్స్, మద్రాసుకు వచ్చే యాత్రికుల్ని ఆకర్షిస్తాయి. గిండీలో పారిశ్రామిక భవనాలు అనేకం నిర్మింపబడి వున్నాయి మిగిలిన ప్రాంతమంతా జన నివాసయోగ్యమైన భవనాలున్నాయి.

'వళ్ళువర్ కోటం' అనే భవనం తమిళ కవియైన వళ్ళువర్ జ్ఞాపకార్థం నిర్మింపబడింది

### 3.5.2 సామాజిక పరిస్థితులు

రాజకీయాలు, పారిశ్రామిక విప్లవం సాంఘిక జీవనం మీద ఆధారపడి మద్రాసు

నగరాభివృద్ధి జరిగింది. ఈ అభివృద్ధి పశ్చిమ దేశాల్లోలాగ గ్రామాలను పాడుచేయక గ్రామాల్లో వుండే ఆచార వ్యవహారాలను అంతమొందించక భారతదేశ నాగరికతకు, సంస్కృతికి అనుగుణంగా జరిగింది. పురాతన ఆచారాలకు, నూతన భావాలకు మధ్య చాలా అంతరముంది. అందువల్లనే సాంఘికాచారాల్లో మార్పు కనిపిస్తోంది.

మద్రాసు నగరాభివృద్ధి బొంబాయి, కలకత్తా నగరాల మాదిరిగా సంక్షోభితం కాక క్రమాభివృద్ధి చెందుతూ వచ్చింది. అందు వల్లనే మద్రాసు నగరం భారతదేశంలోని ఇతర నగరాల్లోకెల్ల ప్రసిద్ధంగాను, స్వాభావికంగాను, భారతదేశ అవసరాలకు అనుగుణంగా కావలసిన నాగరికతను పొందుపరచుకొని వుంది.

మద్రాసు నగరం దక్షిణ భారత సంగీత నాట్య, నాటక శిల్పకళాదులకు ఆలవాలం. భారతదేశంలోను, విదేశాల్లోను పేరెన్నికగన్న జ్ఞాన యోగ విద్యాసంస్థలు, కళాక్షేత్రాలు, హస్తకళలకు సంబంధించిన అనేక సంస్థలు మద్రాసు నగరంలో స్థాపించబడి చరిత్రలో ప్రసిద్ధికెక్కాయి.

మద్రాసులోని మోబరీస్ రోడ్డులో వున్న మ్యూజిక్ ఎకాడమీ సంస్థ, ఇంకా ఇతర సాంస్కృతిక కళానిలయాలు మద్రాసుకు ప్రత్యేకమైన కీర్తిని సంపాదించి పెట్టాయి. ముఖ్యంగా మద్రాసులో కోడంబాకంలో వున్న చలనచిత్ర పరిశ్రమ, సినిమా స్టూడియోలు దక్షిణ భారతదేశంలోనే ప్రసిద్ధిపొందాయి. దక్షిణ భారత భాషలన్నింటిలోను, ముఖ్యంగా తమిళ, తెలుగు భాషల్లో అత్యధికంగా చలన చిత్రాలు ఇక్కడ నిర్మింప బడుతున్నాయి. మద్రాసులోగల సాంస్కృతిక సంఘాలు, సినిమా స్టూడియోలు, సినిమాహాళ్ళ వివరణ క్రింది పట్టికలో చూడవచ్చు.

## సారస్వత సాంస్కృతిక సౌకర్యాలు




| స్టూడియోలు | సినిమాహాళ్ళు | ఆడిటోరియాలు | పబ్లిక్ లైబ్రరీలు | ప్రింటింగ్ ప్రెస్‌లు |
|---|---|---|---|---|
| 9 | 88 | 220 | 112 | 170 |

మద్రాసు నగర ప్రజలకు తీరిక వేళల్లో కాలక్షేపానికి అనేక విధాలైన క్లబ్బులు, విశ్రాంతి మందిరాలు వున్నాయి. వీటిలో మద్రాసు రేసుక్లబ్బు, మద్రాసు బోటు క్లబ్బు, కాస్మోపాలిటన్, జింకానా క్లబ్బు మొదలైనవి చెప్పకోతగ్గవి. ఇంకా రోటరీ క్లబ్బు, లయన్స్ క్లబ్బు లాంటి స్వచ్ఛంద సేవాసంస్థలు కూడా తమ సేవల్ని ఈ నగరాభివృద్ధికి అందజేస్తున్నాయి. ఇంతే కాక ఇంకా అనేక రకాలైన భోజన హోటళ్ళు, ఫలహార శాలలు, అతి విలువైన స్టార్ హోటళ్ళు, స్వదేశీ విదేశీయ సంస్కృతి మిళిత మైనవి అనేకం వున్నాయి.

మద్రాసు నగరం అన్ని విషయాల్లోను ఇంత అభివృద్ధిని పొందినా సమాజంలో

[illegible] వారు అధిక సంఖ్యలో వీధుల్లో నివసిస్తున్నట్లు కనబడుతోంది. [illegible] సమశీతోష్ణ స్థితి గృహ వసతి లేని వారికి రోడ్ల ప్రక్కన [illegible] జీవించడానికి అనుకూలంగా వుంది. తరచుగా మద్రాసుకు [illegible] జనం సంసారాలతోవచ్చి వాల్‌టాక్స్ రోడ్డు, మిగిలిన పరిసర ప్రాంతాల్లో [illegible] వీళ్ళందరూ సంచార ప్రవృత్తిగల జనం కాకపోయినప్పటికి [illegible] జనులుగా కనబడుతున్నారు. వీరు చాలా వరకు ఇండ్లయొక్క వీధి [illegible] నిద్రిస్తుంటారు. నగర జనాభాలెక్కలు సేకరించేవారు వీళ్ళని కూడా లెక్కకు [illegible] వీరి జనాభానే ఎక్కువగా వుంటుంది. ఈ గృహవసతి లేని సంచార [illegible] చాలా కష్టమైన పని.

[illegible] కొత్వాలు బజారు, ఎస్ప్లనేడు, పార్కు టవునులో ఎక్కువగా వుంటారు. [illegible] కూలీలు ఓడరేవుకు ఉత్తరంగా వున్న రోడ్డు ప్రక్కన గోడౌన్ల వసారాల్లో [illegible] కొత్వాలు బజారులో పనిచేసే కూలీలు తరచుగా మలయ పెరుమాళ్ళ [illegible] ఆఫీసుల ముందు గోడౌన్ల ముందు నిద్రిస్తుంటారు. అదేవిధంగా [illegible] గృహవసతి లేని జనం బందరురోడ్డు, చైనా బజారురోడ్డు, లా కాలేజి, [illegible] ఇతర అంగళ్ళ చెక్కలమీద నిద్రిస్తుంటారు. వీరిలో అనేకమంది ఇంటి [illegible] లేక గృహవసతిలేక ఇలా వీధుల్లో ప్లాటుఫారాల మీద నివసిస్తున్నట్లు [illegible]

[illegible] లేకుండా వ్యర్థంగా తిరగడమే వృత్తిగా గలవారు, బిచ్చగాళ్ళు మద్రాసు [illegible] పెద్ద సమస్యగా పరిణమించారు. ఇలాంటివారు చాలామంది రిప్పన్ భవన [illegible] హైరోడ్డుకి ఇరు ప్రక్కలవున్న ప్రదేశాల్లో నివాసమేర్పరచుకొని వున్నారు.

[illegible] దేశపు మత సంప్రదాయ ప్రభావం సమాజంలోని ఇలాంటి బిచ్చగాళ్ళను, [illegible] తిరగడమే వృత్తిగాగల వాళ్ళను మద్రాసు నగరానికి సమస్యగా చేసింది.

### 3.5.3 ఆర్థిక వనరులు

మద్రాసు నగరం వ్యాపార రీత్యా భారత దేశంలో ముఖ్య కేంద్రంగా వున్నందువల్ల [illegible] నగరం వున్నత స్థానాన్ని పొందిందని చెప్పవచ్చు. మద్రాసు నగర ఆదాయం [illegible] పురపాలక సంఘం నుండి లభిస్తోంది.

ఈ పురపాలక సంఘానికి ఆదాయం ప్రధానంగా వాహనాలు, బండ్లు, పశువులపై [illegible] బాడుగలు, సుంకాలు మత్తు పదార్థాలపై పన్నులు, కళలు, వృత్తి, వ్యాపారం, [illegible] నీరు, వీధి దీపాలు మొదలైన వాటిపై పన్ను ఇంకా నానా విధాలైన [illegible] వస్తుంది

ఈ పురపాలక సంఘపు ఆదాయ వ్యయాలు క్రింది ప్రజా సంక్షేమ కార్యక్రమాలకు [illegible] మత్తు పదార్థాలపై సుంకం విధించడం, క్రమ పద్ధతిలో జనన [illegible] నమోదు చేయడం, వృక్ష సంపదని కాపాడటం, విద్యావ్యాప్తి, ప్రజారోగ్యశాలల

మరమ్మత్తు, నూతన భవనాల నిర్మాణం, ఔషధ శాలల నిర్మాణం, టీకాలు వేసే వారికి శిక్షణ ఇవ్వడం, ఉద్యోగ నియామకాలు మొదలైన వాటిని నిర్వహిస్తోంది. తండియార్‌పేట లోని అంటు వ్యాధుల వైద్యశాల, అయనావరంలో వున్న క్షయ వ్యాధి వైద్యశాల మద్రాసు పురపాలక సంఘంచే నడుపబడుతున్నాయి. ఈ సంఘ అధీనంలో వున్న వైద్యశాలల, పాఠశాలల వివరాల్ని క్రింది పట్టికలో చూడవచ్చు.

**మద్రాసు పురపాలక సంఘ అధీనంలో వున్న వైద్యశాలలు, విద్యాలయాలు**

**వైద్యశాలలు**

| ఔషధశాలలు | శిశుసంక్షేమ కేంద్రాలు | కుటుంబ నియంత్రణ కేంద్రాలు | వైద్యశాలలు |
|---|---|---|---|
| 69 | 44 | 62 | 2 |

**విద్యాలయాలు**

| ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలు | ఉన్నత పాఠశాలలు | హైయర్ సెకండరీ పాఠశాలలు |
|---|---|---|
| 360 | 25 | 10 |

వర్తక వ్యాపారాల విషయంలో మద్రాసు అతి ప్రధానమైన నగరంగా గుర్తింపబడింది. మద్రాసులో వున్న ఓడరేవు దేశంలోని పెద్ద ఓడరేవుల్లో నాల్గోది. అంతర్జాతీయంగా వృద్ధిపొందిన నగరాల్లో అయిదవది. మద్రాసు ఓడరేవు నుండి జపాను, సింగపూరు, మలేషియా, బర్మా, బాంగ్లాదేశ్, సిలోను, ఇంకా కొన్ని తూర్పుతీర దేశాలతో సముద్ర వ్యాపార సంబంధాలున్నాయి. దేశంలోని ముఖ్యమైన పారిశ్రామిక నగరాల్లో మద్రాసు ఒకటి. కర్మాగారాల స్థాపనలో మద్రాసు తమిళనాడు రాష్ట్రంలో కోయంబత్తూరు, సేలం తరువాత మూడవ స్థానాన్ని పొంది వుంది. కాని ఉద్యోగ నియామకాలు, ఉత్పత్తి పెట్టుబడుల విషయంలో చూస్తే వున్నత స్థానాన్ని పొంది వుంది. పారిశ్రామిక వుత్పత్తిలో మద్రాసు రెండవ స్థానాన్ని పొందింది.

మద్రాసులో కర్మాగారాభివృద్ధి చాలా ఆసక్తికరంగా జరిగింది. రెండవ ప్రపంచ యుద్ధ కాలం నాటికి బ్రిటీషువారు పరిశ్రమాభివృద్ధి యొక్క అవసరాన్ని గుర్తించారు. బ్రిటీషువారు భారత దేశానికి వచ్చి ఈస్టిండియా కంపెనీ స్థాపించిన తర్వాత చిన్న చిన్న పరిశ్రమల్ని నెలకొల్పడం ప్రారంభించారు. 1805 లో మొట్టమొదట 'థామస్ పారీ' అనే

అతడు శాంధోమ్‌లో తోళ్ల పరిశ్రమని స్థాపించాడు. బ్రిటీషువారు 1939 లో స్థాపించిన 1871 పారిశ్రామిక విభాగాల్లో 120 విభాగాలు మద్రాసులోనే స్థాపించబడ్డాయి. 19, 20 శ॥ లో చిన్న చిన్న పరిశ్రమలు అనేకం స్థాపించబడ్డాయి. దీనితో పారిశ్రామిక విప్లవం ప్రారంభ మయింది. 1939 నాటికి మద్రాసులో 141 కర్మాగారాలు వెలిసాయి. అందులో సరాసరి రోజుకి 20,946 మంది కార్మికులు పని చేసేవారు. 1939-40 సం.లో వృద్ధి చెందిన కర్మాగారాల్లో కార్మికులు సుమారు 14% పెరిగారు. 1943 కు కార్మికుల శాతం 50 కి పెరిగింది. 1943 కు మొత్తం కర్మాగారాలు 150 కాగా అందులో పని చేసే కార్మికుల సంఖ్య 47,657 కు పెరిగింది. పారిశ్రామికాభివృద్ధి జరిగే కొలది ముడి సరకు లోటు, ఖనిజ పదార్థాల లోటు, విద్యుచ్ఛక్తి కొరత, తగినంత పెట్టుబడులు లేకపోవడం లాంటి సమస్యలు ఏర్పడ్డాయి.

19వ శ॥ లో యూరోపియనులు మద్రాసులో అనేక పరిశ్రమల్ని స్థాపించారు. వాటిలో స్పెన్సర్ అండ్ కంపెని, సింప్సన్ అండ్ కంపెని, బెస్ట్ అండ్ కంపెని, బర్మాషెల్ కంపెని ముఖ్యమైనవి. 1835 లో రిజర్వు బ్యాంకు స్థాపించబడింది. 1843 నుండి 1937 మధ్యకాలంలో ఇంకా అనేక విదేశీయ బ్యాంకులు, ఇండియన్ బ్యాంకులు స్థాపించబడ్డాయి. పారిశ్రామికాభివృద్ధికి ఇవి తోడ్పడ్డాయి. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత 1948 లో భారత ప్రభుత్వం పరిశ్రమల్ని, ప్రభుత్వ, ప్రైవేటు పరిశ్రమలని రెండు విధాలుగా విడదీసింది. రెండవ పంచవర్ష ప్రణాళికలో పెద్ద పెద్ద పరిశ్రమల స్థాపన, వున్న పరిశ్రమల్ని ప్రోత్సహించి అభివృద్ధి చేయడం లాంటి కార్యక్రమాలు చేపట్టబడ్డాయి. 1961 అంతానికి పరిశ్రమల సంఖ్య 1297 కు అందులో పనిచేసే కార్మికుల సంఖ్య 65,955 కు పెరిగింది. ఈ విధంగా మద్రాసు పారిశ్రామికంగా అభివృద్ధి పొందింది.

మద్రాసులో పెద్ద పరిశ్రమ బంకింగ్‌హామ్ అండ్ కర్నాటిక్ మిల్లు. దీని స్థాపనతో మద్రాసులో నేత పరిశ్రమ ప్రారంభింప బడింది. మద్రాసు ఓడరేవుకు 5 కి. మీ. దూరంలో వున్న పెరంబూరు దగ్గర ఈ మిల్లు స్థాపించబడింది.

1788 లో పారీ అండ్ కంపెనీని స్థాపించారు. ఇక్కడ చక్కెర, రసాయనాలు, ఎరువులు మొదలైన వాటిని వుత్పత్తి చేస్తున్నారు. పెరంబూరులోని రైలు పెట్టెల కర్మాగారం ఆసియాలో కంతటికి పెద్దది. ఇక్కడ తయారు చేసే రైలు పెట్టెలను విదేశాలకు కూడా ఎగుమతి చేస్తున్నారు.

మరో పరిశ్రమ 'హిందూస్థాన్ టెలి ప్రింటర్స్ లిమిటెడ్' ఇది 1960 లో స్థాపించ బడింది ఇందులో టెలిప్రింటు, ఎలక్ట్రానిక్ ఎక్స్ఛేంజి పరికరాలు తయారు చేయుబడుతున్నాయి

అడయార్ లోని 'డైనా విషన్' కంపెనీ తమిళనాడు పారిశ్రామికాభివృద్ధి సంస్థ పెట్టుబడితో దూర దర్శనులు తయారు చేసింది. 1978 లో తమిళనాడు మినరల్స్ కంపెనీ స్థాపించబడింది రాష్ట్రంలో లభించే ఖనిజాన్ని కొని, నగిషీ చేసే సంస్థను ప్రారంభించారు.

చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి దేశ ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతుంది. అందువల్ల ప్రభుత్వం తక్కువ ధరకు స్థలాన్ని ఇచ్చి ఈ పరిశ్రమలకు కావలసిన సేవలను అందించి చిన్న తరహా పరిశ్రమల్ని ప్రోత్సహించింది. అటువంటి వాటిలో ముఖ్యమైనది 'గిండీ' పరిశ్రమ. 100 ఎకరాల్లో ఈ చిన్న తరహా పరిశ్రమ సముదాయ సంస్థానం నిర్మింపబడింది. అందులో మెకానికల్ పనిముట్లు, ఖనిజ సంపద పరిశ్రమలు మొదలైన చిన్న తరహా పరిశ్రమలు ప్రారంభింప బడ్డాయి. ఈ పారిశ్రామిక సంస్థలో చిన్న పరిశ్రమల ఆర్థిక సహాయం కొరకు పారిశ్రామిక సహకార బ్యాంకు స్థాపించబడింది. ప్రస్తుతం ఈ పారిశ్రామిక వాడ 163.53 హెక్టారులకి విస్తరించి వుంది. ఇందులో 269 చిన్న, పెద్ద కర్మాగారాలు, కర్మాగార షెడ్డులు, 110 చిన్న పరిశ్రమల శాలలు ఉన్నాయి.

పెరంబూరు, మాధవరం దగ్గర 30 ఎకరాల భూమిలో తోలు పరిశ్రమ స్థాపించబడింది. ఈ యూనిట్ల నుండి బాగుచేసిన చర్మాలు ఇతర ప్రదేశాలకు ఎగుమతి అవుతాయి.

మద్రాసు నగరం కుటీర పరిశ్రమలకు కూడా ప్రసిద్ధి చెందింది. చేతి వృత్తులు, కుటీర పరిశ్రమలు విదేశీ వ్యాపారానికి ఎక్కువ ఉపయోగ పడుతున్నాయి. పేదవాళ్లని ప్రోత్సహించడానికి ప్రభుత్వం అనేక కుటీర పరిశ్రమల్ని స్థాపించింది. ఉత్తర మద్రాసులో 3 వృత్తి విద్యా శిక్షణ కేంద్రాలు స్థాపించబడ్డాయి. 'గిండీ' దగ్గర 'స్త్రీ సేవా మందిరం' దగ్గర ప్రభుత్వ చేతి వృత్తుల సంస్థల్లోను, ఖాదీ గ్రామోద్యోగ భవనంలోను, విక్టోరియా సాంకేతిక సంస్థల్లోను శిక్షణ ఇచ్చి కుటీర పరిశ్రమల్ని ప్రోత్సహిస్తున్నారు.

చలన చిత్ర పరిశ్రమ కూడా మద్రాసులో ప్రముఖ పాత్ర వహిస్తోంది. 1941 లో జెమినీ స్టూడియో స్థాపనతో ఫిలిం పరిశ్రమ రికార్డు స్థాయిలో వృద్ధి చెందింది. ప్రస్తుతం మద్రాసులో చాలా స్టూడియోలు వెలిశాయి. ఇందులో ఎ. వి. యమ్, విజయా, వాహినీ, సత్య, జెమినీ, నెప్ట్యూటన్, భరణి స్టూడియోలు ముఖ్యమైనవి.

మద్రాసులో వర్తక వ్యాపారాలు 1. రైలు మార్గం 2. నదీ మార్గం 3. రోడ్డు రవాణా మార్గంలోను, విమాన మూలంగా జరుగు తున్నాయి. మద్రాసుకు ఆంధ్ర, మైసూరు, కేరళ రాష్ట్రాలతో వ్యాపార సంబంధముంది. మద్రాసు రాష్ట్రానికి భారత దేశంలోని ఇతర రాష్ట్రాలతో కూడా ముఖ్యంగా బొంబాయి, పశ్చిమ బెంగాలు, బీహారు రాష్ట్రాలతో కూడా వ్యాపార సంబంధముంది.

### 3.5.4 పశుసంపద

ప్రభుత్వం పశువుల్ని పెంచే ప్రణాళికల్ని అభివృద్ధి చేయడం వల్ల సామాన్యమైన పశువులే కాక అనేక రకాలైన ఉత్తమ జాతి పశువుల పెంపకం కూడా వృద్ధి పొందింది. నూతన సాంకేతిక పద్ధతుల్ని వుపయోగించి పాల వుత్పత్తిని పెంచారు. నగరంలో స్థలాభావం వల్ల పశువుల సేవా కేంద్రాలు నగరానికి వెలుపలే ఏర్పాటు చేయబడ్డాయి. మద్రాసుకు కావలసిన పాలు మద్రాసు చుట్టు పక్కల వున్న 1 మాధవరం 2. అంబత్తూరు

పాల వుత్పత్తి కేంద్రాల నుండి లభిస్తాయి. గ్రామాల నుండి వచ్చే పాలను ఈ కేంద్రాలు శుభ్రపరచి అందులోని క్రొవ్వు, వెన్న తీసి నగరానికి సరఫరా చేస్తున్నాయి. ప్రస్తుతం మద్రాసులో 450 పాల డిపోలు, 105 మిల్కుబార్లు పాలను సరఫరా చేస్తున్నాయి.

## 3.5.5 చేపల పరిశ్రమ

మద్రాసులో 25.60 కి. మీ. పొడవున వున్న సముద్ర తీరంలో చేపల్ని పడుతున్నారు. మద్రాసు నగరంలో జాలర్లకు 29 సహకార సంఘాలున్నాయి. ఈ సంస్థలు జాలర్లు పట్టే చేపల్ని అమ్మిన ధనంతో చేపల్ని పట్టే పడవల్ని కొనడానికి, బాగుచేయడానికి చేపల్ని పట్టడంలోని క్రొత్త ప్రక్రియల్లో జాలర్లకి తర్ఫీదు ఇవ్వడానికి, ఎక్కువ ధరలతో చేపల్ని అమ్మించి లాభాలను ఆర్జించడానికి వుపయోగిస్తున్నాయి. అడయారులో చేపలు పట్టడానికి తర్ఫీదు ఇచ్చే సంస్థవుంది. ఇక్కడ యంత్రాల మూలంగా చేపల్ని పట్టే విధానంలో తర్ఫీదు ఇస్తారు.

## 3.5.6 బజార్లు, అంగళ్ళ కేంద్రాలు

మద్రాసులోని జార్జి టవున్‌లో రవాణా బ్యాంకులు, వ్యాపార సంస్థలు ఎక్కువగా వున్నాయి. టోకు వ్యాపారం చైనా బజారు రోడ్డులోను, కొత్వాలు బజారు రోడ్డు లోను జరుగుతోంది. చిల్లర వ్యాపారం సుభాసు చంద్రబోసురోడ్డు, ఈవినింగ్ బజారు, బ్రాడ్వే, మింటు వీధి, వాల్‌టాక్స్‌రోడ్డు మున్నగు ప్రదేశాలలో జరుగుతుంది.

కూరగాయలు, మాంసం, చేపలు, కోడి గ్రుడ్లు ఇతర నిత్యావసర వస్తువులు అమ్మబడే బజార్లు నగరంలో అనేకం వున్నాయి. 1782 లో కొత్వాలు మార్కెట్టు స్థాపించబడింది. ఈ బజారులో వ్యాపారం తెల్లవారు ఝామున 3 గం॥లకు ప్రారంభమౌతుంది. నగరంలోని ఇతర ప్రాంతాలకు, చుట్టు ప్రక్కల గ్రామాలన్నింటికి ఇక్కడ నుండి కూరగాయల ఎగుమతి జరుగుతుంది. ఇక్కడే పూలకు, పండ్లకు విడివిడిగా టోకు వ్యాపారపు బజార్లు వున్నాయి. 1904 లో ట్రిప్లికేను నగర సహకార సంస్థ (T.U.C.S.) సాధారణ పౌరుడి సేవకొరకు ప్రారంభింప బడింది.

మద్రాసు నగరంలో రోజు రోజుకు పెరిగే జన సాంద్రతను బట్టి మార్కెట్లు ఎక్కువవుతున్నాయి. బీచి స్టేషను ప్రక్కనున్న బర్మా బజారులో ఓడరేవు నుండి తీసుకొని రాబడిన విదేశీ సరుకులు అత్యధిక సంఖ్యలో విక్రయింప బడుతున్నాయి. మద్రాసులోని మింట్‌స్ట్రీట్, వాల్‌టాక్స్‌రోడ్డు, పురుసవాక్కం హైరోడ్డు, ట్రిప్లికేను హైరోడ్డు, లజ్‌కార్నర్, పాండి బజారు, టి. నగరు మొదలైన ప్రదేశాల్లో అంగళ్ళు అత్యధిక సంఖ్యలో వున్నాయి. మౌంటురోడ్డు భిన్నమైన అంగళ్ళకు నిలయం. చేనేత వస్త్రాలయాలు, చందనం, దంతం, కంచు, వెండి, తోలుతో చేయబడిన అనేక రకాల వస్తువులు ఇక్కడ విక్రయింప బడుతున్నాయి. ఇక్కడ వున్న వానవిల్, కో ఆప్‌టెక్స్, విక్టోరియా సాంకేతిక నిలయం, పూంపుహారు ఎంపోరియం, కాశ్మీరు, కేరళ, కర్ణాటక ప్రభుత్వ ఎంపోరియాలు, ఖాదీ గ్రామోద్యోగ భవనం, సెంట్రల్ హాండీ క్రాఫ్ట్స్‌ఎంపోరియం మొదలైనవి ప్రభుత్వ సహకారంతో

ంపబడ్డాయి.

పారిశ్రామికంగా ఇంత అభివృద్ధి చెందినా మద్రాసు నగరంలో ఖనిజ సంపద, వులు, వ్యవసాయ సంబంధమైన ఆర్థిక వనరులు లేకపోవడం ప్రస్ఫుటంగా తెలుస్తోంది.

మొత్తం మీద మద్రాసు నగర ఆదాయం వ్యయం కంటే తక్కువగా వుంది. ద్రాసు నగరానికి సంబంధించిన ఆదాయ వ్యయాలు ఎగుమతి దిగుమతులకు బంధించిన వివరాలు క్రింది పట్టికల్లో చూపబడ్డాయి.

**మద్రాసు నగర ఆదాయ వ్యయాల పట్టిక**

**ఆదాయం**

| మొత్తం ఆదాయం | పన్నుల మూలంగా | ఇతర ఆదాయం |
|---|---|---|
| 65.95 | 34.10 | 31.85 |

**వ్యయం**

| మొత్తం వ్యయం | సామాన్య పాలక వ్యయం | ప్రజా ఆరోగ్య సౌకర్యాలకు |
|---|---|---|
| 69.90 | 12.91 | 16.80 |

| ప్రజా పనులు (Public Works) | పబ్లిక్ సంస్థలకు | ఇతరాలు |
|---|---|---|
| 4.20 | 3.40 | 35.99 |

**మద్రాసులో తయారు చేయబడే ముఖ్య వస్తువుల ఎగుమతి, దిగుమతుల వివరాలు**

| వస్తువుల తయారి | ఎగుమతి | దిగుమతి |
|---|---|---|

| | | |
|---|---|---|
| రైలు పెట్టెలు | తోలు | పెట్రోలు |
| పత్తి | పొగాకు | ఇనుము |
| వ్యవసాయ పరికరాలు | ముడి ఇనుము | ఉక్కు |

## 3.6 మద్రాసులోని తెలుగు ప్రజలు - కులాలు

## ఆచార వ్యవహారాలు

మద్రాసు నగరంలో స్థిరపడ్డ తెలుగు వారిలో ఆంధ్ర దేశంలో ఎన్ని కులాల వారున్నారో అన్ని కులాల వారు ఉన్నారు. వారిలో అధిక జనసంఖ్యకలిగి సంఘంలో ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకొన్న కులాల వారి తెలుగు భాష పరిశోధనార్థం గ్రహింపబడింది. నా పరిశోధనార్థం ఎన్నుకోబడ్డ వివిధ కులాల వారి ఆచార వ్యవహారాలు ఈ అధ్యాయంలో వివరింపబడతాయి.

### 3.6.1 రెడ్డి

'రెడ్డి' శబ్దం ఇరట్టి, ఇరెట్టి, రడ్డ, రహ్‌టోర్, రతోర్, రాష్ట్ర కూట, రట్ట, రెడ్డిలనే విభిన్న రూపాల్లో కనిపిస్తోందని Rev. T. Foulkes'[1] అభిప్రాయం. రెడ్డి కులస్థులు ఆంధ్రప్రదేశంలో 'కాపు' కులస్థులుగా కూడా వ్యవహరింపబడుతున్నారు. వీరిలో అనేక శాఖలున్నాయి. పలనాటిరెడ్లు, పాకనాటి రెడ్లు, పంటకాపు, పెదకాపు, చినకాపు మొదలైన శాఖలున్నాయి.

చారిత్రాత్మకంగా పరిశీలిస్తే రెడ్డి కులానికి ఒక ప్రత్యేక స్థానమున్నట్లు కనబడుతోంది. వీరు చాతుర్వర్ణాల్లో నాల్గవ స్థానాన్ని పొంది శూద్రులుగా వ్యవహరింప బడుతున్నారు. వీరు చిరకాలంగా వ్యవసాయ ధారులుగా వున్నప్పటికీ అనేక యుద్ధాల్లో విజయాన్ని సాధించి రెడ్డి రాజులుగా కూడా ప్రసిద్ధికెక్కారు. వీరు ఆంధ్ర దేశం నుండి కొన్ని తరాల క్రిందటే మద్రాసుకు వలస వచ్చి స్థిర పడ్డారు. ఆర్థిక పరంగా సంఘంలో వీరికి ఉన్నత స్థానముంది. వీరు విద్యాధికులై అన్ని రంగాల్లోను వున్నత పదవుల్లో వున్నప్పటికి ఆర్థికంగా వున్నత స్థానంలో వున్నందువల్ల వ్యాపారస్థులుగా ఎక్కువ చలామణి అవుతున్నారు. ీరు మద్రాసులోని తమిళ ప్రజలతో కలిసిపోయి రెడ్డియార్లగా వ్యవహరింపబడుతూ ీరు కూడా తమిళులనే భావనను కలిగిస్తున్నారు.

వీరిలో శైవ మతస్థులు, వైష్ణవ మతస్థులు కూడా వున్నారు. అంకమ్మ, పోలేరమ్మ మొదలైన దేవతల్ని పూజించడం, జంతు బలులివ్వడం, వీరి ఆచారంగా కనబడుతోంది. సాధారణంగా రెడ్డి కులస్థుల్లో స్త్రీలకి ఎక్కువ ప్రాముఖ్యత వున్నట్లు కనబడుతోంది. విడాకులు తీసుకోవడం, విధవా వివాహం వీరిలో వుంది. ఒక వ్యక్తికి

1. T. Foulkes - Castes and Tribes of Southern India. Edgar Thurston. ed. K. Rangachari. ఈ విభాగంలో చెప్పబడ్డ విషయాలకు ఈ గ్రంథమే ఆధారం.

పురుష సంతానం లేకపోతే కూతురికి వివాహంచేసి అల్లుడిని ఇల్లరికం వుంచుకోవడం పరిపాటి. రెడ్డి కులస్థులు మొదటినుండి ఆర్థికంగా వున్నత స్థాయిలో వున్నందువల్ల ఆస్తి నష్టపోకుండ వివాహాలు చాలా వరకు బంధువుల్లోను, ముఖ్యంగా మేనరికాలే చేసుకుంటారు. చనిపోయిన వారిని కాల్చే ఆచారం వీరిలో వుంది. మైల పాటించడం లాంటి ఆచారాలు కనబడుతున్నాయి. మిగిలిన ఆచార వ్యవహారాల్లో ఆంధ్రదేశంలోని ఇతర కులాల వారినే పాటిస్తున్నట్లు కనబడుతోంది. వీరి వివాహాచారాలు చాలావరకు తమిళ సంస్కృతీ ప్రభావితమై వున్నాయి.

### 3.6.2 నాయుడు

నాయుడు కులంలో అనేక తెగలు, శాఖలు వున్నాయి. వాటిలో పేర్కొనదగ్గ తెగలు నాలుగు. అవి బలిజ నాయుడు, కమ్మనాయుడు, వెలమ నాయుడు, తెలగ నాయుడు. ఇంకా చెట్టి బలిజ, గాజుల బలిజ, భోగంనాయుడు, కాపులు అనే ఉప జాతులు కూడా వున్నాయి. ఈ ఉపజాతులన్నీ చాలా వరకు వెనుకబడిన తెగల క్రింద జమకట్టబడుతున్నాయి.

నాయుడు కుల నామానికి సంబంధించి భిన్న కథలు పురాణాల్లో ఉన్నాయి.

హోమం జరిగేటప్పుడు చేసే బలినుండి పుట్టిన వారు కాబట్టి వారికి బలిజ (బలి+జ) అనే పేరు వచ్చిందని, ఒకానొక చోళరాజు భార్య చెవికమ్మ పోయిన సందర్భంలో దానిని వెదికి తీసుకొని రమ్మని ఆజ్ఞాపించగా రాజు సైన్యంలో ఒకనికి ఆ కమ్మ దొరికిందని ఆనాటి నుండి అతని వంశపు వారికి కమ్మవారు అనే పేరు కలిగిందని ఆకమ్మ వెదకలేక రాజు భయంతో రాజ్యానికి వెలుపల కొందరు నిలిచి పోయారని అలా నిలిచిపోయిన వారికి వెలమ (వెలి+మ) అనే పేరు వచ్చిందని, తెలుగు భాష మాట్లాడే వారిలో ఒక తెగ వారు కాబట్టి తెలగలనే పేరు కలిగిందనే కథలున్నాయి.

మద్రాసు లోని తెలుగు వారిలో అధిక సంఖ్యాకులు నాయుడు కులానికి చెందినవారే. వీరు తర తరాలుగా దక్షిణ దేశంలో స్థిరపడి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనినట్లు చారిత్రకాధారాలు కనబడుతున్నాయి. నాయక రాజులు దక్షిణ దేశాన్ని పరిపాలించిన కాలంలో నాయుడు కులస్థులు అధిక సంఖ్యలో ఆంధ్ర దేశంనుండి వలస పోయి దక్షిణ ప్రాంతంలో ముఖ్యంగా మద్రాసులో స్థిరపడ్డారు.

ప్రస్తుతం నాయుడు కులానికి చెందిన వారు మద్రాసులో రాజకీయంగా, ఆర్థికంగా, వ్యాపార రంగాల్లో ప్రసిద్ధి పొంది వున్నారు. వీరిలో చదువుకున్న వారి సంఖ్య తక్కువ. వీరి దృష్టి ఎక్కువ వ్యాపారం మీద కేంద్రీకరింపబడి వుంది. ముఖ్యంగా మద్రాసు లోని అమింజకరై ప్రాంతంలో నాయుడు కులస్థులు ఎక్కువగా వున్నట్లు కనబడుతోంది. వీరిలో స్త్రీలు చాలా వరకు గృహిణులుగానే కనబడుతున్నారు. వీరు దూరపు సంబంధాలకు పోక మేనరికాలకే ఎక్కువ ప్రాముఖ్యత నిస్తున్నట్లు కనబడుతోంది. వీరి బాషా సంస్కృతులు చాలా వరకు తమిళ బాషా ప్రభావిత మయ్యాయి.

వీరి వివాహాచారాలకు, రెడ్డి కులస్థుల ఆచారాలకు తేడా కన్పించడం లేదు. వీరు కూడా ఆర్థికంగా వున్నత స్థితిలో వున్నవారు కాబట్టి వివాహ సంబంధాలకు బయటకు పోక చాలా వరకు మేనరికాలే చేసుకుంటున్నారు. మద్రాసులో వున్న తెలుగు వారిలో అధిక శాతం తమిళ భాషా సంస్కృతులకు లోనైన వారు నాయుడు కులస్థులే.

### 3.6.3 దేవాంగ

దేవాంగులు వస్త్రాల నేత కుల వృత్తిగా కలిగిన వారు. వీరి కులానికి సంబంధించి పురాణాల్లో ఒక కథ వుంది. బ్రహ్మ మనువుని సృష్టించి దేవతలకు, మానవులకు వస్త్రాల్ని నేయమని ఆజ్ఞాపించాడని, అతని ఆజ్ఞానుసారం చాలా సంవత్సరాలు మనువు వస్త్రాల్ని నేసి కొంతకాలానికి తన పవిత్రతతో స్వర్గాన్ని చేరాడని ఆ తరువాత లోకంలో ప్రజలకు వస్త్రాలు నేసేవారు లేకపోవడం వల్ల వారు ఆకుల్ని కట్టుకోవలసి వచ్చిందని, ఈ విధంగా కట్టుకోవడానికి విసిగి వారు బ్రహ్మను ప్రార్థించగా బ్రహ్మ వారిని శివుని దగ్గరకు తీసుకొని పోయాడని శివుడు తన శక్తిచే ఒక దివ్య పురుషుణ్ణి సృష్టించి అతనిని దేవతలకు, మానవులకు వస్త్రాలను నేయమని చెప్పాడని ఆ దివ్యపురుషుడు దేవాలన్ అని పిలువ బడ్డాడని అతని సంతతి వారు దేవాంగు లయ్యారని చెప్పబడుతోంది. దేవ అంగాలకు వస్త్రాలను నేసేవాడు (దేవ+అంగ) కాబట్టి దేవాంగ జాతి వాడని పేరు వచ్చింది. దేవాలుడుని శివుడు పాల సముద్రంలో వున్న తామర తూడుల నుంచి దారాన్ని తీసి వస్త్రాన్ని నేయమని ఆజ్ఞాపించగా దేవాలుడు ఆ దారాన్ని తీసికొని తిరిగి వస్తుండగా మధ్యలో సన్యాసి వేషంలో వున్న వజ్రదంతుడనే రాక్షసుణ్ణి కలుసుకొన్నాడని తరువాత అతడు సన్యాసి వేషంలో వున్న రాక్షసుడని గ్రహించి తనను రక్షించమని విష్ణుమూర్తిని వేడుకొని విష్ణువు దగ్గర నుండి ఒక చక్రాన్ని పొంది అంతకంతకు పెరుగుతున్న రాక్షసుల్ని చంపడానికి ప్రయత్నం చేశాడని అంతలో చేడేశ్వరి అనే దేవత సింహంపై ఎక్కి వచ్చి రాక్షసులందర్ని సంహరించిందని అందులో ముఖ్యంగా అయిదు మంది ప్రధానమైన రాక్షసులున్నారని వారి రక్తం పసుపు, ఎరుపు, తెలుపు, పచ్చ, నలుపు రంగుల్లో వుందని దేవాలుని చేతిలో వున్న దారాల్ని ఆరంగు రక్తంలో ముంచి వివిధ రంగుల్లో వస్త్రాల్ని నేశాడని కథలో చెప్పబడింది. ఈ దేవాలుని వంశం వారు తాము దేవాంగ బ్రాహ్మణులమని చెప్పకోవడం కూడా వుంది. వీరిలో శాకాహారులు, మాంసాహారులు వున్నారు.

ఈ దేవాంగుల్ని గూర్చి పురాణాల్లో మరొక కథ కూడా ప్రసిద్ధి చెంది వుంది. బ్రహ్మ సృష్టి ప్రారంభించిన తరువాత దేవతలు, రాక్షసులు, మానవులు శరీరాన్ని కప్పకోవడానికి వస్త్రాలు లేకుండా దిగంబరులుగా వుండే వారని, నారదుడు కైలాస పర్వతానికి వెళ్ళి శివుణ్ణి ప్రార్థించాడని, శివుడు అతడి ప్రార్థన విని వెంటనే అతడి కోరికను తీర్చాలని తలంచాడని అలా తలంచగానే అతని శరీరం నుండి ఒక పురుషుడు పుట్టేడని అతడికి 'దేవఅంగం' అని పేరు పెట్టాడని, అతడు వెంటనే శివుణ్ణి తనను సృష్టించడానికి కారణం ఏమిటని అడగ్గా శివుడు పాల సముద్రంలో వున్న శ్రీ మహా విష్ణువు దగ్గరికి వెళితే అతడు ఏం చేయాలన్నది చెపుతాడని చెప్పగా దేవాంగం విష్ణువు దగ్గరకు వెళ్ళి

తాను చేయాల్సిన పనిని గూర్చి అడగ్గా విష్ణువు దేవతలకు, మానవులకు వస్త్రాల్ని నేయమని దానికి కావలసిన దారాన్ని పాల సముద్రంలోని తామర తూడుల నుండి, అడవిలోని చెట్ల నారను తీసుకొనమని చెప్పాడు. దేవాంగుడు పదివేల మంది నేతగాళ్లను సృష్టించి వారిని చెట్ల నుండి నారను తీసుకొని రమ్మని ఆజ్ఞాపించాడు. ఒకరోజు దేవాంగుడు అతని భార్యకూడా నార తీసుకొని రావడానికి భూలోకంలో వున్న ఒక అరణ్యానికి పోగా మార్గ మధ్యంలో రాక్షస గుంపు వారిని అడ్డగించి అతని భార్యని ఎత్తుకొని పోవడానికి ప్రయత్నించగా దేవాంగుడు వారితో యుద్ధం చేస్తున్న సమయంలో ఎనిమిది చేతులు కలిగిన ఒక దేవత శూలాన్ని ధరించి ప్రత్యక్షమై ఆ రాక్షసుల నందర్ని చంపి అతని భార్యని విడిపించిందని, దేవాంగుడు ఆ దేవతకు చేడేశ్వరి అని నామకరణం చేశాడనే కథ ప్రచారంలో వుంది.

అందువల్ల దేవాంగుల కులానికి కాళిక లేక దుర్గా దేవి స్వరూపంలో వున్న చేడేశ్వరీదేవి కుల దైవంగా వుంది. ఈ దేవతను సంవత్సరానికి ఒక సారి ఈ కులం వారంతరు ఒక గుడిలో కలుసుకొని పూజిస్తారు. ఈ పండుగ సందర్భంలో నేత పనిని ఆపేస్తారు. ఈ దేవతా ఉత్సవాన్ని కొన్ని ప్రాంతాల్లో మూడురోజులు, మరికొన్ని ప్రాంతాల్లో పదిరోజులు కూడా చేస్తున్నారు. పొట్టేల్ని బలి ఇవ్వడం జరుగుతుంది. గోమూత్రం, పసుపునీళ్ళు కలిపి పవిత్రత కోసం చల్లుతారు. స్త్రీని మాత్రం దగ్గరకు రానీయక ఈ గుడికి దూరంగా వుంచుతారు. స్త్రీలు వస్తే మైల చుట్టుకొంటుందని వీరి భావన.

వీరిలో అధిక సంఖ్యాకులు శైవ మతస్థులుగా వున్నారు. లింగాన్ని ధరించడం వీరి ఆచారంగా వుండేది. కాని నేటి కాలంలో వీరు లింగాన్ని ధరించడం లేదు. దీనికి ఒక కారణం చెప్పబడివుంది. ఈ లింగాన్ని ధరిస్తే పవిత్రంగా వుండాలి. ఎవర్నంటే వారిని తాకరాదు. అసత్యం చెప్పరాదు. అందువల్ల ముఖ్యంగా వ్యాపారం చేసేటప్పుడు వ్యాపారస్థులు దీన్ని ధరించకూడదని నియమం. ఎందుకంటే వ్యాపారంలో అసత్యాలు చెప్పాల్సిన అవసరం వస్తుంది కనుక ఈ లింగాన్ని ధరించకూడదని అంటారు.

వీరిలో పద్మశాలీలనే మరొక తెగవారున్నారు. వీరు దేవాంగులతో సమానమైన స్థాయినికాక, వారికన్నా తక్కువ స్థాయిని పొంది వున్నారు. దేవాంగులలో కొందరు తాము దేవతాంశంలో పుట్టిన వాళ్ళు కాబట్టి చాతుర్వర్ణాల్లో ప్రథమ స్థానం తమదే అని బ్రాహ్మణుల కన్న తమకు ఆధిక్యం వుందని చెపుతున్నారు.

వీరి వివాహాల్లో కాని, ఇతర కర్మకాండల్లో కాని బ్రాహ్మణుల పాత్ర వుండదు. వీరిలో వంశ పారంపర్యంగా 'శేసరాజు' లేక ఉమ్మడిచెట్టి అనుపేరు గల వ్యక్తి వీరి కుటుంబాలకు పౌరోహిత్యాన్ని నిర్వహించి అన్ని కుటుంబాల్నించి కొంత ధన సహాయాన్ని పొందుతాడు.

కొన్ని ప్రాంతాల్లో ఈ కులస్థుల్లో వితంతు వివాహాలు జరుగుతున్నాయి. వీరిలో శాకాహార, మాంసాహారుల మధ్య వివాహ సంబంధాలున్నాయి. రజస్వలైన స్త్రీకి, చనిపోయిన వారికి మైలను పాటించే ఆచారముంది. వివాహాల్లో చాలా వరకు తెలుగు

సంప్రదాయాల్నే అనుసరిస్తున్నారు. ఉపనయనం, పాదపూజ, కాశీయాత్ర, కన్యాదానం, మాంగల్యధారణం, నాగవల్లి మొదలైన ప్రాచీనాచారాలన్నిటిని పాటిస్తున్నారు. చనిపోయిన వారిని కాల్చే ఆచారం వీరిలో వుంది.

వీరిలో కొంతమందిని బేరిచెట్లు అనే పేరుతో కూడ వ్యవహరిస్తున్నారు. దేవాంగులు సాంఘికంగా, ఆర్థికంగా చాలా వెనుక బడినవారు. ఆంగ్లేయుల కాలంలో మద్రాసులోని చింతాద్రి పేటకు అనేక మంది వలసపోయి అక్కడ స్థిర నివాసమేర్పరచుకొని కుల వృత్తిని సాగిస్తున్నారు. ఇప్పటికే వీరిలో చాలామంది కులవృత్తి మీదనే ఆధారపడి వున్నారు. మద్రాసులోని పురస వాకంలో బంకింగ్‌హామ్ అండ్ కర్నాటిక్ మిల్లు ప్రారంభింపబడినపుడు ఆంధ్ర దేశానికి చెందిన నేతగాండ్లు చాలా మంది ఈ మిల్లులో కూలీలుగా చేరి మద్రాసులో నివాసమేర్పరచుకొన్నారు. వీరిలో చదువుకొన్నవారి సంఖ్య చాలా తక్కువ.

మద్రాసు లోని చాకలి పేటలో దేవాంగ కులానికి చెందిన వారు ఎక్కువ మంది వున్నారు. ఈ ప్రాంతంలో ఒకటి రెండు వీధుల్ని వీరే ఆక్రమించి కుల వృత్తిని సాగిస్తున్నారు.

### 3.6.4 బ్రాహ్మణ

ధర్మశాస్త్ర, పురాణ, ఇతిహాసాదుల్ని బట్టి చాతుర్వర్ణాల్లో ప్రధమ వర్ణంగా బ్రాహ్మణ వర్ణం నిర్ణయింపబడింది. వీరు తాము బ్రహ్మ కులానికి చెందిన వారమని చెప్పకుంటూరు. అందువల్ల సంఘంలోని జాతులన్నింటిలోను తమదే అగ్రస్థానమని వీరు భావిస్తున్నారు. వీరు నియోగులు, వైదీకులు అని ప్రధానంగా రెండు శాఖల వారున్నారు. గోత్రాల ననుసరించి కూడ వీరిలో భిన్న శాఖలు ఏర్పడ్డాయి. ఇంతేకాక వీరిలో పుదూరు ద్రావిడులు అనే తెగవారు కూడ మద్రాసులో కనబడుతున్నారు. ఈ పుదూరు ద్రావిడుల ఆచారాలు చాలా వరకు తమిళ సంప్రదాయానికి సంబంధించినవిగా వున్నాయి.

వీరిలో సుమారు 230 గోత్రాల వారున్నట్లు అంచనా. వీరు అత్రి, భృగు, కుత్స, వసిష్ఠ, గౌతమ, కశ్యప, అగస్త్యులనెడి సప్త ఋషుల వారసుల మని చెప్పకుంటూరు. వీరిలో శివ భక్తులు, వైష్ణవ భక్తులు కూడా వున్నారు. కఠినమైన ఆచారాల్ని పాటించడంలోను, సంధ్యావందనం చేయడం, గాయత్రి జపం చేయడం వంటి ఆచారాలను ఇప్పటికీ పాటిస్తున్నారు.

జాతక కర్మ, నామ కరణం, అన్న ప్రాశనం, ఉపనయనం లాంటి సాంఘిక ఆచారాలను కూడా పాటిస్తున్నారు. వివాహాల్లో పెండ్లి కొడుకు, ఊరేగించడం, కాశీయాత్రకు, పాదపూజ, కన్యాదానం, అరుంధతీ దర్శనం, నాగవల్లి లాంటి ప్రాచీన ఆచారాలు, సీమంతం, పుంసవనం లాంటి స్త్రీ సంబంధిత ఆచారాలు పాటిస్తున్నారు.

చనిపోయిన వారిని దహనం చేసే ఆచారం వీరిలో వుంది. వీరిలో విధవా వివాహాలు లేవు. సాధారణంగా కన్య రజస్వల కాక పూర్వమే వివాహం చేయడం వీరి ఆచారం. తులసి చెట్టును పూజించడం వీరిలో ఎక్కువగా కనబడుతోంది.

వీరిలో సాధారణంగా శాఖాంతర వివాహాలు వుండవు. చాలా వరకు వివాహం ధర్మశాస్త్రాను సారంగానే జరుగుతాయి.

వీరిలో కొంతమంది ఇప్పటికీ కులవృత్తియైన పౌరోహిత్యాన్ని చేస్తున్నారు. ముఖ్యంగా మద్రాసులోని ట్రిప్లికేను ప్రాంతంలో వున్న బ్రాహ్మణులు ఇంకా ప్రాచీనాచారాల్ని పాటిస్తూ పౌరోహిత్యాన్ని చేస్తున్నారు. కాని చాలా వరకు ఉన్నత విద్యను అభ్యసించి వున్నత పదవుల్లో వున్నారు. వీరిలో చాలా మంది ఉద్యోగరీత్యా ఆంధ్రదేశం నుండి మద్రాసుకు వలసపోయి స్థిర పడ్డట్టు ఆధారాలు కనిపిస్తున్నాయి. వీరు చాలా వరకు పూర్వాచారపరులు కావడం వల్ల చాలా కాలం వరకు వీరిలో స్త్రీలు గృహిణులుగానే వుండేవారు. కాలక్రమేణ నగర జీవన విధానంలో మార్పు రావడం వల్ల, ఆర్థిక పరమైన అవసరాల వల్ల ఈ కులానికి చెందదిన స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్నారు.

వీరిలో మేనరికాలు, కుండ మార్పిడీలు లాంటి వివాహ సంబంధాలు కనిపిస్తున్నాయి. మద్రాసులో బ్రాహ్మణులు అన్ని ప్రాంతాల్లో వున్నా ప్రధానంగా త్యాగరాయ నగరు, ట్రిపిల్‌కేను, మైలాపూరులో ఎక్కువ సంఖ్యలో వున్నారు.

మద్రాసులోని తిరువత్తియూరులో వీరు బ్రాహ్మణ సంఘాన్ని ఏర్పరచుకొని సనాతన ఆచారాల్ని కాపాడుతూ తమ ప్రత్యేకతని నిలుపుకుంటున్నారు.

### 3.6.5 ఆర్య వైశ్య

చతుర్విధ వర్ణాల్లో వైశ్యులు మూడవ స్థానాన్ని పొంది వున్నారు. వీరినే కోమటి, చెట్టి, శెట్టి అనికూడా వ్యవహరిస్తున్నారు. వీరు కన్యకా పరమేశ్వరి భక్తులు. శాకాహారులు. బాల్య వివాహాలు వీరిలో ఎక్కువగా కనిపిస్తున్నాయి. మొదటి భార్యకు బిడ్డలు లేకపోతే పురుషుడు మరొక వివాహం చేసుకోవచ్చు. రెండవ వివాహం వల్ల రెండవ భార్య పాద మహిమ చేత మొదటి భార్యకు బిడ్డలు కలుగుతారని వీరి నమ్మకం. వీరిలో విధవా వివాహాలు నిషేధం.

మద్రాసు సంయుక్త రాష్ట్రంగా వున్నప్పుడు వీరు వ్యాపార రీత్యా వలస వచ్చి ఇక్కడ స్థిరపడి కుల వృత్తియైన వ్యాపారాల్లో ప్రసిద్ధి పొందారు. ఇతర కులాల వారు ఉన్నత విద్యను అభ్యసించి, ఉన్నత పదవుల్లో వుండగా, వైశ్యులు మాత్రం కుల వృత్తిని విడిచి పెట్టక, ఉన్నత విద్యల్ని అభ్యసించినా కుల వృత్తిలోనే జీవనాన్ని గడుపుతున్నారు. భారత దేశంలో మద్రాసు ప్రముఖ వాణిజ్య కేంద్రమైనందువల్ల ఇక్కడ వైశ్యులు అనేకులు స్థిరపడి వ్యాపారాన్ని కొనసాగిస్తున్నారు.

మద్రాసు లోని తెలుగు వారిలో అధిక సంఖ్యలో వీరు వున్నారు. ప్రత్యేకించి మద్రాసు లోని జార్జి టవునులో వీరి కుటుంబాలు ఎక్కువగా వున్నాయి. నేడు మద్రాసు లోని ప్రముఖ వాణిజ్య సంస్థలు, బంగారు అంగళ్ళు, వెండి అంగళ్ళు, బట్టల అంగళ్ళు చాలా వరకు వైశ్యులవనే చెప్పాలి. ఆచార వ్యవహారాల్లో వీరు ఆంధ్రదేశంలోని తెలుగు వారినే అనుసరిస్తున్నారు. వివాహాచారాలు కూడా చాలా వరకు ఆంధ్రుల సంస్కృతిని

అనుసరించే వున్నాయి. కన్యకా పరమేశ్వరి పేరుతో విద్యాలయాలు స్థాపించి విద్యా వ్యాప్తిని కూడా వీరు మద్రాసులో చేస్తున్నారు. ఆర్యవైశ్య సంఘం అనే పేరుతో ఒక సంఘాన్ని ఏర్పరచుకొని సాంఘిక పరమైన భద్రతను సంఘంలో ఏర్పరచుకొన్నారు.

### 3.6.6 విశ్వ బ్రాహ్మణ

వీరు తాము తమ దేవ శిల్పియైన విశ్వకర్మ వంశపువారమని చెప్పకుంటారు. వీరు ఒకప్పడు విశాఖపట్నంలో ఒక తెగ వారుగా జీవించి వుండేవారని, కారణాంతరాల వల్ల తక్కిన ప్రాంతాలకు వలసపోయి స్థిరపడ్డట్టు ఆధారాలు కనబడుతున్నాయి.

ఒకానొక చోళరాజు కాలంలో వీరి పూర్వీకులు తమకు బ్రాహ్మణులతో సమానత్వం కావాలని కోరగా చోళరాజు కోపించి వీరందర్నీ నాశనం చేయమని ఆజ్ఞాపించాడని, అప్పడు వీరు ఉత్తర దిశకు పారిపోయి 'ఓజు' (Vozu) అనే జాతి వారి రక్షణలో చావు తప్పించుకున్నారని ఒక కథ వుంది. అందువల్ల వీరు తమను రక్షించిన వారి యెడల కృతజ్ఞతా సూచకంగా 'ఓజు' అనే పదాన్ని తమ ఇంటి పేర్లకు కలుపుకొన్నట్లు కనబడుతోంది. ఉదాహరణకు వీరిలో డాకోజు, లాకోజు, పాటోజు, కాటోజు ఇంటి పేర్లు వినిపిస్తున్నాయి.

వీరు విశ్వ బ్రాహ్మణ వంశానికి చెందిన వారని చెప్పకోవడం వల్లనే వీరికి విశ్వబ్రాహ్మణ, లేక విశ్వకర్మ అనే పేరు వచ్చిందని చెప్పవచ్చు. విశ్వకర్మకు ఐదుగురు కొడుకులుండే వారు. వారిలో మొదటి వాడు కమ్మరాచార్యుడు. ఈతడు వశిష్ఠుడి కూతురైన సురేల వతిని వివాహమాడాడు. రెండవ వాడు వడ్లాచార్యుడు, మూడవ వాడు కంచరాచార్యుడు. ఇతడు పౌలస్త్య బ్రహ్మకూతురైన జాలవతిని వివాహమాడాడు. నాల్గవ వాడైన కాసాచార్యుడు విశ్వవసుని కుమార్తె గుణవతిని వివాహమాడాడు. ఐదవవాడు అగసాలా చార్యుడు. ఇతడు భృగు మహర్షి కుమార్తెయైన సౌనవతిని వివాహమాడాడు. విశ్వకర్మకు ఐదుగురు కొడుకులే కాక ఐదుగురు కుమార్తెలు కూడా వుండేవారు. వీరిలో సరస్వతి బ్రహ్మను, శచీదేవి ఇంద్రుడ్ని, మండోదరి రావణాసురుణ్ణి, అహల్య గౌతముణ్ణి వివాహమాడారని వీరందరూ తమ పూర్వీకులని వీరు దేవతల్ని వివాహమాడ్డం వల్ల వీరితో పాటు తమకు కూడా ఆచార్య పదవి లభించిందని ఈ కులం వారు చెపుతారు. అందువల్లనే తమ పేర్లకు చివర ఆచారి అని చేర్చి చెప్పే పద్ధతి వీరిలో కనిపిస్తోంది. వీరు శాకాహారులు. బ్రాహ్మణుల ఆచారాలైన యజ్ఞోపవీత ధారణ మొదలైనవన్నీ వీరిలో కనిపిస్తున్నాయి. వివాహాచారాలన్నీ బ్రాహ్మణుల ఆచారాలననుసరించే వున్నాయి. మేనరికాలు వీరిలో ఎక్కువ. సాధారణంగా కన్య రజస్వల కాక పూర్వమే వివాహం చేయడం వీరి ఆచారం. విధవా వివాహాలు లేవు. విడాకులు తీసుకోవడానికి సమ్మతించరు. చనిపోయిన వారిని కూర్చొన పెట్టి కాల్చే పద్ధతి వీరిలో ప్రత్యేకంగా కనిపిస్తోంది. వీరు పోతులూరి వీర బ్రహ్మంగారి భక్తులు. శివరాత్రి పర్వదినం నాడు ఈ కులస్థులందరూ బ్రహ్మంగారి మఠానికి పోవడం ఆచారంగా కనిపిస్తోంది.

మద్రాసులో వీరు అన్ని ప్రాంతాల్లో వున్నప్పటికీ ఉత్తర మద్రాసులో వాణిజ్య కేంద్రమైన పార్క్ టవును లోను, పారీస్ ప్రాంతం లోను ఎక్కువగా నివసిస్తున్నారు.

### 3.6.7 చాకలి

చాకల - సాకల అనే పేరు చాకు (ఉతుకు) పదం నుండి వచ్చిందని అంటారు. వీరి కులవృత్తి బట్టలు ఉతకడం, పెండ్లిండ్ల సమయంలో దివిటీలు పట్టుకెళ్ళడం. పల్లకీలు మోయడం కూడా చేస్తుంటారు. వీరిలో 'తెల్లకుల' అనే తెగ వారి వృత్తి బట్టలు ఉతకడమే, కానీ ప్రభుత్వ కార్యాలయాల్లో బంట్రోతు పనుల్లో చేరిన తరువాత చాకలి కులాల్లో వీరు ఉన్నతులుగా భావింపబడుతున్నారు. చాకలి వారిలో గూన చాకలి, బాన చాకలి అనే రెండు తెగలున్నాయి. గూన అంటే బట్టలకు ఆవిరి పెట్టి ఉడకబెట్టడానికి ఉపయోగించేది. బాన అంటే బట్టలను ఊరబెట్టడానికి ఉపయోగించే పాత్ర (మట్టిపాత్ర). గూన చాకలి వారిని గూని చాకలి వారని కూడ అంటారు. వీపుపై బట్టల మూటలు మోసుకొని ఒంగి నడవడం వల్ల వీరిని అలా పిలుస్తారు.

వీరి కులదైవం మైలార దేవుడు. హిందువుల పెండ్లిండ్లలో కావడి మోయడం నేటికి కూడా ఆచారంగా వుంది. సాధారణంగా తెలుగు వారి పెండ్లిండ్లు చాకలి లేకుండా జరగవు. వీరు గ్రామాల్లో కొన్ని కుటుంబాలకు ఒకరుగా వంతులు వేసుకొని కులవృత్తి చేస్తారు. సం॥రానికి ఒకసారి వీరికి మేర ఇస్తారు. వీరి వివాహాచారాలన్నీ బలిజ కులం వారి ఆచారాల్ని పోలి వుంటాయి.

ఈనాడు చాకలి వారు వృత్తి రీత్యా దేశం లోని అన్ని ప్రాంతాలకు పోతున్నారు. మద్రాసులో కూడా చాకలి వారు అనేకులు వున్నారు. వీరు కొన్ని తరాల క్రిందట మద్రాసుకు వచ్చి స్థిరపడ్డారు. వీరు మద్రాసులో అన్ని ప్రాంతాల్లో వున్నప్పటికీ చాకలిపేట, దోబికాన, సైదాపేట ప్రాంతాల్లో అధిక సంఖ్యలో వున్నారు. వీరు సంఘంలో వెనుకబడిన జాతుల వారుగా పరిగణింపబడుతున్నారు. మద్రాసులో వీరికి సంఘాలున్నాయి. వీరు మద్రాసులోని తమిళులతో కలిసి తమిళ భాషా సంప్రదాయాలకు ప్రభావితమైనట్లు కనబడుతున్నారు.

### 3.6.8 మాల

మాల అనే పదం ద్రావిడ పదమైన 'మాల్' నుండి వచ్చిందని కొందరి అభిప్రాయం. ద్రావిడ భాషలో మాల్ అంటే పర్వతం అని అర్థం. సి. పి. బ్రౌన్ గారి తెలుగు నిఘంటువులో మాల శబ్దం 'మైల' దేవత నుండి వచ్చిందని చెప్పబడింది. వీరు మైల దేవతా భక్తులు కాబట్టి మాల శబ్దం 'మైల' నుండి వచ్చిందని చెప్పడం సమంజసమే. సుంకాలమ్మ అనే బ్రాహ్మణ స్త్రీకి, అనామకుడైన ఒక శూద్రునికి పుట్టిన వారు మాలలని ఒక కథ వుంది. సుంకాలమ్మ తండ్రి గొప్ప విద్యావంతుడైన బ్రాహ్మణుడు. అతని వద్ద విద్య నేర్చుకోవాలనే కోరికతో ఒక శూద్రుడు బ్రాహ్మణ వేషం వేసుకొని బ్రాహ్మణుడిగా నటించి తన ప్రవర్తనవల్ల గురువుగారి అనుగ్రహాన్ని పొంది, సకల విద్యల్ని పొందడమేకాక తన మంచి తనంతో ఆతనిని మెప్పించి ఆమెను వివాహమాడాడు. వీరికి సంతానం కలిగిన

తరువాత భార్యను తీసుకొని తన ప్రాంతానికి ప్రయాణమై పోతూ ఆమెకు తాను శూద్రుడన్న విషయాన్ని చెప్పగా ఆమె చింతించి తండ్రి వద్దకు వెళ్ళి విషయం చెప్పగా ఆమె కుల భ్రష్టురాలైందని తండ్రి తీర్మానించాడు. ఆమె తన్ను మోసగించిన శూద్రునిపై మిక్కిలి ఆగ్రహించి అతని సంతానాన్ని పంచములుగా, అంటరాని వారిగా, మాలలుగా వుండమని శపించి ఆత్మహత్య చేసుకొన్నదనే కథ పురాణాల్లో కనిపిస్తోంది. సుంకాలమ్మ పేరుతో మాలలు నేటికీ జాతర్లు జరుపు కుంటారు. వీరు పశువుల కాపర్లుగా, పాలేర్లుగా తక్కిన కులాల వారి దగ్గర పనులు చేస్తున్నారు.

వీరు ఎన్ని సార్లైనా వివాహంచేసుకోవచ్చు. విధవలుగా వుండడం వీరిలో తప్పు. భార్య చనిపోతే మరొక స్త్రీని వివాహం చేసుకొంటే ఆ రెండో భార్య మొదటి భార్య మాంగల్యాన్ని, తన మాంగల్యాన్ని రెంటినీ ధరించాలి.

మాలలు గోమాంసాన్ని తినడం, కల్లు తాగడం లాంటి అలవాట్లు కలిగి వుండడం చేత ఇతర కులస్థుల చేత వెలివేయబడ్డారు. వీరు దేవాలయ ప్రవేశాల నుండి ఇతర కులస్థులు ఉపయోగించే బావుల్ని వాడడం నుండి నిషేధింపబడ్డారు. వీరికి మంగలి వారు కాని, చాకలి వారు కాని పని చేయరు. వీరి కులం లోంచే మంగలి పని చేసే వారిని ఏర్పాటు చేసుకోవాలి. మాల వాళ్ళు మాదిగ వాళ్ల కన్న అధికులమని చెప్పకుంటారు. మాదిగవారు ఉపయోగించే బావుల్ని మాల వాళ్ళు ఉపయోగించరు. వివాహ సమయంలో పౌరోహిత్యం కూడా వీరికి వీరి కులం లోని వారే చేస్తారు. మాదిగ వాళ్ళు వండిన పదార్థాల్ని మాలవారు భుజించరు.

వీరు బ్రిటీషు వారి కాలంలో మద్రాసు నగర పురపాలక సంస్థ ఏర్పడినప్పుడు పురపాలక సంఘంలో పారిశుద్ధ్యపు పని చేయడం కోసం ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాలనుండి వలసపోయి మద్రాసులో స్థిరనివాసమేర్పరచుకున్నారు. వీరు సంఘంలో ఆర్థికంగా వెనుకబడి వున్నందు వల్ల జీవనోపాధికోసం మద్రాసునగరాన్ని ఆశ్రయించారు. ఇప్పటికీ వీరిలో చాలా మంది నగర పారిశుద్ధ్యపు పనే చేస్తున్నారు. మద్రాసులో వీరు కృష్ణాంపేట, రామ్ నగర్, మీర్ సాహెబ్‌పేట ప్రాంతాల్లో ఎక్కువగా వున్నారు.

### 3.6.9 మాదిగ

సంఘంలో వీరు కడజాతి వారుగా భావింపబడుతున్నారు. వీరికి అరుంధతీయులని, జాంబవులని, పంచములని నామాంతరాలున్నాయి. మతంగ మహర్షి వంశపు వారు కాబట్టి మాతంగులనే పేరు వచ్చిందని, భృగుమహర్షి భార్యయైన రేణుకాదేవి శిరస్సు ప్రభువుల ఆజ్ఞచే ఖండింపబడి ఒక మాదిగవాని ఇంటిలో పడడం చేత ఆమె మాదిగ స్త్రీగా మారిందని, ఆమెను మాతంగి అని పిలిచి కులదైవంగా పూజలు చేస్తారని అందువల్ల ఆమెననుసరించి వీరికి మాతంగులనే పేరు వచ్చిందని కథలు వినిపిస్తున్నాయి. అరుంధతి వీరి వంశస్థురాలు కాబట్టి అరుంధతీయులు, అరుంధతేయులు, ఆరంజోతీయులు అని చెప్పకుంటారు. వీరి పూర్వీకులు ఆది జాంబవుని వంశపు వారు కాబట్టి

జాంబవులని చెప్పుకుంటారు. సంఘంలోని చాతుర్వర్ణాల వారికి చెందనందున వీరిని పంచములని వ్యవహరిస్తున్నారు.

జాంబవంతుడికి శివుడు కామధేనువును ఇచ్చాడని, ఒకనాడు జాంబవంతుడు లేని సమయంలో అతడి కుటీరానికి శాయనుడు వచ్చి సాంబవుడి కుమారుడైన ముగయునితో కలిసి కామధేనువును చంపి దాని మాంసాన్ని అరగిస్తుండగా జాంబవుడు తిరిగివచ్చి ఆ ఘోరాన్ని చూచి వారిద్దరిని శివుని వద్దకు తీసుకొని వెళ్ళగా వారు భయపడి ద్వారం వద్దనే నిలబడి పోయారని శివుడు వారిని తక్కిన కులాల వారికంటె అధములుగా నిర్ణయించి వెలివేశాడని, అప్పటి నుండి వారు సంఘంలో వెలివేయబడి పంచములుగా వ్యవహరింప బడుతున్నారని పురాణాల్ని బట్టి తెలుస్తోంది. అందువల్ల వీరు అప్పటినుండి పశువుల చర్మంతో చెప్పలు కుట్టి తమ పాపాన్ని పోగొట్టుకుంటున్నారని పురాణగాథ.

వీరిలో రజస్వలానంతర వివాహాలే ఎక్కువ. పెండ్లి కొడుకు, పెండ్లి కూతురు కంటె వయసులో చిన్నవాడై వుండవచ్చు. విధవా వివాహాలున్నాయి. కొంత డబ్బు చెల్లిస్తే విడాకులు పొందవచ్చు. వీరిలో ఎక్కువ మంది శైవ మతస్థులైనప్పటికి క్షుద్ర దేవతల్ని పూజించడం వీరిలో ఎక్కువ. మత్తు పానీయాలు తీసుకోవడం, మాంసాహార భక్షణ వీరిలో ఎక్కువ.

వీరు సాంఘికంగా, ఆర్థికంగా వెనుకబడిన వారు. నేటి కృష్ణా, గుంటూరు, ప్రకాశం, చిత్తూరు, నెల్లూరు జిల్లాల నుండి కొన్ని వందల సంవత్సరాలకు పూర్వం మద్రాసుకు వలసపోయి స్థిరపడ్డారు. మద్రాసులో వీరు ఆది ఆంధ్రులుగా వ్యవహరింపబడుతున్నారు. ఆంధ్రదేశంలోని పట్టణాల్లో కంటే మద్రాసులో వీరు అధిక సంఖ్యలో వున్నారు. మద్రాసులోని పురపాలక సంఘంలో పారిశుద్ధ్యపు పని చేస్తున్నారు. మద్రాసు లోని కృష్ణాంపేట, వేపేరి, రామ్ నగర్ మొదలైన చోట్ల వీరు అధిక సంఖ్యలో వున్నారు. ప్రభుత్వ పరంగా వీరికి ప్రత్యేక కేటాయింపులు వుండడం వల్ల ప్రస్తుతం వీరు వున్నత చదువులకు, వున్నత వుద్యోగాలకు ప్రయత్నం చేస్తూ సమాజంలో వున్నత స్థానాన్ని పొందడానికి ప్రయత్నం చేస్తున్నారు.

## 3.7 సాంఘిక, సామాజిక, ఆర్థిక భాషాపరంగా మద్రాసు నగరంలో తెలుగువారి స్థానం

20 శ॥ ప్రారంభ దశలో మద్రాసు నగరంలో పరిపాలనా విభాగాలు అనేకం వుండేవి. అప్పటి మద్రాసు నగరంలో సాహిత్యం, సంప్రదాయం కలిగిన బహుళాభివృద్ధి గల భాషలు కొన్ని వ్యవహరింపబడేవి. నాడు మద్రాసు నగరం విశ్వ మానవ సమానత్వాన్ని కలిగి బహు సంస్కృతులకు నిలయమైంది. 20 శ॥ ఉత్తరార్థంలో 1935 లో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడి ఒరిస్సా రాష్ట్రం విడిపోయింది. 1956 లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. మైసూరు, కేరళ రాష్ట్రాలు వుమ్మడి రాష్ట్రం నుండి విడివడ్డాయి. ఉమ్మడి రాజధానిగా వుండిన మద్రాసు నగరం భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడ్డం వల్ల తమిళనాడు రాష్ట్రానికి

రాజధాని అయింది. అప్పటి నుండి మద్రాసు నగరంలో తమిళ భాషా ప్రాధాన్యత హెచ్చింది. మద్రాసు నగరం భిన్న భాషా సంస్కృతులకు నిలయం. రాష్ట్ర విభజనకు పూర్వం మద్రాసులో స్థిరపడ్డ వివిధ భాషా ప్రజలు రాష్ట్ర విభజన జరిగిన తరువాత కూడా అక్కడే స్థిరపడిపోవడం వల్ల మద్రాసు నగరానికి భాషా భిన్నత్వం ఏర్పడింది. ప్రస్తుతం పరిపాలకుల భాష తమిళమైనందు వల్ల తమిళ భాషకు ప్రాధాన్యత హెచ్చింది. నగరంలో తమిళ భాషాధిక్యత ఏర్పడినప్పటికి సమాజంలో తెలుగు వారికి వున్నత స్థానముంది. భాషా వ్యవహర్తల సంఖ్యా దృష్టిలో తెలుగు వారిది మద్రాసులో రెండవ స్థానం. ఆర్థికంగా మద్రాసులో తెలుగువారిది ప్రథమ స్థానం.

నాయక రాజుల కాలంలోనే వలసపోయి అక్కడ స్థిరపడ్డ తెలుగు ప్రజలు వున్నత విద్యల్ని అభ్యసించి నేడు అనేక రంగాల్లో వున్నత పదవుల్ని అధిష్టించి వున్నారు. ముఖ్యంగా న్యాయవాద వృత్తి, వైద్య వృత్తి సాంకేతిక విజ్ఞానాల్లో అత్యుత్తమ స్థానాన్ని పొందిన తెలుగు వారు అనేకులున్నారు. బ్రిటీషు వారి కాలంలో కూడా మద్రాసు తెలుగు వారికి ప్రత్యేక స్థానముండేది. సమాజంలోని ఇతర భాషల వారితోను, జాతుల వారితోను సమానంగా కలిసిపోయి సామాజికంగా వీరు నేడు మద్రాసు నగరంలో ప్రముఖ స్థానాన్ని పొంది వున్నారు.

మద్రాసులోని తెలుగు వారు సాంఘికంగా వున్నతి కోసం సంస్కృతి, జాతి, భాషా పరమైన అనేక సంఘాల్ని మద్రాసులో ఏర్పరచారు. తెలుగు విజ్ఞాన సమితి, కళా సాగర్, కళాభారతి, కళారంజని, చెన్నపురి ఆంధ్ర మహాసభ వంటి సంఘాలు, చిరకాలంగా మద్రాసులోని తెలుగు వారి భాషా సంస్కృతులకు సేవలందిస్తున్నాయి. మద్రాసు లోని తెలుగువారి సాంఘిక విలువల్ని వృద్ధి చేయడానికి కులపరమైన సంఘాలు కూడా ఏర్పరచబడి వున్నాయి.

ఆర్థికంగా మద్రాసులో తెలుగు వారిది ప్రథమ స్థానమని ముందే చెప్ప బడింది. మద్రాసులో వున్న సినిమాహాళ్ళు, హోటళ్ళు, వస్త్రాలయాలు, బంగారు వెండి అంగళ్ళు చాలా వరకు తెలుగు వారివే. మద్రాసులో జరిగే వాణిజ్యంలో తెలుగువారు ప్రముఖ పాత్రను వహిస్తున్నారు. మద్రాసులో తెలుగువారు లేకపోతే మద్రాసు నగరం ఆర్థికంగా ఎంతో వెనుకబడి వుండేది. నేడు భారత దేశంలో మద్రాసు నగరం ప్రముఖ పాత్ర వహిస్తోందంటే దానికి కారణం ప్రధానంగా మద్రాసులోని తెలుగువారే.

ప్రభుత్వ జనాభా లెక్కల ప్రకారం భాషా పరంగా మద్రాసులో తెలుగువారు, రెండవ స్థానాన్ని ఆక్రమిస్తున్నారు. కాని నేడు రాజకీయ సాంఘిక కారణాల వల్ల మద్రాసులోని తెలుగు వారు అనేకులు తమిళులుగా వ్యవహరింపబడుతున్నారు. ఉద్యోగావకాశాల కోసం చాలా మంది తెలుగు వారు తమిళ భాషనే చదువు తున్నారు. వారిలో కొంతమంది ఇంట్లో తెలుగు బయట తెలుగు భాషనే వ్యవహరిస్తున్నారు. కొన్ని తరాల క్రిందట ఇక్కడ స్థిర పడిపోయిన తెలుగు వారు తమిళులతో కలిసిపోయి నేడు తమిళులుగా వ్యవహరింపబడుతున్నారు. కొన్ని తెలుగు కుటుంబాల్లో భాషా పరంగానే

కాక ఆచార వ్యవహారాల రీత్యా కూడ తమిళుల ప్రభావం ఎక్కువగా కనిపిస్తోంది. పరిస్థితులు ఇలాగే కొనసాగితే కొంత కాలానికి మద్రాసు లోని తెలుగు వారంతా తమిళులయ్యే ప్రమాదం లేకపోలేదు.

'మద్రాసు నగర ప్రజా జీవన సరళి' అనే ఈ అధ్యాయంలో మద్రాసులోని తెలుగు ప్రజల్ని గూర్చి చెప్పడం జరిగింది. తరువాతి అధ్యాయంలో మద్రాసు తెలుగువారి భాషను గూర్చి వివరించడం జరుగుతుంది.



# 4. అన్య భాషా ప్రభావం

ప్రపంచ భాషల్ని పరిశీలిస్తే కొద్దో గొప్పో అన్యభాషా ప్రభావానికి లోను కాని భాష ప్రపంచంలో లేదనే చెప్పాలి. భాషలకు సన్నిహిత సంబంధం ఏర్పడ్డానికి కారణాలు అనేకం. ఒక భాషలో అన్యదేశ్యాలు ప్రవేశించడానికి కారణం అవసర భావం, గౌరవ భావం.

మద్రాసు నగరం బహు భాషలకు నిలయం. అధికార భాష తమిళం. ఈ కారణంగా మ.తె.పై తమిళ భాషా ప్రభావమే కాక ఆంగ్ల, హిందుస్థానీ భాషా ప్రభావాలు కూడా కన్పిస్తున్నాయి. పాలకుల భాష పాలితుల భాషపై ప్రభావం చూపడం సహజం. ఆంగ్లేయుల, మహమ్మదీయుల పరిపాలనా కారణంగా మ.తె. పై ఈ రెండు భాషల ప్రభావం ఎక్కువగా కన్పిస్తుంది.

ఒక భాషలో సరిపడినంత పదజాలం లేనప్పుడు అవసరార్థం మరో భాషా పదాల్ని స్వీకరించాల్సి వస్తుంది. ఈ విధంగా కూడా ఒక భాషలో అన్యభాషా పదాలు చేరే అవకాశం వుంది. కొన్ని సందర్భాల్లో ఆయా భాషల్లో తగినంత పదజాలం వున్నప్పటికి పాలకుల భాషా పదజాలాన్ని గౌరవార్థం అన్య భాషా పదాలుగా స్వీకరించడం కూడా జరుగుతుంది. ఉదా. :- మ. తె. లో ఆంగ్ల భాషా పదాలు అనేకం వచ్చి చేరాయి. ఉదా :- మమ్మీ, డాడీ, డ్రస్, బిజినెస్ మొదలైనవి.

ఇక మ.తె. ను తమిళ, ఆంగ్ల, హిందుస్థానీ భాషలు ఏ విధంగా ప్రభావితం చేశాయో పరిశీలింపబడుతుంది.

## 4.1. మద్రాసు తెలుగుపై తమిళ భాషా ప్రభావం

భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడినప్పుడు 1956 లో ఆంధ్ర రాష్ట్రం విడివడిపోయింది. ఆ సందర్భంలో ఉద్యోగ, వ్యాపార రీత్యా, ఇతర కారణాల వల్ల అనేక తెలుగు కుటుంబాలు మద్రాసు నగరంలో స్థిరపడి పోయాయి. మద్రాసులోని తమిళ, తెలుగు ప్రజల కలయిక వల్ల సాంఘిక, రాజకీయ కారణాలవల్ల తమిళం మ.తె. ను ప్రభావితం చేసింది.

మ.తె. లోని తమిళ పదాల్ని 1) వ్యస్త పదాలు 2) సమస్త పదాలు 3) ఆగత శ్ర పదాలు అని మూడు విధాలుగా విభజింపవచ్చు. వీటిని మరల యదాతథంగా కరింపబడ్డవి, అర్థంలో మార్పు చెందినవి అని రెండు విధాలుగా విభజింపవచ్చు.

### .1.1 యథాతథంగా ఎరువు తెచ్చుకోబడిన వ్యస్త పదాలు

| | | |
|---|---|---|
| ఒళవు | : | శ్రమ |
| తొళిల్ | : | వృత్తి |
| పంజం | : | కరువు |

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.1)

### 4.1.2. యథాతథంగా స్వీకరింపబడ్డ సమస్త పదాలు

| | | |
|---|---|---|
| మాడివీడు | : | మిద్దె ఇల్లు |
| సీర్ వరిసె | : | కానుకల వరుస |
| సెలవు తుర్రై | : | చాకలి సంఘం |

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.2)

### 4.1.3 ఆగత మిశ్ర పదాలు

మ.తె. లో తమిళ భాష నుండి ఎరువు తెచ్చుకొన్న ఆగత మిశ్ర పదజాలాన్ని క్రింది విధంగా విశ్లేషించవచ్చు.

4.1.3.1 తమిళం + తెలుగు

4.1.3.2 తమిళం + ఆంగ్లం

4.1.3.3 తమిళం + హిందుస్థానీ

4.1.3.4 తెలుగు + తమిళం

### 4.1.3.1 తమిళం + తెలుగు

తైనెల : తై + నెల (తై : నెలపేరు)

మలిగె అంగడి : మలిగె + అంగడి (మలిగె : సామానులు)

వోలవేసి : వోల + వేసి (వోల : తాటాకు)

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.7.1)

### 4.1.3.2 తమిళం + ఆంగ్లం

| | | |
|---|---|---|
| తనీపోర్షన్ | : | తనీ + పోర్షన్ |
| సిలవోడ్సు | : | సిల + వోడ్సు |

### 4.1.3.3 తమిళం + హిందుస్థానీ

| | | |
|---|---|---|
| సిలజాగా | : | సిల + జాగా |

### 4.1.3.4 తెలుగు + తమిళం

| | | |
|---|---|---|
| జనతొగె | : | జన + తొగె |
| మంచికర్తు | : | మంచి + కర్తు |
| ఒక వాయి | : | ఒక + వాయి |

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.7.3)

### 4.1.4 అర్థంలో మార్పుగల పదాలు

మ.తె. పదజాలాన్ని పరిశీలించినపుడు కొన్ని పదాలు తమిళార్థాన్ని స్వీకరించినట్లు కనబడుతోంది. అంటే తెలుగు పదమే తమిళార్థంలో వాడబడుతోందని అర్థం. ఇటువంటి పదాల్లో తెలుగు అర్థానికి బదులు తమిళార్థం ఏర్పడిందని చెప్పవచ్చు. అలా అర్థ సంబంధమైన మార్పుల్ని పొందిన పదజాలాన్ని ఇక్కడ పరిశీలించడం జరుగుతుంది.

'కేవలంగా' ప్రా.తె. లో 'కేవలం' 'మాత్రమే' అనే అర్థంలో వాడబడుతోంది. తమిళంలో 'కేవలం' అంటే 'హీనం' అని అర్థం. మ.తె. లో 'కేవలం' 'హీనం' అనే అర్థంలో వాడ బడింది. దీనికి కారణం తమిళ భాషా ప్రభావం.

'తిమ్మురు' ప్రా.తె. లో 'తిమ్మిరి' పదం స్పర్శజ్ఞానానికి సంబంధించిన ఒక వ్యాధి విశేషంగా వాడబడుతోంది. తమిళంలో 'తిమ్మురు' పదం 'పొగరు' అనే అర్థంలో వాడబడుతోంది. మ.తె. లో 'పొగరు' అనే అర్థంలో వాడబడింది.

'పట్టును' ఈ పదం ప్రా.తె. లో సరి పోతుంది అని గ్రహణార్థకంలో వాడబడుతోంది. తమిళంలో 'పుడిక్కుం' అనే పదం ఇష్టాన్ని వ్యక్తీకరించే సందర్భంలో వాడబడుతోంది. 'పుడిక్కుం' అనే పదానికి మ.తె. లో 'పట్టును' అనే పదం సమానార్థకంగా వుంది. అందువల్ల మ.తె. లో 'పట్టు'ను అనే పదం ఇష్టాన్ని వ్యక్తీకరించే సందర్భంలో వాడబడుతోంది. దీనికి కారణం తమిళ భాషా ప్రభావం. నచ్చదు అనే పదానికి కూడా పట్టుకోదు, పట్టదు అనే వ్యతిరేకార్థక పదాలు తమిళ భాషా ప్రభావం వల్ల మ.తె. లో ఏర్పడ్డాయి.

'పరితాపం' అనే పదం ప్రా.తె. లో 'సంతాపం' అనే అర్థంలో వాడబడుతోంది. తమిళంలో 'పరిదాబం' అంటే జాలి, దయ అని అర్థం. ఈ తమిళార్థం లోనే మ.తె. లో వాడ బడింది.

'మదించు' అంటే 'క్రొవ్వు పట్టు' అని ప్రా. తె. లో అర్థం. తమిళంలో గౌరవించు అని అర్థం. ప్రా. తె. లో మన్నించు, మన్నన పదాలు 'గౌరవించు' అనే అర్థంలో వాడబడుతున్నాయి. మ. తె. లో తమిళ భాషా ప్రభావం వల్ల 'మదించు' పదం గౌరవించు అనే అర్థంలో వాడబడుతోంది.

'మూతి' ఈ పదానికి ప్రా. తె. లో నోరు అని అర్థం. మ. తె. లో ఈ పదం తమిళ భాషా ప్రభావం వల్ల ముఖం అనే అర్థంలో వాడబడుతోంది.

'నేరం' అంటే ప్రా. తె. లో తప్పు. అపరాధం అనే అర్థాలున్నాయి. తమిళంలో 'నేరం' అంటే 'సమయం' అని అర్థం. మ. తె. లో కూడ 'సమయం' అనే అర్థంలో వాడబడింది.

'సెలవు' ఈ పదం ప్రా. తె. లో విరామం అనే అర్థంలో వాడబడుతోంది. శబ్దరత్నాకరంలో 'సెలవు' పదానికి ఆజ్ఞాపించు, అనుమతి అనే అర్థాలు చెప్పబడ్డాయి. తమిళంలో 'సెలవు' పదం ఖర్చు అనే అర్థంలో వాడబడుతోంది. మ.తె. లో అదే అర్థంలో

వాడబడింది.

## 4.2 మద్రాసు తెలుగుపై ఆంగ్ల భాషా ప్రభావం

భారత దేశం లోని పెద్ద నగరాల్లో ఒకటిగా పరిగణింపబడుతున్న మద్రాసు నగరం బ్రిటిషు వారి కాలంలో వారికి వ్యాపార కేంద్రంగా వున్నందువల్ల భిన్న జాతులకు, వర్గాలకు, భాషలకు, సంస్కృతులకు సంబంధించిన ప్రజలు ఈ నగరంలో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. రాజకీయంగా, సాంఘికంగా, మతపరంగా, ఆర్థికంగా సంపన్నులైన ఆంగ్లేయుల భాష ప్రాంతీయ భాషల్ని ప్రభావితం చేసింది. ఆంగ్లేయుల సాంకేతిక విజ్ఞానం వల్ల అనేక నిత్యావసర వస్తువులు, రాకపోకలకు సంబంధించిన పదాలు అవసర భావం వల్ల తెలుగులో ప్రవేశించాయి. సమాజంలో ఆంగ్లభాషకు సాంఘికంగా వున్నత స్థానం వున్నందువల్ల గౌరవార్థం ఆంగ్ల భాషా పదాలు మ. తె. లో అనేకం వచ్చి చేరాయి. ఈ విధంగా స్వీకరింపబడ్డ పదజాలాన్ని ప్రధానంగా మూడు విధాలుగా విభజింపవచ్చు. 1. వ్యస్త పదాలు 2. సమస్త పదాలు 3. ఆగత మిశ్ర పదాలు. వీటిని మరల రెండు విధాలుగా విభజింప వచ్చు. అవి 1. యథాతథంగా స్వీకరింపబడ్డ పదాలు 2. ధ్వని మార్పులతో స్వీకరింపబడ్డ పదాలు.

### 4.2.1 యథాతథంగా స్వీకరింపబడ్డ వ్యస్త పదాలు

ఆఫీస్

ఏరియా

డీసెంట్

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.3)

### 4.2.2 యథాతథంగా స్వీకరింపబడ్డ సమస్త పదాలు

కో ఎడ్యుకేషన్

ఫ్లాట్ సిస్టమ్

మదర్ టంగ్

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.4)

### 4.2.3 ఆగత మిశ్ర పదాలు

మ. తె. లో ఆంగ్ల భాషనుండి ఎరువు తెచ్చుకొన్న ఆగత మిశ్ర పదజాలాన్ని క్రింది విధంగా విశ్లేషించవచ్చు.

4.2.3.1 ఆంగ్లం + తెలుగు

4.2.3.2 తెలుగు + ఆంగ్లం

4.2.3.1 ఆంగ్లం + తెలుగు

| | | |
|---|---|---|
| జాబ్ కోసం | : | జాబ్ + కోసం |
| రౌడీతనం | : | రౌడీ + తనం |
| లైటుస్తంబం | : | లైటు + స్తంబం |

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.7.2)

### 4.2.3.2 తెలుగు + ఆంగ్లం

| | | |
|---|---|---|
| నీళ్లలారి | : | నీళ్ల + లారి |
| సొంత ఫ్రెండ్స్ | : | సొంత + ఫ్రెండ్స్ |
| మూడు పోర్షన్లు | : | మూడు + పోర్షన్లు |

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.7.4)

### 4.2.4 ధ్వని మార్పులతో స్వీకరింపబడ్డ పదాలు

ఆంగ్ల భాష నుండి ఎరువు తెచ్చుకోబడ్డ పదజాలంలో ధ్వని మార్పులకు లోనైన పదాలు మ. తె. లో చాలా తక్కువగా కనబడుతున్నాయి. తెలుగు అజంత భాష కావడం వల్ల హలంతమైన ఆంగ్ల పదాలు మ. తె. లో అజంతాలుగా మారాయి.

| | | |
|---|---|---|
| ఆ.భా | - | మ. తె. |
| బస్ | - | బస్సు |
| స్వీట్ | - | స్వీట్లు |

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.6)

పై ఆంగ్ల పదాల్లో ఉత్వదిత్వాలు చేరాయి. ఇలాగే కొన్ని ధ్వని మార్పులు ఆంగ్ల పదాల్లో కనిపిస్తున్నాయి. ఆ ధ్వని మార్పుల్ని ఇలా చెప్పవచ్చు.

### 4.2.4.1 ధ్వని మార్పులు

| | | |
|---|---|---|
| - అ - > అ - | : | హరిజన్స్ > అరిజనులు |
| - ఆ - > ఆ - | : | హానెస్ట్ > ఆనెస్ట్ |
| - ఎ - > ఎ - | : | హెడ్ మాస్టర్ > ఎడ్ మాస్టర్ |
| - ఓ - > ఓ - | : | హోటల్ > ఓటల్ |
| - వ - > బ - | : | టెంపరరీ > టెంబరరీ |
| - ఫ - > వ - | : | ఫొటో > పొటో |
| - బ - > వ - | : | బల్బ్ > బల్బు |
| - ష - > జ - | : | టెలివిషన్ > టెలివిజన్ |
| - స - > చ - | : | సినిమా > చినిమా |

- స - > జ -    :    రీసన్ > రీజన్

- హ - > Ø -    :    హోటల్ > ఓటల్

### 4.2.4.2 సంయుక్తం అసంయుక్తంగా మారడం

ర్మ > రమ    :    పర్మనెంట్ > పరమనెంట్

ర్న > Ø    :    గవర్నమెంట్ > గవమెంట్

## 4.3 మద్రాసు తెలుగుపై హిందుస్థానీ భాషా ప్రభావం

మ. తె. పై తమిళ, ఆంగ్ల భాషా ప్రభావాలతో పాటు హిందూస్థానీ భాషా ప్రభావం కూడా కనబడుతోంది. ఒకప్పుడు ఈ ప్రాంతం మహమ్మదీయుల పాలనలో వుండడమే కాక ప్రస్తుతం గొప్ప వ్యాపార కేంద్రంగా, పెద్ద నగరంగా, బహు భాషా వ్యవహృత ప్రాంతంగా వున్నందువల్ల హిందూస్థానీ భాషా ప్రభావం కూడా కనబడుతోంది. కాని తమిళ, ఆంగ్ల భాషా ప్రభావాలతో పోల్చి చూస్తే హిందూస్థానీ ప్రభావం తక్కువనే చెప్పాలి. ఈ భాష నుండి యథా తథంగా గ్రహింపబడ్డ పదాలే ఎక్కువగా వున్నాయి. కొన్ని సందార్భాల్లో హలంతాలు అజంతాలుగా మారాయి.

### 4.3.1 యథా తథంగా స్వీకరింపబడ్డ హిందూస్థానీ పదాలు

గిరాకి

చీటీ

తాహతు

(తక్కిన ఉదాహరణలకు చూడు అనుబంధం - 2.5)

### 4.3.2 హలంతాలు అజంతాలుగా మారడం

తయార్    :    తయారు

నౌకర్    :    నౌకరు

బేజార్    :    బేజారు

పై పరిశీలన వల్ల మ. తె. లో తమిళ, ఆంగ్ల హిందుస్థానీ పదాలు వ్యస్త, సమస్త, ఆగత మిశ్రరూపాలుగా చేరినట్లు, పదస్థాయిలో ఆంగ్ల భాషా ప్రభావం, వాక్య స్థాయిలో తమిళ భాషా ప్రభావం అధికంగా వున్నట్లు తెలుస్తుంది. పదస్థాయిలో ఆంగ్ల భాషా

ప్రభావానికి చూడండి అనుబంధం 2.3. వాక్యస్థాయిలోని తమిళ ప్రభావానికి ఉదాహరణలు

| | 1 | 2 | 3 |
|---|---|---|---|
| | ప్రా. తె. | మ. తె. | తమిళం |
| 1. | శ్రమవుంటే కచ్చితంగా వస్తుంది. | ఒళవు వుంటే కండిప్పా వచ్చును. | ఒళవు ఇరుందా కండిప్పా వరుం |
| 2. | తెలుగు శ్మశానం వుంది కదా అక్కడే పూడుస్తారు. | తెలుంగు సుడిగాడు వుల్లె అక్కడదా పొదచేది. | తెలుంగు సుడిగాడు ఇరుకిల్లె అంగెదా పొదకిరదు |
| 3. | పొలంకొని డబ్బు వృథా చేసేశాడు. | నెలం వాంగి డబ్బు వీన్ చేసిడిసినాడు. | నెలం వాంగి దుడ్డు వీన్ పణ్ణి టాన్ |

(తక్కిన ఉదాహరణలకు చూడండి పట్టిక అనుబంధం సంఖ్య - 2.4)

# 5. వర్ణ విజ్ఞానం

5.0 భాషకు మార్పు సహజం భాషల్లో వచ్చే మార్పులు ధ్వని, రూప, అర్థ సంబంధమైనవి కావచ్చు. ధ్వని సంబంధమైన మార్పులు వచ్చినంత త్వరితగతిని ఇతర మార్పులు రావు. మద్రాసు తెలుగు భాషను ప్రామాణిక తెలుగుతో పోల్చి మద్రాసు తెలుగు లోని ధ్వని మార్పుల్ని గుర్తించవచ్చు. ఈ ధ్వని మార్పులు ఏఏ పరిస్థితుల్లో ఏర్పడ్డాయి, ఎన్ని రకాలుగా ఏర్పడ్డాయి, అవి ఏర్పడడానికి కారణాలు ఈ అధ్యాయంలో వివరించబడ్డాయి.

మద్రాసు తెలుగు భాషలోని ధ్వని మార్పుల్ని పరిశీలించడానికి ముందు ఆ భాషలోని వర్ణాల్ని, వాటి వ్యాప్తిని తెలుసు కోవడం అవసరం. మ. తె. లోని వర్ణాల్ని క్రింది విధంగా గుర్తించడం జరిగింది.

మ. తె. లోని ఆంశిక వర్ణాలు (Segmental phoneme) మొత్తం 33 కాగా అందులో అచ్చులు 10, హల్లులు 23.

## 5.1 మద్రాసు తెలుగు లోని అచ్చులు

| | అగ్ర | కేంద్ర | పశ్చిమ |
|---|---|---|---|
| ఉచ్ఛ | ఇఈ | | ఉఊ |
| మధ్య | ఎఏ | | ఒఓ |
| నిమ్న | | అఆ | |

'ఋ' కారం 'ర' కారంగా ఉచ్చరింప బడుతుంది, కాబట్టి అది అచ్చుగ గుర్తింప బడలేదు. ప్రామాణిక తెలుగులో ఐ, ఔలు వున్నాయి.

## 5.2 మద్రాసు తెలుగులోని హల్లులు

| | | ఉభయోష్ఠ్యాలు | దంత్యోష్ఠ్యాలు | దంత్యాలు | మూర్ధన్యాలు | తాలవ్యాలు | కంఠ్యాలు | పరహాను మూలీయం |
|---|---|---|---|---|---|---|---|---|
| స్పర్శాలు | అల్ప | ప | | త | ట | చ | క | |
| | ప్రాణాలు | బ | | ద | డ | జ | గ | |
| అను నాసికాలు | | మ | | న | ణ | ఞ | ఙ | |
| ఊష్మాలు | | | ఫ | స | ష | శ | | హ |
| పార్శ్వికాలు | | | | ల | ళ | | | |
| తాడితాలు | | | | ర | | | | |
| అర్ధాచ్చులు | | వ | | | | య | | |

## 5.3 ప్రామాణిక తెలుగు లోని అచ్చులు

| | అగ్ర | కేంద్ర | పశ్చిమ |
|---|---|---|---|
| ఉచ్ఛ | ఇఈ | | ఉఊ |
| మధ్య | ఎఏ | | ఒఓ |
| నిమ్న | ఐ̅ | అఆ | |

## 5.4 ప్రామాణిక తెలుగులోని హల్లులు

| | ఉభయోష్ఠ్యాలు | దంత్యోష్ఠ్యాలు | దంత్యాలు | | దంతమూల్యములు | మూర్ధన్యాలు | తాలవ్యాలు | కంఠ్యాలు | పరహనుమూలీయం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | శ్వా నా | శ్వా నా | శ్వా నా | | శ్వా నా | శ్వానా | శ్వానా | శ్వానా | శ్వా నా |
| స్పర్శాలు | ప బ<br>ఫ భ | | త ద<br>థ ధ | | | ట డ<br>ఠ ఢ | | క గ<br>ఖ ఘ | |
| | | | | | | | చ జ | | |
| | | | | | | | ఛ ఝ | | |
| | | | | | | | | | |
| ఊష్మాలు | | ఫ వ | | | స | ష | శ | | హ |
| అను | | | | | | | | | |
| నాసికాలు | మ | | | | న | ణ | ఞ | ఙ | |
| పార్శ్వికాలు | | | | | ల | ళ | | | |
| | | | | | ర | | | | |
| | | వ | | | | | య | | |
| | | వ | | | | | | | |

మద్రాసు తెలుగులో లేని ప్రామాణిక తెలుగు అచ్చు ఐ̅

ప్రామాణిక తెలుగు లోని ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ మరియు దంత్యోష్ఠమైన 'వ' కారం మద్రాసు తెలుగులో లేవు.

## 5.5 మద్రాసు తెలుగులో అచ్చుల వ్యాప్తి

| | పదాది | పద మధ్య | పదాంత |
|---|---|---|---|
| అ | ✔ | ✔ | ✔ |
| ఆ | ✔ | ✔ | ✔ |
| ఇ | ✔ | ✔ | ✔ |
| ఈ | ✔ | ✔ | ✔ |
| ఉ | ✔ | ✔ | ✔ |
| ఊ | ✔ | ✔ | ✘ |
| ఎ | ✔ | ✔ | ✔ |
| ఏ | ✔ | ✔ | ✔ |
| ఒ | ✔ | ✔ | ✘ |
| ఓ | ✔ | ✔ | ✔ |

### 5.6 హల్లుల వ్యాప్తి

| | పదాది | పద మధ్య | పదాంత |
|---|---|---|---|
| క | ✔ | ✔ | ✔ |
| ఖ | ✔ | ✔ | ✘ |
| ఙ | ✘ | ✔ | ✘ |
| చ | ✔ | ✔ | ✘ |
| జ | ✔ | ✔ | ✘ |
| ఞ | ✘ | ✔ | ✘ |
| ట | ✔ | ✔ | ✔ |
| డ | ✔ | ✔ | ✘ |
| ణ | ✘ | ✔ | ✘ |
| త | ✔ | ✔ | ✘ |
| ద | ✔ | ✔ | ✘ |
| న | ✔ | ✔ | ✔ |
| ప | ✔ | ✔ | ✘ |
| ఫ | ✔ | ✔ | ✘ |
| బ | ✔ | ✔ | ✘ |
| మ | ✔ | ✔ | ✔ |
| య | ✘ | ✔ | ✘ |
| ర | ✔ | ✔ | ✔ |
| ల | ✔ | ✔ | ✔ |
| ళ | ✘ | ✔ | ✘ |
| వ | ✔ | ✔ | ✘ |
| శ | ✔ | ✔ | ✘ |
| ష | ✘ | ✔ | ✘ |
| స | ✔ | ✔ | ✔ |
| హ | ✔ | ✔ | ✘ |

## 5.7 అర్థ భేదక ధ్వనులు

### 5.7.1 అచ్చుల్లోని గుణాత్మక భేదాలు

#### 5.7.1.1 హ్రస్వాచ్చుల భేదాలు

| పదాది | | పద మధ్య | |
|---|---|---|---|
| అ ఇ | / అను / | అ ఇ | / చల్లు / |
| | / ఇను / | | / చిల్లు / |
| అ ఉ | / అబ్బు / | అ ఉ | / కట్టు / |
| | / ఉబ్బు / | | / కుట్టు / |
| అ ఎ | / అది / | అ ఎ | / పంచు / |
| | / ఇది / | | / పెంచు / |
| అ ఒ | / అట్టు / | అ ఒ | / కను / |
| | / ఒట్టు / | | / కొను / |
| ఇ ఉ | / ఇప్పుడు / | ఇ ఉ | / నిన్న / |
| | / ఉప్పుడు / | | / నున్న / |
| ఇ ఎ | / ఇన్ని / | ఇ ఎ | / చిక్కు / |
| | / ఎన్ని / | | / చెక్కు / |
| ఉ ఎ | / ఉండు / | ఇ. ఒ. | / తియ్యి / |
| | / ఎండు / | | / తొయ్యి / |
| ఎ ఒ | / ఎత్తు / | ఉ ఒ | / కుండ / |
| | / ఒత్తు / | | / కొండ / |
| ఒ ఉ | / ఒన్టి / | ఎ ఉ | / పెట్టు / |
| | / ఉన్టి / | | / పుట్టు / |
| | | ఎ ఒ | / పెట్టి / |
| | | | / పొట్టి / |

#### 5.7.1.2 దీర్ఘాచ్చుల భేదాలు

| పదాది | | పదమధ్య | |
|---|---|---|---|
| ఆ ఈ | / ఆడ / | ఆ ఈ | / కాడు / |
| | / ఈడ / | | / కీడు / |

| పదాది | | పదమధ్య | |
|---|---|---|---|
| ఆ ఊ | / ఆట / | ఆ ఊ | / పాట / |
| | / ఊట / | | / పూట / |
| ఆ ఏ | / ఆలు / | ఆ ఏ | / మాలు / |
| | / ఏలు / | | / మేలు / |
| ఆ ఓ | / ఆలి / | ఆ ఓ | / దాచు / |
| | / ఓలి / | | / దోచు / |
| ఈ ఊ | / ఈపు / | ఈ ఊ | / చీరు / |
| | / ఊపు / | | / చూరు / |
| ఈ ఏ | / ఈది / | ఈ ఏ | / వీలు / |
| | / ఏది / | | / వేలు / |
| ఈ ఓ | / ఈడు / | ఈ ఓ | / తీయు / |
| | / ఓడు / | | / తోయు / |
| ఊ ఏ | / ఊరు / | ఊ ఓ | / పూయు / |
| | / ఏరు / | | / పోయు / |
| ఏ ఊ | / ఏడ్చు / | ఏ ఊ | / కేడు / |
| | / ఊడ్చు / | | / కూడు / |
| ఏ ఓ | / ఏడు / | ఏ ఓ | / చెక్క / |
| | / ఓడు / | | / చొక్క / |

## 5.7.2 అచ్చుల్లోని పరిమాణాత్మక భేదం

### హ్రస్వాచ్చు దీర్ఘాచ్చు

| పదాది | | పద మధ్య | |
|---|---|---|---|
| అ ఆ | / అను / / ఆను / | అ ఆ : | / పడు / / పాడు / |
| ఇ ఈ : | / ఇడు / / ఈడు / | ఇ ఈ : | / విడు / / వీడు / |
| ఉ ఊ | / ఉరి / / ఊరి / | ఉ ఊ : | / కుడి / / కూడి / |
| ఎ ఏ : | / ఎంచు / / ఏంచు / | ఎ ఏ : | / నెల / / నేల / |
| ఒఓ | / ఒట్టు / ఓట్టు / | ఒ ఓ : | / కొలం / / కోలం / |

### 5.7.3 హల్లుల భేదాలు

| పదాది | | | పద మధ్య | | |
|---|---|---|---|---|---|
| క : గ | / కంప / | / గంప / | క : గ | / తాకు / | / తాగు / |
| చ : జ | / చుట్టు / | / జుట్టు / | చ : జ | / రాచు / | / రాజు / |
| చ : వ | / చచ్చు / | / వచ్చు / | ట : డ | / గుట్టు / | / గుడ్డు / |
| త : ద | / తగ్గు / | / దగ్గు / | త : ద | / మొత్తు / | / మొద్దు / |
| ప : బ | / పడి / | / బడి / | ప : బ | / అప్పు / | / అబ్బు / |
| ర : బ | / రోగం / | / బోగం / | మ : ణ | / అమ్మ / | / అణ్ణ / |
| ల : వ | / లేయు / | / వేయు / | | | |

### 5.8.0 ధ్వని మార్పులు

### 5.8.1 అచ్చుల్లో వచ్చే మార్పులు

/ అ /

అ -

| | | | | | |
|---|---|---|---|---|---|
| అ - | > | అ - | అంటారు | > | అంటురు |
| అ - | > | అ. - | అక్క | > | యక్క |
| అ - | > | ఆ - | అక్కడ | > | ఆడ |

- అ -

| | | | | | |
|---|---|---|---|---|---|
| - అ - | > | - అ - | అరకర | > | అరకొర |
| - అ - | > | - అ - | హరిజనులు | > | అరిజనులు |
| - అ - | > | - ఆ - | కోడలు | > | కోడాలు |
| - అ - | > | - ఇ - | నాయనమ్మ | > | నాయినమ్మ |
| - అ - | > | - ఉ - | అందరూ | > | అందురూ |
| - అ - | > | - ఎ - | వ్యవసాయం | > | వెవసాయం |
| - అ - | > | - ఒ - | మగ | > | మొగ |
| - అ - | > | - ఓ - | అయ్యవార్లు | > | అయ్యోర్లు |

- అ

| | | | | | |
|---|---|---|---|---|---|
| - అ | > | - అ - | వాడుక | > | వాడిక |
| - అ | > | - ఆ - | జాగ | > | జాగా |
| - అ | > | - ఇ - | అమావాస్య | > | అమాసి |

ఆ -

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | ఆ - | > | ఆ - | ఆడ | > | ఆడ |
| - ఆ - | - ఆ - | > | - అ - | అబ్బాయ | > | అబ్బయ |
| | - ఆ - | > | - ఆ - | సమాచారం | > | సమాజారం |
| | - ఆ - | > | ఆ - | హాజరు | > | ఆజరు |
| | - ఆ - | > | - ఇ - | అబ్బాయ | > | అబ్బియ |
| | - ఆ - | > | - ఉ - | అంటారు | > | అంటురు |
| | - ఆ - | > | - ఓ - | వాళ్ళు | > | వోల్లు |

- ఆ

| | | | | | |
|---|---|---|---|---|---|
| - ఆ | > | - అ | సరిగ్గా | > | సరింగ |
| - ఆ | > | - ఆ | తెలీకుండా | > | తెలికండా |

/ ఇ /

ఇ -

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇ - | > | ఇ - | ఇష్టం | > | ఇష్టం |
| ఇ - | > | ఈ - | ఇక్కడ | > | ఈడ |
| ఇ - | > | ఉ - | ఇప్పుడు | > | ఉప్పుడు |

- ఇ -

| | | | | | |
|---|---|---|---|---|---|
| - ఇ - | > | Ø | కలిపి | > | కల్పి |
| - ఇ - | > | - ఇ - | ఇచ్చినారు | > | ఇఛ్చినారు |
| - ఇ - | > | ఇ - | విరుచు | > | ఇరుచు |
| - ఇ - | > | - ఈ - | తెలియకుండా | > | తెలీకుండా |
| - ఇ - | > | ఈ - | విభూది | > | ఈబూది |
| - ఇ - | > | - ఉ - | విడుచు | > | వుడుచు |

- ఇ

| | | | | | |
|---|---|---|---|---|---|
| - ఇ | > | - ఇ | వచ్చేసి | > | వచ్చిడిసి |
| - ఇ | > | - అ | అబ్బాయి | > | అబ్బాయ |
| - ఇ | > | - ఉ - | మడి | > | మడుగు |

/ ఈ /

ఈ -

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఈ - | > | ఈ - | ఈశ్వరుడు | > | ఈశ్వరుడు |

- ఈ -

| | | | | |
|---|---|---|---|---|
| - ఈ - | > | ఈ - | వీధి | > | ఈది |

- ఈ

| | | | | |
|---|---|---|---|---|
| - ఈ | > | - ఈ | సర్జరీ | > | సర్జరీ |

/ ఉ /

ఉ -

| | | | | |
|---|---|---|---|---|
| ఉ - | > | ఉ - | ఉత్సవం | > | ఉత్సవం |

- ఉ -

| | | | | |
|---|---|---|---|---|
| - ఉ - | > | - ∅ - | ఎదురుగా | > | ఎదుర్కా |
| - ఉ - | > | - అ - | తెలియకుండా | > | తెలీకండా |
| - ఉ - | > | - ఆ - | ఉంటుంది | > | ఉంటాది |
| - ఉ - | > | - ఇ - | వాడుక | > | వాడిక |
| - ఉ - | > | - ఉ - | కుటుంబరాలు | > | కుడుంబరాలు |
| - ఉ - | > | - ఒ - | కులం | > | కొలం |
| - ఒ - | > | - ఓ - | అమ్ముకొని | > | అమ్ముకోని |

- ఉ

| | | | | |
|---|---|---|---|---|
| - ఉ | > | - ∅ | అతీతము | > | అతీతమ్ |
| - ఉ | > | - ఉ | ఇప్పడు | > | ఇప్పడు |
| - ఉ | > | - ఏ | దొరకదు | > | దొరకదే |

/ ఊ /

- ఊ -

| | | | | |
|---|---|---|---|---|
| ఊ - | > | ఊ - | ఊర్లో | > | ఊర్లే |
| ఊ - | > | - ఊ - | ఊరు | > | యూరు |

- ఊ -

| | | | | |
|---|---|---|---|---|
| - ఊ - | > | - ఊ - | స్కూలు | > | స్కూలు |

- ఊ

| | | | | |
|---|---|---|---|---|
| - ఊ | > | - ఊ | అందరూ | > | అందరూ |
| - ఊ | > | - ఏ | అందరూ | > | అందరే |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | **/ ఎ /** | | | |
| ఎ - | | | | | | |
| | ఎ - | > | ఎ - | ఎర్రి | > | ఎర్రి |
| | ఎ - | > | ఏ - | ఎక్కడ | > | ఏడ |
| | ఎ - | > | ఓ - | ఎవరు | > | ఓరు |
| - ఎ - | | | | | | |
| | - ఎ - | > | - అ - | వెత్యాసం | > | వత్యాసం |
| | - ఎ - | > | - అ - | చెల్లెలు | > | చెల్ల |
| | - ఎ - | > | - ఉ - | కొంచెం | > | కొంజుం |
| | - ఎ - | > | ఎ - | వెనక | > | ఎనక |
| | - ఎ - | > | - ఏ - | వెయ్యి | > | వేయి |
| - ఎ | | | | | | |
| | - ఎ | > | - ఇ | ముసలామె | > | ముసలామి |
| | - ఎ | > | - ఎ | అందరె | > | అందరె |
| | | | **/ ఏ /** | | | |
| ఏ - | | | | | | |
| | ఏ - | > | ఏ - | ఏడ్చు | > | ఏడ్చు |
| | ఏ - | > | - అ - | ఏవూరు | > | యావూరు |
| | ఏ - | > | ఎ - | ఏది | > | ఎదియే |
| - ఏ - | - ఏ - | > | - ఇ - | ఇచ్చేరు | > | ఇచ్చినారు |
| | - ఏ - | > | - ఉ - | కాల్చేస్తారు | > | కాలుస్తారు |
| | - ఏ - | > | - ఏ - | లాంగ్వేజి | > | లాంగ్వేజి |
| - ఏ | | | | | | |
| | - ఏ | > | - ఏ | అక్కడ్నే | > | అడ్నే |
| | | | **/ ఒ /** | | | |
| ఒ - | ఒ - | > | ఒ - | ఒకటి | > | ఒన్టి |
| | ఒ - | > | - ఒ - | ఒక | > | వొక |
| | ఒ - | > | ఓ - | ఒకటి | > | ఓటి |
| - ఒ - | - ఒ - | > | - ఇ - | పెట్టుకొని | > | పెట్టుకిని |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | - ఒ - | > | - ఉ - | పెట్టుకొని | > | పెట్టికుని |
| | - ఒ - | > | - ఒ - | కొంచెం | > | కొంజం |
| | - ఒ - | > | - ఓ - | పెట్టుకొని | > | పెట్టుకోని |
| - ఒ | | | | | | |
| | - ఒ | > | - ఒ | ఎదుర్కొ | > | ఎదుర్కొ |
| | | | | / ఓ / | | |
| ఓ - | ఓ - | > | ఓ - | ఓడు | > | ఓడు |
| - ఓ - | | | | | | |
| | - ఓ - | > | - ఆ - | పిల్లోడు | > | పిల్లాడు |
| | - ఓ - | > | - ఇ - | మంచోడు | > | మంచివాడు |
| | - ఓ - | > | - ఓ - | నోము | > | నోంబు |
| | - ఓ - | > | - ఓ - | హోటల్ | > | ఓటల్ |
| - ఓ | | | | | | |
| | - ఓ | > | - అ | దీన్లో | > | దీన్ల |
| | - ఓ | > | - ఇ - | ఏదో | > | ఏదియో |
| | - ఓ | > | - ఏ | ఊర్లో | > | ఊర్లే |

ఇంతవరకు పదాది పదమధ్య పదాంత అచ్చుల్లో వచ్చిన మార్పుల్ని చర్చించడం జరిగింది. ఇక హల్లుల్లో వచ్చిన మార్పులు పరిశీలింపబడుతాయి.

### 5.8.2 హల్లుల్లో వచ్చిన మార్పులు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| క - | | | | | | |
| | క - | > | క - | కలిపి | > | కల్పి |
| | క - | > | గ - | కంపెనీ | > | గంపెనీ |
| - క - | | | | | | |
| | - క - | > | - క - | తెలుసుకొనేది | > | తెల్సుకొనేది |
| | - క - | > | - Ø - | ఒకటి | > | ఓటి |
| | - క - | > | - గ - | జ్ఞాపకం | > | జ్ఞాపగం |
| | - క - | > | - చ - | అక్షరం | > | అచ్చరం |
| | - క - | > | - త - | శక్తి | > | చత్తి |
| | - క - | > | - ప - | అక్క | > | అప్ప |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | - క - | > | - య - | ఒకటి | > | ఒయిటి |
| | - క - | > | - హ - | ఒక | > | ఒహాటి |
| - క | | | | | | |
| | - క | > | క - | బ్యాంక్ | > | బ్యాంక్ |
| | | | | / ఖ / | | |
| ఖ - | | | | | | |
| | ఖ - | > | క - | ఖర్చు | > | కర్చు |
| - ఖ - | - ఖ - | > | - క - | ముఖ్యం | > | ముక్యం |
| | - ఖ - | > | - త - | ముఖం | > | మూతి |
| | | | | / గ / | | |
| గ - | గ - | > | క - | గంప | > | కంప |
| | గ - | > | గ - | గ్రామం | > | గ్రామం |
| - గ - | | | | | | |
| | - గ - | > | - Ø - | పరిగెత్తు | > | పరెత్తు |
| | - గ - | > | - క - | నలుగురు | > | నలుకురు |
| | - గ - | > | - గ - | సంగం | > | సంగం |
| | - గ - | > | - వ - | వినుగు | > | వినువు |
| | - గ - | > | - హ - | పగల్ | > | పహాల్ |
| | | | | / ఘ / | | |
| - ఘ - | | | | | | |
| | - ఘ - | > | - గ - | సంఘం | > | సంగం |
| | | | | / ఙ / | | |
| ఙ - | - ఙ - | > | - ఙ - | చెంగల్వ | > | చెంగల్వ |
| | | | | / చ / | | |
| 5 - | చ - | > | చ - | చల్లు | > | చల్లు |
| | చ - | > | జ - | చేరు | > | జేరు |
| | చ - | > | స - | చావు | > | సావు |
| - చ - | | | | | | |
| | - చ - | > | - చ - | ఇచ్చినారు | > | ఇచ్చినారు |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | - చ - | > | - జ - | లంచం | > | లంజం |
| | - చ - | > | - స - | పిశాచి | > | పిసాసి |
| | | | | / జ / | | |
| జ - | | | | | | |
| | జ - | > | జ - | జగడాలు | > | జగడాలు |
| - జ - | - జ - | > | - జ - | అడ్జసు | > | అడ్జసు |
| | | | | / ఞ / | | |
| - ఞ - | | | | | | |
| | - ఞ - | > | - ఞ - | జ్ఞాపకం | > | జ్ఞాపగం |
| ట - | | | | | | |
| | ట - | > | ట - | టెంపరరీ | > | టెంపరరీ |
| - ట - | - ట - | > | - ట - | పోట్లాట | > | పోట్లాట |
| | - ట - | > | - డ - | కుటుంబం | > | కుడుంబం |
| - ట | | | | | | |
| | - ట | > | - ట | కన్వీనియంట్ | > | కన్వీనియంట్ |
| | | | | / ఠ / | | |
| - ఠ - | | | | | | |
| | - ఠ - | > | - ట - | పాఠం | > | పాటం |
| | - ఠ - | > | - డ - | పాఠం | > | పాడం |
| | | | | / డ / | | |
| డ - | | | | | | |
| | డ - | > | డ - | డబ్బు | > | డబ్బు |
| - డ - | - డ - | > | - ట - | తెలీకుండా | > | తెలీకుంటా |
| | - డ - | > | - డ - | ఆడతాము | > | ఆడ్తాము |
| | - డ - | > | - ళ - | బడులు | > | బళ్ళు |
| | | | | / ణ / | | |
| - ణ - | - ణ - | > | - ణ - | క్షణం | > | క్షణం |
| | - ణ - | > | - న్ - | పుణ్యం | > | పున్నియం |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | | / త / | | |
| త - | త - | > | త - | తెలియదు | > | తెల్దు |
| | త - | > | ద - | తాను | > | దాను |
| - త - | - త - | > | - చ - | సంవత్సరం | > | సంవత్చరం |
| | - త - | > | - త - | పరిగెత్తు | > | పరెత్తు |
| | - త - | > | - ద - | జాతి | > | జాది |
| | - త - | > | - స - | సంవత్సరం | > | సంవస్సరం |
| | | | | / థ / | | |
| - థ - | - థ - | > | త | అర్థం | > | అర్తం |
| | - థ - | > | ద | అర్థ | > | అర్ద |
| | | | | / ద / | | |
| ద - | ద - | > | ద - | దీనిలో | > | దీన్ల |
| - ద - | - ద - | > | - ద - | మొద్దు | > | మొద్దు |
| | | | | / ధ / | | |
| ధ - | | | | | | |
| | ధ - | > | ద - | ధర్మం | > | దర్మం |
| -ధ - | - ధ - | > | - ద - | శుద్ధం | > | శుద్దం |
| | | | | / న / | | |
| న - | న - | > | న - | నీళ్ళు | > | నీల్లు |
| - న - | - న - | > | -.గ - | లగ్నం | > | లగ్గం |
| | - న - | > | - ఞ - | అన్న | > | అఞ్ఞ |
| | - న - | > | - న - | చద్దన్నం | > | సద్దన్నం |
| · న | - న | > | - న | హిందుస్తాన్ | > | ఇందుస్తాన్ |
| | | | | / ప / | | |
| ప - | ప - | > | ప - | పుణ్యం | > | పున్నియం |
| | ప - | > | బ - | పద్ధతి | > | బద్దతి |
| - ప - | ప - | > | బ - | పారంపర్యం | > | బారంపర్యం |
| | - ప - | > | - బ - | టెంపరరీ | > | టెంబరరీ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | | / ఫ / | | |
| ఫ - | | | | | | |
| | ఫ - | > | ప - | ఫోటో | > | పోటో |
| | ఫ - | > | ఫ - | ఫైలు | > | ఫైలు |
| - ఫ - | - ఫ - | > | - బ - | ఎనఫై | > | ఎనబై |
| | | | | / బ / | | |
| బ - | | | | | | |
| | బ - | > | బ - | బ్రతుకు | > | బదుకు |
| - బ - | - బ - | > | - బ - | అబ్బు | > | అబ్బు |
| | - బ - | > | - ప - | విబూది | > | విపూతి |
| | | | | / భ / | | |
| భ - | | | | | | |
| | భ - | > | బ - | భాగ్యం | > | బాగ్యం |
| | | | | / మ / | | |
| మ - | | | | | | |
| | మ - | > | మ - | మధ్యాహ్నం | > | మద్యాన్నం |
| - మ - | - మ - | > | - ప - | ఆమె | > | ఆపె |
| | - మ - | > | - మ - | బ్రాహ్మలు | > | బ్రామ్మలు |
| - మ్ | - మ్ | > | - మ్ | నిర్వాహం | > | నిర్వాగం |
| | | | | / య / | | |
| - య - | -య - | > | - య - | ఉపయోగం | > | ఉపయోగం |
| | | | | / ర / | | |
| ర - | | | | | | |
| | ర - | > | ర - | రాజ్యం | > | రాజ్యం |
| - ర - | - ర - | > | - డ - | కాపురం | > | కాపడం |
| | - ర - | > | - ర - | సంవత్సరం | > | సంవస్సరం |
| - ర | | | | | | |
| | - ర | > | - ర | కౌన్సిలర్ | > | కౌన్సిలర్ |

/ ల /

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ల - | | | | | | |
| | ల - | > | ల - | లగ్నం | > | లగ్గం |
| - ల - | - ల - | > | - ల - | తెల్లారి | > | తెలవారి |
| ల - | ల - | > | ల - | స్టీల్ | > | స్టీల్ |

/ ళ /

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| - ళ - | | | | | | |
| | - ళ - | > | - ళ - | నీళ్ళు | > | నీళ్ళు |
| | - ళ - | > | - ల - | మహిళ | > | మయిల |

/ వ /

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| వ - | | | | | | |
| | వ - | > | ∅ - | విరిచి | > | ఇరిచి |
| - వ - | | | | | | |
| | - వ - | > | - ∅ - | అరవం | > | అరం |
| | - వ - | > | - గ్ - | బంధువులు | > | బందుగులు |
| | - వ - | > | - మ - | మనవరాలు | > | మనమరాలు |
| | - వ - | > | - వ - | పశువు | > | పసువు |

/ శ /

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| శ - | | | | | | |
| | శ - | > | చ - | శక్తి | > | చక్తి |
| | శ - | > | స - | శుభ్రం | > | సుద్దం |
| | - శ - | > | - స - | కొట్టేశారు | > | కొట్టేస్తిరి |

/ ష /

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| - ష - | | | | | | |
| | - ష - | > | [illegible] | [illegible] | > | టాస |

/ స /

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| స - | | | | | | |
| | స - | > | జ - | సామాను | > | జామాను |
| | స - | > | - స - | స్కూలు | > | ఇస్కూలు |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | స - | > | స - | స్పర్ధ | > | స్పర్ధ |
| - స - | | | | | | |
| | - స - | > | - స - | వస్తారు | > | వస్సారు |
| - స | | | | | | |
| | - స | > | - స | అంకుల్స్ | > | అంకుల్స్ |

/ హ /

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| హ - | | | | | | |
| | హ - | > | ∅ - | హరిజనులు | > | అరిజనులు |
| | హ - | > | హ - | హరిజనులు | > | హరిజనులు |
| - హ - | | | | | | |
| | - హ - | > | - ∅ - | పలహారం | > | పలారం |
| | - హ - | > | - గ్ - | పదహారు | > | పదగారు |

## 5.9 మద్రాసు తెలుగు లోని ద్విత్వాలు

ఇంతవరకు మ. తె. లోని అచ్చులు, హల్లులు పొందిన మార్పుల్ని పరిశీలించడం జరిగింది. ఇక ప్రామాణిక తెలుగు లోని ద్విత్వాలు మ. తె. లో ఎలా మార్పు చెందాయో పరిశీలించబడుతుంది. ఉచ్చారణా సౌలభ్యం కొరకు ప్రా. తె. లోని ద్విత్వాలు మ. తె. లో అద్విరుక్తాలుగా మారాయి. ప్రా. తె. భాషలోని అద్విరుక్తాలు మ. తె. లో ద్విరుక్తాలుగా కూడా మారడం జరిగింది. ప్రా. తె. లోని సంయుక్త వర్ణాలు కొన్ని మ. తె.లో ద్విత్వాలుగా మారాయి.

నా ఈ పరిశీలన వల్ల పదాది అచ్చులపై మ. తె. లో పదహారు ద్విత్వాలు ఉన్నట్లు తేలింది. మ. తె. లో పదాది ద్విత్వాలు లేవు.

## 5.9.1 మ. తె. లో పదాది అచ్చులపై వచ్చే ద్విత్వాలు

### 5.9.1.1 పదాది 'అ' పై వచ్చే ద్విత్వాలు

| | | |
|---|---|---|
| క్క | : | అక్క |
| చ్ఛ | : | అచ్ఛరం |
| ట్ట | : | అట్టడుగు |
| డ్డ | : | అడ్డాలు |
| ణ్ణ | : | అణ్ణ |

| | | |
|---|---|---|
| త్త | : | అత్త |
| ద్ద | : | అద్దె |
| న్న | : | అన్న |
| ప్ప | : | అప్పరం |
| బ్బ | : | అబ్బాయి |
| మ్మ | : | అమ్మ |
| య్య | : | అయ్యోరు |
| ల్ల | : | అల్లరి |
| వ్వ | : | అవ్వ |

### 5.9.1.2 పదాది 'ఇ' పై వచ్చే ద్విత్వాలు

| | | |
|---|---|---|
| క్క | : | ఇక్కడ |
| చ్చ | : | ఇచ్చినోల్లు |
| ట్ట | : | ఇట్టాగ |
| ద్ద | : | ఇద్దరు |
| న్న | : | ఇన్నారు |
| ప్ప | : | ఇప్పటికి |
| మ్మ | : | ఇమ్మన్నారు |
| య్య | : | ఇయ్యాల |
| ల్ల | : | ఇల్లు |
| వ్వ | : | ఇవ్వాల |
| స్స | : | ఇస్సారు |

### 5.9.1.3 పదాది 'ఉ' పై వచ్చే ద్విత్వాలు

| | | |
|---|---|---|
| గ్గ | : | ఉగ్గు |
| ట్ట | : | ఉట్టి |
| ణ్ణ | : | ఉణ్ణింది |
| త్త | : | ఉత్త |
| న్న | : | ఉన్నారు |

| | | |
|---|---|---|
| ప్వ | : | ఉప్వడు |
| మ్మ | : | ఉమ్మదం |
| య్య | : | ఉయ్యూరు |

### 5.9.1.4 పదాది 'ఊ' పై వచ్చే ద్విత్వాలు

| | | |
|---|---|---|
| స్స | : | ఊస్సారు |

### 5.9.1.5 పదాది 'ఎ' పై వచ్చే ద్విత్వాలు

| | | |
|---|---|---|
| క్క | : | ఎక్కడ |
| చ్చ | : | ఎచ్చరించు |
| ట్ట | : | ఎట్టన్నా |
| త్త | : | ఎత్తు |
| న్న | : | ఎన్ని |
| ప్వ | : | ఎప్వడు |
| య్య | : | ఎయ్యేల |
| ర్ర | : | ఎర్రి |
| ల్ల | : | ఎల్లి |

### 5.9.1.6 పదాది 'ఏ' పై వచ్చే ద్విత్వాలు

| | | |
|---|---|---|
| స్స | : | ఏస్సారు |

### 5.9.1.7 పదాది 'ఒ' పై వచ్చే ద్విత్వాలు

| | | |
|---|---|---|
| క్క | : | ఒక్కటి |
| ట్ట | : | ఒట్టు |
| ణ్ణ | : | ఒణ్ణు |
| త్త | : | ఒత్తి |
| ప్వ | : | ఒప్వందం |
| య్య | : | ఒయ్యారం |
| ల్ల | : | ఒల్లు |

## 5.9.2 మ. తె. లోని పద మధ్య ద్విత్వాలు

మ. తె. లో పదమధ్యలో వచ్చే ద్విత్వాలు పదిహేడు. (చూడు Chart II) అవి:

| | | |
|---|---|---|
| క్క | - | చిక్కు |

| | | |
|---|---|---|
| గ్గ | - | తగ్గు |
| చ్చ | - | తెచ్చు |
| ట్ట | - | చట్టి |
| డ్డ | - | గొడ్డు |
| ణ్ణ | - | వణ్ణం |
| త్త | - | దుత్త |
| ద్ద | - | హద్దు |
| న్న | - | చిన్న |
| ప్ప | - | తప్పు |
| బ్బ | - | దెబ్బ |
| మ్మ | - | నమ్ము |
| య్య | - | కయ్య |
| ర్ర | - | వెర్రి |
| ల్ల | - | వాల్లు |
| వ్వ | - | తవ్వు |
| స్స | - | సంవస్సరం |

పదాంతంలో ద్విత్వాలు లేవు.

### 5.9.3 ప్రా. భా. లో ద్విరుక్తంగా వుండి మ. తె. లో అద్విరుక్తంగా మారిన రూపాలు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| క్క:- | - క్క - | > | - Ø - | ఇక్కడ | > | ఈడ |
| | - క్క - | > | - క్ - | అక్కడ | > | అకడ |
| | - క్క - | > | - గ్ - | ఎక్కడ | > | ఎగడ |
| గ్గ - | - గ్గ - | > | - గ్ - | సరిగ్గా | > | సరింగా |
| | - గ్గ - | > | - య - | సరిగ్గా | > | సరియా |
| - న్న - | - న్న - | > | -ండ్ - | వున్నాము | > | వుండాము |
| | - న్న - | > | - ద్ - | మన్నించు | > | మదించు |
| | - న్న - | > | - న్ - | చిన్నాయన | > | చినాయన |

| | | | | | |
|---|---|---|---|---|---|
| - ప్ప - :- - ప్ప్ - | > | - ప్ - | ఇప్పుడు | > | ఇపుడు |
| - బ్బ - :- - బ్బ్ - | > | - బ్ - | అబ్బాయి | > | అబయ |
| - య్య - :-- య్య్ - | > | - యి - | వెయ్యి | > | వేయి |
| - ర్ర - :- - ర్ర్ - | > | - ర్ - | వెర్రి | > | వెరి |
| - ల్ల - :- - ల్ల్ - | > | - ల - | పిల్లకాయలు | > | పిలకాయలు |
| | | | తెల్లారి | > | తెలవారి |

### 5.9.4 ప్రా. తె. లో అద్విరుక్తాలుగా వుండి మ. తె. లో ద్విరుక్తాలుగా మారిన రూపాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ద | > | ద్ద | మంచిదే | > | మంచిద్దా |
| య | > | య్య | పోయేరు | > | పొయ్యేరు |

### 5.9.5 ప్రా. తె. లోని సంయుక్త వర్ణాలు మ. తె. లో ద్విత్వాలుగా మారడం

| | | | | | |
|---|---|---|---|---|---|
| క్ + త్ | > | త్ + త్ | శక్తి | > | చత్తి |
| ఖ్ + య్ | > | ఖ్ + క్ | ముఖ్యం | > | ముక్కియం |
| క్ + ష్ | > | చ్ + చ్ | అక్షరం | > | అచ్చరం |
| ణ్ + య్ | > | న్ + న్ | పుణ్యం | > | పున్నియం |
| త్ + స్ | > | చ్ + చ్ | సంవత్సరం | > | సంవచ్చరం |
| బ్ + స్ | > | ద్ + ద్ | శుభ్రం | > | సుద్దం |
| శ్ + చ్ | > | చ్ + చ్ | నిశ్చయం | > | నిచ్చియం |
| శ్ + న్ | > | చ్ + చ్ | ప్రశ్న | > | ప్రచ్చిన |
| స్ + త్ | > | స్ + న్ | వస్తారు | > | వస్నారు |
| న్ + త్ | > | చ్ + చ్ | వస్తుంది | > | వచ్చును |
| హ్ + న్ | > | న్ + న్ | మధ్యాహ్నం | > | మద్యాన్నం |
| హ్ + మ్ | > | మ్ + మ్ | బ్రాహ్మణులు | > | బ్రామ్మలు |

### 5.10.0 సంయుక్తాలు

మ. తె. లో పదాదిని వచ్చే సంయుక్తాలు 31. వీటిని స్థాన కరణ ప్రయత్న భేదాల్ని బట్టి 12 వర్గాలుగా విభజించడం జరిగింది. చూడు Chart IV. వీటిలో అధిక భాగం అన్య భాషా ప్రభావం వల్ల ఏర్పడ్డవే.

### 5.10.1 పదాది రెండు హల్లుల సంయుక్తాలు

| | | |
|---|---|---|
| **స్పర్శం** | **+** | **అనునాసికం** |
| / జ్ఞ / | + | జ్ఞానం |
| **స్పర్శం** | **+** | **ఊష్మం** |
| / క్ష / | | క్షుణ్ణం |
| **స్పర్శం** | **+** | **పార్శ్వికం** |
| / ప్ల / | | ప్లాన్ |
| **స్పర్శం** | **+** | **తాడితం** |
| / క్ర / | | కృషి |
| / గ్ర / | | గ్రామం |
| / డ్ర / | | డ్రస్ |
| / త్ర / | | త్రాను |
| / ద్ర / | | ద్రోహం |
| / ప్ర / | | ప్రాంతం |
| / బ్ర / | | బ్రాహ్మణులు |
| **స్పర్శం** | **+** | **అర్ధాచ్చు** |
| / జ్వ / | | జ్వరం |
| / ట్వ / | | ట్వంటీ |
| / ద్వ / | | ద్వేషం |
| / జ్య / | | జ్యోది |
| / డ్య / | | డ్యూటి |
| / త్య / | | త్యాగం |
| / ప్య / | | ప్యాక్టర్ |

| | |
|---|---|
| / బ్య / | బ్యాంక్ |
| **అనునాసికం +** | **అర్థాచ్చు** |
| / న్యా / | న్యాయం |
| **ఊష్మం +** | **స్పర్శం** |
| / స్క / | స్కూలు |
| / స్ట / | స్టీల్ |
| / స్త / | స్తలం |
| / స్ప / | స్పర్ధ |
| **ఊష్మం +** | **అనునాసికం** |
| / శ్మ / | శ్మశానం |
| / స్న / | స్నేగితం |
| **ఊష్మం +** | **తాడితం** |
| / శ్ర / | శ్రమ |
| / స్ర / | స్రుష్టి |
| **ఊష్మం +** | **అర్థాచ్చు** |
| / స్వ / | స్వదంద్రం |
| **అర్థాచ్చు +** | **తాడితం** |
| / వ్ర / | వ్రతం |
| **అర్థాచ్చు +** | **అర్థాచ్చు** |
| / వ్య / | వ్యవహారం |

'ఋ' కారం వ్యవహార భాషలో 'ర' కారంగా ఉచ్చరింప బడడం వల్ల 'ల' ని సంయుక్తంగా తీసుకోవడం జరిగింది.

**5.10.2 మ. తె. లో పదాది అచ్చుకు పరంగా వచ్చే రెండు వర్ణాల సంయుక్తాలు**

| | |
|---|---|
| **స్పర్శం +** | **స్పర్శం** |
| / డ్చ / | ఊడ్చు |
| / డ్జ / | అడ్జసు |

| | | |
|---|---|---|
| / డ్త / | | ఆడ్తాము |
| **స్పర్శం** | **+** | **అనునాసికం** |
| / ట్న / | | అట్నే |
| / త్మ / | | అత్మ |
| **స్పర్శం** | **+** | **ఊష్మం** |
| / క్స / | | ఎక్స్‌క్లూడింగ్ |
| / క్ష / | | అక్షరం |
| / త్స / | | ఉత్సవం |
| **స్పర్శం** | **+** | **పార్శ్వికం** |
| / ట్ల / | | ఎట్ల |
| **స్పర్శం** | **+** | **తాడితం** |
| / క్ర / | | ఆక్రమించు |
| / గ్ర / | | అగ్రహారం |
| **స్పర్శం** | **+** | **అర్థాచ్చు** |
| / క్వ / | | ఈక్వల్ |
| / ద్య / | | ఉద్యోగం |
| / డ్వ / | | అడ్వాన్సు |
| / బ్యా / | | అబ్యాసం |
| **అనునాసికం** | **+** | **స్పర్శం** |
| / ఙ్క / | | అంకుల్స్ |
| / ఙ్గ / | | అంగడి |
| / ఞ్చ / | | ఉంచు |
| / ణ్డ / | | ఉండారు |
| / న్త / | | అంతా |
| / న్ద / | | అందం |
| **అనునాసికం** | **+** | **అర్థాచ్చు** |
| / న్య / | | అన్యాయం |

| | | |
|---|---|---|
| **ఊష్మం** | **+** | **స్పర్శం** |
| / శ్చ / | | ఆశ్చర్యం |
| / స్తి / | | ఆస్తి |
| / ష్ట / | | ఇష్టం |
| / స్క / | | ఇస్కూలు |
| **ఊష్మం** | **+** | **అర్థాచ్చు** |
| / శ్వ / | | ఈశ్వరుడు |
| **పార్శ్వికం** | **+** | **స్పర్శం** |
| / ల్ప / | | అల్ప |
| **పార్శ్వికం** | **+** | **పార్శ్వికం** |
| / ళ్ల / | | బళ్లు |
| **తాడితం** | **+** | **స్పర్శం** |
| / ర్చ / | | ఓర్చు |
| / ర్త / | | అర్తం |
| / ర్బ / | | ఆర్బాటం |
| **తాడితం** | **+** | **పార్శ్వికం** |
| / ర్ల / | | ఊర్లో |
| **తాడితం** | **+** | **అర్థాచ్చు** |
| / ర్య / | | ఆర్య |
| **పరహనుమూలీయం** | **+** | **అర్థాచ్చు** |
| / హ్వ / | | ఆహ్వానము |

5.10.3 మ. తె లో పద మధ్యలో సంయుక్తాలు 102 వీటిని 25 వర్గాలుగా విభజించడం జరిగింది. చూడు Chart VI.

| | | |
|---|---|---|
| **స్పర్శం** | **+** | **స్పర్శం** |
| / క్చ / | | ప్రాక్చర్ |
| / క్ట / | | కరక్టే |

| | | |
|---|---|---|
| / క్త / | | రక్తం |
| / గ్జ / | | అగ్జరి |
| / డ్చ / | | పూడ్చు |
| / డ్జ / | | జడ్జి |
| / డ్త / | | మాటాడ్తాము |
| / త్క / | | అంబేత్కర్ |
| / ప్త / | | ప్రాప్తం |
| / బ్ధ / | | చబ్దుం |
| **స్పర్శం** | **+** | **అనునాసికం** |
| / గ్న / | | అగ్నం |
| / గ్మ / | | ఎగ్మోరు |
| / జ్ఞా / | | విజ్ఞానం |
| / ట్న / | | కట్నం |
| / డ్న / | | ఇక్కడ్నే |
| / త్న / | | రత్నం |
| / త్మ / | | ఆత్మ |
| / ద్మ / | | పద్మ |
| **స్పర్శం** | **+** | **ఊష్మం** |
| / క్స / | | యాక్సిడెంట్ |
| / క్ష / | | లక్షణం |
| / డ్స / | | లోడ్సు |
| **స్పర్శం** | **+** | **పార్శ్వికం** |
| / ట్ల / | | పోట్లాట |
| **స్పర్శం** | **+** | **తాడితం** |
| / క్ర / | | సంక్రాంతి |
| / గ్ర / | | టెలిగ్రాం |
| / ట్ర / | | వెంట్రుకలు |
| / డ్ర / | | కండ్రావి |

| | |
|---|---|
| / త్ర / | చైత్రం |
| / ద్ర / | మద్రాసు |
| / భ్ర / | శుభ్రం |

**స్పర్శం + అర్థాచ్చు**

| | |
|---|---|
| / క్వ / | పక్వం |
| / క్య / | ముఖ్యం |
| / గ్య / | బాగ్యం |
| / గ్వ / | లాంగ్వేజి |
| / జ్య / | రాజ్యం |
| / డ్య / | ఇండువిడ్యువల్ |
| / డ్వ / | అడ్వాన్సు |
| / త్య / | వెత్యాసం |
| / త్వ / | మానవత్వం |
| / ద్య / | సేద్యం |
| / బ్యా / | అబ్యాసం |

**అనునాసికం + స్పర్శం**

| | |
|---|---|
| / ఙ్క / | నూంకలు |
| / ఙ్గ / | అంగడి |
| / ఞ్చ / | పంచాంగ |
| / ణ్ట / | పాంట |
| / ణ్డ / | కుండ |
| / న్త / | పొంత |
| / న్ద / | అందం |
| / న్వ / | కాన్వ |
| / మ్బ / | నోంబు |

**అనునాసికం + ఊష్మం**

| | |
|---|---|
| / ంస / | సంసారం |
| / న్సి / | కౌన్సిలర్ |

| | |
|---|---|
| **అనునాసికం +** | **పార్శ్వికం** |
| / న్ల / | టిపిన్లు |
| **అనునాసికం +** | **తాడితం** |
| / న్ర / | ఉన్రు |
| **అనునాసికం +** | **అర్ధాచ్చు** |
| / ణ్య / | పుణ్యం |
| / న్య / | అన్యాయం |
| / న్వ / | కన్వీనియంట్ |
| / ంవ / | సంవత్సరం |
| **పార్శ్వికం +** | **ఊష్మం** |
| / ల్స / | నిల్సుకోని |
| **పార్శ్వికం +** | **అర్ధాచ్చు** |
| / ల్య / | కల్యాణం |
| / ల్వ / | చెంగల్వ |
| **తాడితం +** | **స్పర్శం** |
| / ర్క / | ఎదుర్కొ |
| / ర్గ / | మార్గము |
| / ర్చ / | కర్చు |
| / ర్జ / | సర్జరీ |
| / ర్టి / | పార్టీ |
| / ర్డ / | బోర్డు |
| / ర్త / | ప్రవర్తన |
| / ర్ధ / | స్పర్ధ |
| / ర్వ / | ఎదుర్వు |
| / ర్భ / | సందర్భం |
| **తాడితం +** | **అనునాసికం** |
| / ర్న / | గవర్నమెంటు |
| / ర్మ / | దర్మం |

**తాడితం + ఊష్మం**

| | |
|---|---|
| / ర్స / | పర్సనాలిటి |

**తాడితం + పార్శ్వికం**

| | |
|---|---|
| / ర్ల / | అయ్యోర్లు |

**తాడితం + అర్ధాచ్చు**

| | | |
|---|---|---|
| / ర్య / | + | కార్యం |
| / ర్వ / | | నిర్వాగం |

**పరహనుమూలీయం + అనునాసికం**

| | |
|---|---|
| / హ్న / | మధ్యాహ్నం |
| / హ్మ / | బ్రాహ్మణులు |

**పరహనుమూలీయం + అర్ధాచ్చు**

| | |
|---|---|
| / హ్వ / | ఆహ్వానం |

**5.10.4 ప్రా.తె. లోని పదాది సంయుక్తాలు మ. తె. లో అసంయుక్తాలుగా మారడం.**

**పదాది :**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్ర | > | ప | ప్రొద్దు | > | పొద్దు |
| బ్ర | > | బ | బ్రతుకు | > | బతుకు |
| వ్ర | > | ర | వ్రాయు | > | రాయు |
| వ్య | > | వి | వ్యవసాయం | > | వివసాయం |

**5.10.5 ప్రా. తె. లోని పద మధ్య సంయుక్తాలు మ.తె. లో అసంయుక్తాలుగా మారడం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ట్ర | > | ట | వెంట్రుకలు | > | ఎంటికలు |
| ట్ల | > | ట | మాట్లాడు | > | మాటాడు |
| స్య | > | స | అమావాస్య | > | అమావాసి |
| హ్మ | > | ప | బ్రాహ్మణులు | > | బాపనోల్లు |

**5.10.6:** ప్రా. తె. లో పదాంత సంయుక్తాలు లేవు గాని మ. తె. లో అన్య భాషా

ప్రభావం వల్ల రెండు హల్లుల సంయుక్తాలు మూడు హల్లుల సంయుక్తాలు కనబడుతున్నాయి. మ. తె. లో పదాంత రెండు వర్ణాల సంయుక్తాలు మొత్తం 10 వాటిని 8 వర్గాలుగా విభజించడం జరిగింది.

| | | |
|---|---|---|
| **స్పర్శం** | **+** | **అనునాసికం** |
| / క్ట్ / | | స్ట్రిక్ట్ |
| **స్పర్శం** | **+** | **ఊష్మం** |
| / క్స్ / | | బుక్స్ |
| / గ్స్ / | | కొలీగ్స్ |
| **అనునాసికం** | **+** | **ఊష్మం** |
| / న్స్ / | | ప్రిఫరన్స్ |
| / మ్స్ / | | ట్రామ్స్ |
| **ఊష్మం** | **+** | **స్పర్శం** |
| / స్ట్ / | | కాస్ట్ |
| **తాడితం** | **+** | **స్పర్శం** |
| / ర్ట్ / | | ట్రాన్స్‌పోర్ట్ |
| **తాడితం** | **+** | **ఊష్మం** |
| / ర్స్ / | | బ్రదర్స్ |
| **పార్శ్వికం** | **+** | **అర్థాచ్చు** |
| / ల్స్ / | | అంకుల్స్ |
| **అర్థాచ్చు** | **+** | **ఊష్మం** |
| / వ్స్ / | | రిలేటివ్స్ |

### 5.10.7 పదాది మూడు హల్లుల సంయుక్తాలు

| | | | | |
|---|---|---|---|---|
| **ఊష్మం** | **+** | **స్పర్శం** | **+** | **తాడితం** |
| / స్త్ర / | | స్ట్రీట్ | | |
| **ఊష్మం** | **+** | **స్పర్శం** | **+** | **పార్శ్వికం** |
| / స్లు / | | స్ప్లిట్ | | |

## 5.10.8 పదమధ్య మూడు హల్లుల సంయుక్తాలు

**అనునాసికం + స్పర్శం + తాడితం**

/ంట్ర/ ఉంట్రు

/ండ్ర/ చేస్తుండ్ర

/ంద్ర/ ఆంద్రా

/ంప్ర/ ఇంప్రూమెంట్

**అనునాసికం + స్పర్శం + పార్శ్వికం**

/ంగ్ల/ ఇంగ్లీషు

/ంట్ల/ ఇంట్లో

/ండ్ల/ పెండ్లి

**అనునాసికం + స్పర్శం + అర్ధాచ్చు**

/ంగ్య/ సాంగ్యాలు

**ఊష్మం + స్పర్శం + తాడితం**

/స్ట్ర/ డిస్ట్రిక్ట్

/స్త్ర/ ఇస్త్రీ

**తాడితం + స్పర్శం + అర్ధాచ్చు**

/ర్త్య/ సామర్త్యం

**తాడితం + అర్ధాచ్చు + స్పర్శం**

/ర్వ్డ/ రిజర్వ్డ

## 5.10.9 పదాంత మూడు హల్లుల సంయుక్తాలు

**స్పర్శం + స్పర్శం + ఊష్మం**

/క్ట్స్/ కాంట్రాక్ట్స్

**స్పర్శం + ఊష్మం + స్పర్శం**

/క్స్ట్/ నెక్స్ట్

అనునాసికం + స్పర్శం + ఊష్మం

/ ండ్స్ / ఫ్రెండ్స్

## 5.11.0 ధ్వని సూత్రాలు

మ. తె. లో వచ్చిన ధ్వని మార్పుల్ని క్రింది విధంగా సూత్ర బద్ధం చేయవచ్చు.

## 5.11.1 వర్ణ సమీకరణం

భిన్న లక్షణాలు కలిగిన రెండు వర్ణాలు ఏక లక్షణం గల వర్ణాలుగా మారడం వర్ణ సమీకరణం. ఇది మూడు విధాలు. A. పురోగామి B. తిరోగామి C. పరస్పరం.

### 5.11.1.1 పురోగామి వర్ణ సమీకరణం

పూర్వ పదంలోని వర్ణ ప్రభావం వల్ల పర పదంలోని వర్ణం మారడాన్ని పురోగామి వర్ణ సమీకరణం అంటారు.

ఉదా :- నంబిక > నమ్మిక

సంవత్సరం > సమ్మచ్చరం

పూర్వ పదం లోని 'మ'కార ప్రభావం వల్ల పర పదంలోని 'బ'కారం 'మ'కారంగా మారి నంబిక > నమ్మిక అయ్యింది. అదే విధంగా సంవత్సరంలోని 'వ'కారం 'మ'కారంగా మారి సమ్మచ్చరం అయ్యింది.

### 5.11.1.2 తిరోగామి వర్ణ సమీకరణం

పర వర్ణ ప్రభావం వల్ల పూర్వ వర్ణం పొందే మార్పుని తిరోగామి వర్ణ సమీకరణం అంటారు.

ఉదా :- బ్రాహ్మణులు > బ్రామ్మలు

మూడు + నూరు > మున్నూరు

పర వర్ణమైన 'మ'కార ప్రభావం వల్ల పూర్వ వర్ణమైన 'హ'కారం 'మ'కారంగా మారి బ్రాహ్మణులు బ్రామ్మలుగా మారింది. అదే విధంగా 'న'కార ప్రభావం వల్ల 'డ'కారం 'న'కారంగా మారి మూడు నూరు మున్నూరుగా మారింది.

### 5.11.1.3 పరస్పర వర్ణ సమీకరణం

పూర్వ వర్ణం, పర వర్ణం ఒకదాని నొకటి ప్రభావితం చేయడం పరస్పర వర్ణ సమీకరణ మవుతుంది.

పుణ్యం > పున్నియం

ప్రశ్న > ప్రచ్చిన

## 5.11.2 వర్ణాదేశం

రెండు పదాల్ని కలిపి ఉచ్చరించేటప్పుడు ఆ రెండు పదాల మధ్యలో ఒక వర్ణానికి బదులు వేరొక వర్ణం వచ్చి చేరడాన్ని వర్ణాదేశమంటారు.

సొంత + వాళ్ళు > సొంత పోల్లు

పద హోరు > పదగారు

పిలకాయలు > పిలగాయలు

'సొంతవాళ్ళు' లో 'వ'కారానికి బదులు 'ప'కారం పదహోరులో 'హ'కారానికి బదులు 'గ'కారం 'పిల్లకాయలు' లో 'క'కారానికి బదులు 'గ'కారం ఆదేశంగా వచ్చాయి.

## 5.11.3 వర్ణాగమం

రెండు పదాల్ని కలిపి ఉచ్చరించేటప్పుడు వాటి మధ్య అధికంగా ఇంకొక వర్ణం రావడాన్ని వర్ణాగమం అంటారు.

ఉదా :- మా + అక్క > మాయక్క

చేయు + ఆలి > చేయాలి

పై పదాల్లో 'య్' : 'వ్' వర్ణాలు ఆగమాలుగా వచ్చాయి.

## 5.11.4 వర్ణ నాశం

ఒక పదాన్ని త్వరితంగా ఉచ్చరించేటప్పుడు పద మధ్యాచ్చు లోపించి రెండు వర్ణాలు సంశ్లేషించడం జరుగుతుంది. దీన్ని వర్ణనాశం లేక వర్ణ లోపం అంటారు.

ఉదా :- కలిపి > కల్పి

మాలును > మాల్ను

'కలిపి' లోని పద మధ్య 'ఇ' కారం లోపించి 'కల్పి' అనే సంశ్లేషరూపం, 'మాలును' లోని పద మధ్య 'ఉ'కారం లోపించి 'మాల్ను' అనే రూపాలు ఏర్పడ్డాయి.

## 5.11.5 అక్షర లోపం

రెండు పదాలు కలిసేటప్పుడు మధ్యంలో ఒక అక్షరం లోపిస్తే దాన్ని అక్షర లోపమని అంటారు.

ఉదా :- బాగు + లేక > బాలేక

దీప + వళి > దీబాలి

రవిక + గుడ్డ > రయిగ్గుడ్డ

'బాగులేక' లో 'గు' : 'దీపావళి'లో 'ప' 'రవికగుడ్డ'లో 'వ' లోపించి బాలేక, దీబాలి రయిగ్గుడ్డ రూపాలు ఏర్పడ్డాయి.

### 5.11.6 స్వర భక్తి

సంయుక్తాక్షరాల మధ్య ఒక అచ్చు వచ్చి చేరడాన్ని స్వర భక్తి అని అంటారు. ప్రామాణిక భాషలో సంయుక్తాలుగా వుండి పద మధ్యలో అచ్చు చేరడం వల్ల మ. తె. లో అసంయుక్తాలుగా మారిన రూపాలున్నాయి.

ఉదా :- ప్రయోజనం > పిరియోజనం

ముఖ్యం > ముకియం

'ప్రయోజనం' లో 'ముఖ్యం'లో 'ఇ' చేరడం వల్ల 'పిరియోజనం' 'ముకియం' అనే రూపాలు ఏర్పడ్డాయి.

### 5.11.7 అనియతోచ్చారణ

కొన్ని సందర్భాల్లో ఒక వర్ణానికి బదులు మరో వర్ణం ఉచ్చరింప బడ్డప్పటికి ఆ పదంలో అర్థ సంబంధమైన మార్పు రాదు. ఒక వర్ణానికి బదులు మరో వర్ణం ఉచ్చరింప బడడాన్నే అనియతోచ్చారణ అని అంటారు.

ఉదా :- జాతి > జాది

పాఠం > పాడం

'జాతి' పదానికి ముందు 'ద్' పాఠం పదానికి ముందు 'డ్' చేరి జాది, పాడం రూపాలు ఏర్పడ్డాయి.

### 5.11.8 పూర్వశ్రుతి

పదాదిలో ఒక హల్లు ఎక్కువగా వచ్చి చేరడాన్ని పూర్వ శ్రుతి అని అంటారు.

ఉదా :- అన్నం > వన్నం

ఊరు > యూరు

ఊరు పదానికి ముందు 'య్', అన్నం పదానికి ముందు 'వ్' చేరి యూరు, న్నం రూపాలు ఏర్పడ్డాయి.

### .11.9 లోప దీర్ఘత

ఒక పదం లోని వర్ణం లోపించినప్పడు ఆ లోపాన్ని పూరించడానికి దానికి ుందున్న అచ్చుకు దీర్ఘం వస్తుంది. దాన్ని లోప దీర్ఘత అని అంటారు.

ఉదా :- అక్కడ > ఆడ

ఒకటి > ఓటి

'అక్కడ' లో 'క్క' అక్షరం లోపించడం వల్ల దానికి ముందున్న అచ్చు 'అ' కారానికి ర్ఘం వచ్చి 'ఆడ' అయ్యింది. అదే విధంగా 'ఒకటి' లో 'క' లోపించి 'ఒ' కారానికి దీర్ఘం చ్చి 'ఓటి' రూపమేర్పడింది.

### 5.11.10 ఊనిక

ప్రా. తె. లో అద్విరుక్తాలుగా ఉన్న రూపాలు ఊనిక వల్ల మ. తె. లో ద్విరుక్తాలుగా మారాయి.

ఉదా :- మంచిదే > మంచిద్దా

పోయేరు > పొయ్యేరు

### 5.11.11 పదాది హల్లు లోపం

పదంలోని మొదటి హల్లు లోపించడాన్ని పదాది హల్లు లోపం అని అంటారు. ఇది ద్రావిడ భాషలకు సహజ లక్షణం.

ఉదా :- హరిజనులు > అరిజనులు

వెనక > ఎనక

'హరిజనులు' లో పదాది 'హ్' లోపించి 'అరిజనులు'గా మారింది. అదే విధంగా 'వెనక' పదం లో 'వ్' లోపించి 'ఎనక' అయింది.

### 5.11.12 శ్వాస నాద భేదం లేక పోవడం

ప్రా. తె. లో శ్వాస ధ్వనులుగా ఉచ్చరింపబడ్డ ధ్వనులు కొన్ని మ. తె.లో నాద ధ్వనులుగా ఉచ్చరింప బడుతున్నాయి. దానికి కారణం అతి శోధనం (Hypercorrection).

ఉదా : - జ్ఞాపకం > జ్ఞాపగం

కొంచెం > కొంజుం

కుటుంబం > కుడుంబం

నీతి > నీది

దీపావళి > దీబావళి

**5.11.12.1** కొన్ని సందర్భాల్లో ప్రా..తె. లోని నాద ధ్వనులు మ. తె. లో శ్వాస ధ్వనులుగా ఉచ్చరింప బడుతున్నాయి. దీనికి కారణం తమిళ భాషా ప్రభావం.

ఉదా :- నలుగురు > నలుకురు

ఎదురుగా > ఎదుర్కా

తెలియకుండా > తెలీకుంటా

డబ్బు > డప్పు

వీబూది > వీపూది

### 5.11.13 మహా ప్రాణం అల్ప ప్రాణంగా ఉచ్చరింప బడడం

తమిళంలో మహా ప్రాణోచ్ఛారణ లేనందువల్ల మ.తె. లో కూడా మహా ప్రాణాలు అల్ప ప్రాణాలుగా ఉచ్చరింప బడుతున్నాయి.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | శంఖం | > | శంకు |
| | ఖర్చు | > | కర్చు |
| | సంఘం | > | సంగం |

### 5.11.14 దీర్ఘం మీద అనుస్వారోచ్ఛారణ

ప్రా. తె. లో దీర్ఘం మీద పూర్ణాను స్వారోచ్ఛారణ లేదు. మ. తె. లో దీర్ఘం మీద పూర్ణాను స్వారోచ్ఛారణ వినిపిస్తుంది. ఇటువంటి సందర్భాల్లో మ. తె. ప్రాచీన తెలుగు రూపాల్ని నిలుపుకుందని చెప్పవచ్చు.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | ప్రా. తె. | - | మ. తె. |
| | కూతురు | - | కూంతురు |
| | పాత | - | పాంత |
| | మీద | - | మీంద |

**5.12** మద్రాసు తెలుగులో వచ్చిన పదాది, పద మధ్య, పదాంత ధ్వని మార్పుల్ని పరిశీలిస్తే వర్ణ సమీకరణం, వర్ణాదేశం, వర్ణాగమం, వర్ణ నాశనం, అక్షర లోపం, స్వర భక్తి, అనియతోచ్ఛారణ, లోప దీర్ఘత, ఊనిక, పదాది హల్లోపం, శ్వాస, నాద భేదం పాటింపక పోవడం, మహాప్రాణోచ్ఛారణ లేక పోవడం, దీర్ఘం మీద అనుస్వారోచ్ఛారణ, శ్వాస ద్విత్వాలు నాద ద్విత్వాలుగా ఉచ్చరింపబడడం లాంటి ధ్వని మార్పులకు గురి అయినట్లు తెలస్తుంది.



N. B. : ప్రా. తె. లోను మ. తె. లోని ద్విత్వాల సంయుక్తాల వివరాలను తరువాత పేజీ పట్టికలో చూడవచ్చు.

## ప్రామాణిక తెలుగులోని పద మధ్య ద్విత్వాలు

| | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న | ప | ఫ | బ | భ | మ | య | ర | ల | ళ | వ | శ | ష | స | హ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | + | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఖ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| గ | | | + | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఘ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఙ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| చ | | | | | | + | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఛ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| జ | | | | | | | | + | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఝ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఞ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ట | | | | | | | | | | | + | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఠ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| డ | | | | | | | | | | | | | + | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఢ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ణ | | | | | | | | | | | | | | | + | | | | | | | | | | | | | | | | | | | |
| త | | | | | | | | | | | | | | | | + | | | | | | | | | | | | | | | | | | |
| థ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ద | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | | | | | | | | | |
| ధ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| న | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | | | | | | | |
| ప | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | | | | | | |
| ఫ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| బ | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | | | | |
| భ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| మ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | | |
| య | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | |
| ర | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | |
| ల | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | |
| ళ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | |
| వ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | |
| శ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | |
| ష | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| స | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | |

# మద్రాసు తెలుగులోని పద మధ్య ద్విత్వాలు-II

| | క | గ | ఙ | చ | జ | ఝ | ట | డ | ణ | త | ద | న | ప | ఫ | బ | మ | య | ర | ల | ళ | వ | శ | ష | స | హ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | + | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| గ | | + | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఙ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| చ | | | | + | | | | | | | | | | | | | | | | | | | | | |
| జ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఝ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ట | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| డ | | | | | | | + | | | | | | | | | | | | | | | | | | |
| ణ | | | | | | | | + | | | | | | | | | | | | | | | | | |
| త | | | | | | | | | + | | | | | | | | | | | | | | | | |
| ద | | | | | | | | | | + | | | | | | | | | | | | | | | |
| న | | | | | | | | | | | + | | | | | | | | | | | | | | |
| ప | | | | | | | | | | | | + | | | | | | | | | | | | | |
| ఫ | | | | | | | | | | | | | + | | | | | | | | | | | | |
| బ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| మ | | | | | | | | | | | | | | + | | | | | | | | | | | |
| య | | | | | | | | | | | | | | | + | | | | | | | | | | |
| ర | | | | | | | | | | | | | | | | + | | | | | | | | | |
| ల | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | |
| ళ | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | |
| వ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| శ | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | |
| ష | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| స | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| హ | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | |

# ప్రామాణిక తెలుగులోని పదాది సంయుక్తాలు- III

| | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న | ప | ఫ | బ | భ | మ | య | ర | ల | ళ | వ | శ | ష | స | హ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | + | | |
| ఖ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| గ | | | | | | | | | | + | | | | | | | | | | | | | | | | | + | | | | | | | |
| ఘ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఙ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| చ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఛ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| జ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | + | | | | |
| ఝ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఞ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ట | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఠ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| డ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఢ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ణ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| త | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | + | | | + | | | | |
| థ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ద | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | + | | | | |
| ధ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | |
| న | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | |
| ప | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | |
| ఫ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | + | | | | | | |
| బ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | |
| భ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | |
| మ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| య | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ర | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ల | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ళ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| వ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | + | | | | | | | |
| శ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | + | + | | | | | | | |
| ష | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| స | | | | | | | | | | | | | | | + | + | | | + | + | | | | + | | | | | + | | | | |
| హ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |

## మద్రాసు తెలుగులోని పదాది సంయుక్తాలు-IV

| | క | గ | ఙ | చ | జ | ఞ | ట | డ | ణ | త | ద | న | ప | ఫ | బ | మ | య | ర | ల | ళ | వ | శ | ష | స | హ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | | | | | | | | | | | | | | | | | | + | | | | | + | | |
| గ | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | |
| ఙ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| చ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| జ | | | | | | + | | | | | | | | | | | + | | | | + | | | | |
| ఞ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ట | | | | | | | | | | | | | | | | | | + | | | + | | | | |
| డ | | | | | | | | | | | | | | | | | + | + | | | | | | | |
| ణ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| త | | | | | | | | | | | | | | | | | + | + | | | | | | | |
| ద | | | | | | | | | | | | | | | | | + | + | | | + | | | | |
| న | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | |
| ప | | | | | | | | | | | | | | | | | + | + | + | | | | | | |
| ఫ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| బ | | | | | | | | | | | | | | | | | + | + | | | | | | | |
| మ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| య | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ర | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ల | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ళ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| వ | | | | | | | | | | | | | | | | | + | + | | | | | | | |
| శ | | | | | | | | | | | | | | | | + | | + | | | | | | | |
| ష | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| స | + | | | | | | + | | | + | | + | + | | | | | + | | | + | | | | |
| హ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |

## ప్రామాణిక తెలుగులోని పద మధ్య సంయుక్తాలు -V

| | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న | ప | ఫ | బ | భ | మ | య | ర | ల | ళ | వ | శ | ష | స | హ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | | | | | | | | | | | | | | | | + | | | | | | | | | + | + | + | + | | + | | + | | |
| ఖ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | |
| గ | | | | | | | | | | + | | | | | | | | | | + | | | | | | + | + | | | + | | | | |
| ఘ | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | + | | | | | | | |
| ఙ | + | + | + | + | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| చ | | | | | | | + | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఛ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| జ | | | | | | | | | + | | | | | | | | | | | | | | | | | + | + | | | | | | | |
| ఝ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఞ | | | | | | + | | + | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ట | + | | | | | | | | | | | | | | + | | | | | | | | | | | + | | + | | | | | | |
| ఠ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| డ | | | | | | + | | | | | | | | | | + | | | | | | | | | | + | + | + | | + | | | | |
| ఢ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ణ | | | | | | | | | | | + | + | + | | | | | | | | | | | | | + | | | | | | | | |
| త | + | | | | | | | | | | | | | | | | | | | + | | | | | + | + | + | | | + | | | + | |
| థ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ద | | | | | | | | | | | | | | | | | | | + | + | | | | | + | + | + | | | | | | | |
| ధ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | + | | | | |
| న | | | | | | | | | | | | | | | | + | | + | + | | + | | | | + | + | | + | | + | | | | |
| ప | | | | | | | | | | | | | | | | + | | | | | | | | | | + | + | | | | | | + | |
| ఫ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| బ | | | | | | | | | | | | | | | | | | + | | | | | | + | | + | + | | | | | | | |
| భ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| మ | + | | | | | + | | | | | | | | | | | | | | + | + | | + | + | | + | + | + | | + | + | | + | + |
| య | | | | | | | | + | | | + | | | | | + | | + | | + | + | | + | | | | + | + | | + | | | + | |
| ర | + | + | + | + | | + | + | + | | | | | | | + | + | + | + | + | | + | + | + | + | + | + | | + | | + | | + | | + |
| ల | + | | + | | | + | | | | | | | | | | + | | + | | + | + | | | | + | + | | | | + | | | + | |
| ళ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | | | |
| వ | + | | | | | | | | | | | | + | | | | | + | | + | | | | | | + | + | | | | | | | |
| శ | | | | | | + | | | | | | | | | | | | | | + | | | | | | | + | | | + | | | | |
| ష | + | | | | | | | | | | + | + | | | + | | | | | | | | | | + | + | | | | | | | | |
| స | + | | | | | | | | | | | | | | | + | + | | | | + | | | | + | + | | | | + | | | | |
| హ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | | + | | + | | | | |

# మద్రాసు తెలుగులోని పదమధ్య సంయుక్తాలు-VI

| | క | గ | ఙ | చ | జ | ఝ | ట | డ | ణ | త | ద | న | ప | ఫ | బ | మ | య | ర | ల | ళ | వ | శ | ష | స | హ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | | | | + | | | + | | | + | | | | | | | + | + | | | + | | + | + | |
| గ | | | | | + | | | | | | | + | | | | + | + | + | | | + | | | | |
| ఙ | + | + | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| చ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| జ | | | | | | + | | | | | | | | | | | + | | | | | | | | |
| ఝ | | | | + | | | | | | | | | | | | | | | | | | | | | |
| ట | | | | | | | | | | | | + | | | | | | + | + | | | | | | |
| డ | | | | + | + | | | | | + | | + | | | | | + | + | | | + | | | + | |
| ణ | | | | | | | + | + | | | | | | | | | + | | | | | | | | |
| త | + | | | | | | | | | | | + | | | | + | + | + | | | + | | | + | |
| ద | | | | | | | | | | | | | | | | + | + | + | | | | | | | |
| న | | | | | | | | | | + | + | | + | | | | + | + | + | | + | | | + | |
| ప | | | | | | | | | | + | | | | | | | | | | | | | | | |
| ఫ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| బ | | | | | | | | | | | + | | | | | | + | + | | | | | | | |
| మ | | | | | | | | | | | | | | | + | | | | | | + | | | + | |
| య | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ర | + | + | | + | + | | + | + | | + | + | + | + | | + | + | + | | + | | + | | | + | |
| ల | | | | | | | | | | | | | + | | | | + | | | | + | | | + | |
| ళ | | | | | | | | | | | | | | | | | | | + | | | | | | |
| వ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| శ | | | | + | | | | | | | | | | | | | | | | | + | | | | |
| ష | | | | | | | + | | | | | | | | | | | | | | | | | | |
| స | + | | | | | | | | | + | | | | | | | | | | | | | | | |
| హ | | | | | | | | | | | | + | | | | + | | | | | + | | | | |

## మద్రాసు తెలుగులోని పదాంత సంయుక్తాలు -VII

| | క | గ | ఙ | చ | జ | ఞ | ట | డ | ణ | త | ద | న | ప | ఫ | బ | మ | య | ర | ల | ళ | వ | శ | ష | స | హ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | | | | | | | + | | | | | | | | | | | | | | | | | + | |
| గ | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | |
| ఙ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| చ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| జ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఞ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ట | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| డ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ణ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| త | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ద | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| న | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | |
| ప | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఫ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| బ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| మ | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | |
| య | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ర | | | | | | | + | | | | | | | | | | | | | | | | | + | |
| ల | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | |
| ళ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| వ | | | | | | | | | | | | | | | | | | | | | | | | + | |
| శ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ష | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| స | | | | | | | + | | | | | | | | | | | | | | | | | | |
| హ | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |

# 6. రూప నిర్మాణం

## 6.1.0 మద్రాసు తెలుగు నామవాచక ప్రాతిపదికలు

మద్రాసు తెలుగు నామవాచక ప్రాతిపదికలను రెండు విధాలుగా విభజింపవచ్చు. సామాన్య నామ వాచక ప్రాతి పదికలు, నిష్పన్న నామవాచక ప్రాతిపదికలు.

6.1.0.1 సామాన్య వాచక ప్రాతిపదికలను ప్రాణి వాచక ప్రాతిపదికలు, అప్రాణి వాచక ప్రాతిపదికలు అని రెండు విధాలుగా విభజింప వచ్చు.

ప్రాణి వాచక ప్రాతి పదికల్ని ప్రాణవాచక ప్రాతిపదికలు, వ్యక్తినామ ప్రాతి పదికలు అని రెండు విధాలుగా విభజింపవచ్చు.

6.1.0.2 నిష్పన్న నామవాచక ప్రాతి పదికల్ని లింగద్యోతక సహిత ప్రాతి పదికలు, తద్ధిత ప్రత్యయంతో కూడిన ప్రాతి పదికలు, కృదంత రూపాలతో కూడిన ప్రాతిపదికలు అని మూడు విధాలుగా విభజింప వచ్చు.

6.1.0.1.1 ప్రాణి వాచకాలు :-

6.1.0.1.1.1 వ్యక్తినామాలు :-

6.1.0.1.1.1.1 మద్రాసు తెలుగులో కుల సూచక నామ వాచకాలు పురుష బోధక ప్రత్యయంతో కూడి వ్యవహరింప బడుతున్నాయి.

ఉదా : కృష్ణ + రెడ్డి = కృష్ణారెడ్డి

కోదండపాణి + నాయుడు = కోదండపాణి నాయుడు

6.1.0.1.1.1.2 తెలుగులో మహద్వాచక పుంలింగప్రత్యయం "డు". మ. తె. లో 'డు' ప్రత్యయానికి బదులుగా తమిళ ప్రత్యయమైన 'అన్' కనబడుతోంది.

ఉదా : చెంగల్వరాయన్, ఈశ్వరన్

6.1.0.1.1.1.3 మ. తె. లో అయ్య, అన్న, అప్ప అనే బంధు వాచకాలు పురుష బోధక ప్రత్యయాలుగా వాడబడుతున్నాయి.

ఉదా : తంబయ్య, కన్నప్ప, శేగరన్న

6.1.0.1.1.1.4 కుల సూచక నామాలపై అప్ప ప్రత్యయం పురుష బోధక ప్రత్యయంగా వాడబడుతోంది.

ఉదా : రెడ్డప్ప

6.1.0.1.1.1.5 దైవ సూచక నామంపై తమిళ పురుష బోధక ప్రత్యయం 'ఆళ్' వాడబడుతోంది.

ఉదా : వెంగటేశ పెరుమాళ్

### 6.1.0.1.1.1.6 స్త్రీ బోధక ప్రత్యయాలు

అమ్మ అనే బంధు వాచకం స్త్రీ భోదక ప్రత్యయంగా వాడబడుతోంది.

ఉదా : పెంచలమ్మ

6.1.0.1.1.1.7 ప్రత్యయ రహితమైన నామ ప్రాతి పదికలు ప్రా. తె. లో వున్న ప్రత్యయ రహితమైన నామ ప్రాతి పదికలు మ. తె. లో కూడా ప్రత్యయ రహితమైన నామ వాచకాలు గానే ప్రయోగింప బడుతున్నాయి.

ఉదా : సావిత్రి, చంద్రశేఖర్

6.1.0.1.1.2 వృత్తి నామవాచకాలు

ఉదా : అయ్యోరు, నర్సమ్మ

6.1.0.1.2 అప్రాణి వాచకాలు

వీడు (ఇల్లు), అంగడి, బస్సు

### 6.1.0.2 నిష్పన్న నామవాచక ప్రాతిపదికలు

6.1.0.2.1 లింగ ద్యోతక సహిత ప్రాతిపదికలు

6.1.0.2.1.1 పురుష బోధక ప్రత్యయం

6.1.0.2.1.1.1 తెలుగు ప్రత్యయం ండు, డు.

ఉదా : తమ్ముండు - తమ్ముడు

మనుమండు - మనుమడు

ఒకండు - ఒకడు

6.1.0.2.1.1.2 తమిళ ప్రాతిపదికలపై తమిళ పురుష బోధక ప్రత్యయాలు.

ఉదా : తచ్చవన్, కొలుత్తవన్

తయ్యల్ కారన్, కొలుత్తు కారన్

6.1.0.2.1.2 స్త్రీ బోధక ప్రత్యయాలు

ఉదా : అలు - ఆలు

కోడలు - కోడాలు

మనుమరాలు

తె - తి

ఒకతె - ఒకతి

కత్తె

సొగసు కత్తె

6.1.0.2.2 తద్ధిత రూపాలు

| | |
|---|---|
| భావార్థం | <u>తనం</u> |
| పోగిరి | తనం |
| మొరడు | తనం |

<u>రికం</u>

కోడరికం

పేదరికం

పుంలింగ నామ వాచకాల మీద 'గాడు' 'కాయ' ప్రత్యయాలు చేరుతున్నాయి.

పిలగాడు, పిలకాయ

తమిళ ప్రాతిపదికలపై 'డు' మహద్వాచక ప్రత్యయంగా వాడ బడుతోంది.

ఉదా : ఈశ్వరుడు

కులద్యోతక పుంలింగ నామాలపై 'వాడు' ప్రత్యయం వస్తుంది.

| | | |
|---|---|---|
| మాదిగ + వాడు | = | మాదిగోడు |
| బాపన + వాడు | = | బాపనోడు |
| మాల + వాడు | = | మాలోడు |

స్త్రీ వాచకాలపై తమిళ ప్రత్యయం 'కారి' వస్తుంది.

| | | |
|---|---|---|
| బిచ్చ + కారి | = | బిచ్చకారి |
| పంజం + కారి | = | పంజకారి |

| | |
|---|---|
| <u>ఇయం</u> | సామర్థియం |
| <u>బడి</u> | మొక్కుబడి |
| <u>వాసి</u> | వెలవాసి |
| <u>ఇదం</u> | స్నేగిదం |
| <u>వుడు</u> | రవుడు |

6.1.0.2.3 కృదంత రూపాలు

క్రియలకి ప్రత్యయం చేరడం వల్ల యేర్పడే నామవాచకాల్ని కృదంత రూపాలంటారు. ప్రా. తె. లో కొన్ని పదాలు క్రియార్థంలోను నామ వాచకం లోను వాడబడుతున్నాయి. మ. తె. లో కూడా అలాంటి పదాలు కొన్ని కన్పిస్తున్నాయి.

ఉదా : చెప్పు, చదువు, అడుగు, పొయ్యి

భావార్థక ప్రత్యయం 'అడం' మ. తె. లో కన్పిస్తూంది.

ఉదా : చెప్పడం, చదవడం, అడగడం, పొయ్యడం

'కలుపు' అనే క్రియపై 'అడం' ప్రత్యయం చేరడం వల్ల కల్పడం (Mixed) అనే తమిళ రూపం ఏర్పడింది.

మ. తె. లో 'అటం' అనే ప్రత్యయం భావార్థంలో వాడబడటంలేదు. కారణం తమిళ భాషా ప్రభావం. మ. తె. లో కొన్ని సందర్భాల్లో 'అడం' ప్రత్యయానికి బదులుగా 'ఏది' ప్రత్యయం వాడబడుతోంది.

ఉదా : చూసేది, చేసేది, తీసేది, రాసేది. మొదలైనవి. ఇవి ఆక్రియారూపాల నుండి ఏర్పడ్డాయి. వీటి సామ్యం వల్ల నోండేవి, సమ్మాళించేది లాంటి రూపాలు ఏర్పడ్డాయి.

కృత్ప్రత్యయమైన 'ఇక' చేరేటప్పుడు ధాతువులోని చివరి అచ్చు సంధి కార్యం వల్ల లోపించడం జరుగుతోంది.

ఇక

నమ్మిక, కోరిక, వాడిక

మానం

వరుమానం

## 6.1.1 సర్వనామాలు

నామవాచకాలకు బదులుగా వాడబడేవి సర్వనామాలు. వీటికి కూడా లింగ వచన విభక్తి ప్రత్యయాలు చేరుతాయి.

## మద్రాసు తెలుగులో సర్వనామాలు

6.1.1.1 యుష్మదర్థక సర్వనామాలు

ఎ) అస్మ దర్థక ఏకవచనం - నాను, నేను

బి) అస్మ దర్థక బహువచనం - మేము

గౌరవార్థంలో 'మన' అస్మ దర్థక సర్వనామంగా వాడబడుతోంది.

సి) యుష్మ దర్థక ఏక వచనం - నువ్వు

డి) యుష్మ దర్థక బహువచనం - మీరు

సి) ఉభయార్థకం - మనం - నాము

### 6.1.1.2 నిర్దేశక సర్వనామాలు :

మ. తె. లో పుంలింగ ఏక వచన సర్వనామాలు, వాడు, వీడు, వాండు, వీండు అనే ప్రాచీన రూపాలు కూడా వాడ బడుతున్నాయి.

స్త్రీలింగ ఏకవచన సర్వనామాలు, ఆపె, ఈపె అనే ప్రాచీన రూపాలు వాడ బడుతున్నాయి.

మనుష్య వాచక బహు వచన సర్వనామాలు వాల్లు, వీల్లు గౌరవార్థంలో కూడా వాడబడుతున్నాయి.

మ. తె. లో మనుష్యేతర బహువచన రూపాలైన అవి, ఇవి స్త్రీ లింగం లో వాడారు. అది, ఇది ఏక వచన నిర్దేశక సర్వనామాలు స్త్రీలింగ సర్వనామాలుగా వాడబడుతున్నాయి.

ఆత్మార్థక ఏకవచన సర్వనామం 'తను' మ. తె. లో స్త్రీలింగ ద్యోతకంగా మాత్రమే వాడబడుతోంది.

### 6.1.1.3 ద్వితీయాది విభక్త్యంగ సర్వనామాలు

| | | |
|---|---|---|
| అస్మ దర్థక ఏక వచనం | - | నన్ |
| నన్ + నించి | - | నన్నించి |
| అస్మ దర్థక బహువచనం | - | మమ్ము |
| మమ్ముల్ + నించి | - | మమ్ముల్నించి |
| యుష్మ దర్థక ఏక వచనం | - | నిన్ |
| నిన్ + నించి | - | నిన్నించి |
| యుష్మ దర్థక బహువచనం | - | మిమ్ము |
| మిమ్ముల్ + నించి | - | మిమ్ముల్నించి |

### నిర్దేశక సర్వనామాలు

వాడు + నించి = వాన్నించి, వాణ్ణించి

మనుష్య వాచక బహువచనం వాల్లు, ద్వితీయాది విభక్తుల ముందు వస్తుంది.

వాల్లను, వాల్లగూడ

పురుషేతర మనుష్యేతర ఏకవచనాలు, ద్వితీయావిభక్తి ప్రత్యయాల ముందు వాడ బడుతున్నాయి.

దాన్ + నించి = దాన్నించి

దీన్ + నించి = దీన్నించి

### 6.1.1.4 యత్కిమర్థక సర్వనామాలు

ఎవుడు, ఎవురు ద్వితీయాది విభక్తుల ముందు వస్తుంది.

ఎవురికి, ఎవుడికి

### 6.1.2 సంఖ్యా వాచకాలు

సంఖ్యా వాచకాలు నామ వాచకాల్లో ఒక భాగం. సంఖ్యా వాచకాలకి ప్రత్యయాలు చేర్చడం వల్ల నామ వాచక రూపాలు గాను ఔప విభక్తిక రూపాలు గాను, విశేషణాలు గాను ప్రయోగింప బడుతున్నాయి. ఈ సంఖ్యా వాచకాలు రెండు విధాలు 1) ప్రాథమిక సంఖ్యా వాచకాలు 2) సర్వ నామిక సంఖ్యా వాచకాలు.

మ. తె. లో సంఖ్యా వాచకాలు క్రింది విధంగా వున్నాయి.

6.1.2.1 ప్రాథమిక సంఖ్యా వాచకాలు

6.1.2.1.1 ఒకటి : ఒక పుంలింగ ఏక వచన 'డు' 'ండు' ప్రత్యయం ముందు నామ వాచకాల ముందు విశేషణంగా వాడబడుతోంది.

ఒకండు : స్త్రీలింగ ఏకవచన ప్రత్యయం తి. తె.

ఒకతి - ఒకతె

సంఖ్యా వాచకానికి విశేషణంగా

ఒక నూరు మందులు

ఒకటి : ఔపవిభక్తిక రూపం మ. తె. లో 'ఒణ్ణు' గా వాడ బడుతోంది. ఇది స్త్రీ పుంలింగాలకు రెంటికి వాడబడుతోంది.

ఒకటి > ఒణ్ణు

ఒణ్ణు వచ్చి, ఒకతొచ్చి, ఒకడొచ్చి

ఒకటి 'ఓటి' గా కూడా కన్పిస్తోంది.

ఓటీ లేదు.

ఒకటి సంఖ్యా వాచకంపై ద్వితీయాది విభక్తి ప్రత్యయం 'ని' కూడా కన్పడుతోంది.

ఒకటి > ఓటిని

బహువచన ప్రత్యయం 'రు' 'ఒక' పై ఏక వచనార్థంలో వాడబడుతోంది.

ఒక + రు = ఒకరు

6.1.2.1.2 రెండు : ఇడ్, ఇర్, ఇర లు 'రెండు' సంఖ్యా వాచకానికి విశేషణాలుగా వాడబడుతున్నాయి.

ఇద్ - మహద్వాచక బహువచన 'ఉరు' ప్రత్యయం ముందు వస్తోంది.

ఇద్ + ఉరు = ఇద్దరు

ఇన్ - నూరు సంఖ్యా వాచక ప్రాతి పదికకు విశేషణంగా వస్తోంది.

ఇన్ + నూరు = ఇన్నూరు.

ఇరు - 'పై' సంఖ్యావాచక ప్రాతిపదిక ముందు వస్తోంది.

ఇర + పై = ఇర్పై

రెండు కోడి, రెండు లచ్చం రూపాలుకూడా మ. తె. లో వున్నాయి. ఉప విభక్తి 'టి' చేరిన రూపం కూడ కనిపిస్తోంది. 'రెంటికి'

6.1.2.1.3 <u>మూడు :</u> మూడు సంఖ్యా వాచకానికి మున్ విశేషణంగా వచ్చి మున్ + నూరు = మున్నూరు రూపమేర్పడింది. ముప్ 'పై' అనే సంఖ్యా వాచకానికి ముందు వచ్చి ముప్పై రూపమేర్పడింది.

మూడు + నూరు = మున్నూరు రూపంకూడా కనబడుతోంది. ఉపవిభక్తి 'టి' చేరి 'మూటికి' రూపం కూడా ఏర్పడింది.

6.1.2.1.4 <u>నాలుగు</u> : నాలుగు సంఖ్యా వాచకానికి నలు, నా, నల, నాల్ అనే విశేషణ రూపాలు మ. తె. లో కనబడుతున్నాయి.

'నలు' మహద్వాచక బహువచన ప్రత్యయం 'గురు' కు పూర్వం వస్తోంది.

నలు + గురు = నలుగురు.

తమిళంలో శ్వాస నాద భేదం లేక పోవడం వల్ల, ఆ భాషా ప్రభావం వల్ల మ. తె. లో 'నలుకురు' రూపంకూడా ఏర్పడింది.

'నా' సంఖ్యా వాచక ప్రాతిపదిక 'నూరు' కు విశేషణంగా వచ్చి 'నానూరు' 'నన్నూరు' రూపాలేర్పడ్డాయి.

'నల' సంఖ్యా వాచకం తో కూడి 'నాలుగు లచ్చం' 'నాలుగు మందులు' రూపాలొచ్చాయి.

6.1.2.1.5 <u>ఐదు</u> : ఐదు సంఖ్యా వాచకానికి విశేషణ రూపాలు

'ఐ' 'యాం' 'య'

'ఐ' - నూరు సంఖ్యా వాచకం ముందు విశేషణంగా వస్తోంది.

ఉదా : ఐ నూరు

'యాం', 'యా' సంఖ్యా వాచకం అయిన 'పై'కి పూర్వం వస్తోంది.

యాంపై, యాపై, యాబై

ఐదు నూరు, పదైదు రూపాలు కూడా వ్యవహారంలో వున్నాయి.

6.1.2.1.6 <u>ఆరు</u> : 'అర' సంఖ్యా వాచకమైన 'పై' ముందు వచ్చి అర్పై, అరవై

రూపాలు ఏర్పడ్డాయి.

అర + పై = అరపై, అరవై

'గురు' అనే మహద్వాచక ప్రత్యయం ముందు 'ఆరు' చేరడం వల్ల 'ఆరుగురు' రూపం ఏర్పడింది. 'గురు' కు బదులుగా 'మంది' రావడం వల్ల మ. తె. లో తమిళ భాషా ప్రభావం వల్ల 'ఆరుమందిలు' రూపం ఏర్పడింది. ఇవేకాక ఆరు నూరు, పదారు రూపాలు కూడా కనబడుతున్నాయి.

6.1.2.1.7 ఏడు : ఏడు సంఖ్యా వాచకం మీద 'నూరు' వచ్చి 'ఏడు నూరు, గురు ప్రత్యయం చేరడం వల్ల ఏడుగురు రూపాలు ఏర్పడ్డాయి. 'డెబ్' అనే విశేషణం చేరడం వల్ల డెబ్ + పై = డెప్పై, డెబ్బై రూపాలు ఏర్పడ్డాయి.

6.1.2.1.8 ఎనిమిది : ఎనిమిది రూపానికి విశేషణాలు ఎన-ఎణ్. 'ఎన' సంఖ్యా వాచక మైన 'పై' ముందు వస్తోంది.

ఎన + పై = ఎనప్పై, ఎనబై

ఎన్ / ఎణ్ నూరు సంఖ్యా వాచకానికి పూర్వంలో వచ్చి ఎన్నూరు, ఎణ్ణూరు రూపాలు ఏర్పడ్డాయి.

6.1.2.1.9 తొమ్మిది : తొమ్మిది సంఖ్యా వాచకానికి విశేషణ రూపం 'తొం' ఇది 'పై' కి పూర్వంలో వచ్చి తొంపై, తొంబై రూపాలు వచ్చాయి.

6.1.2.1.10 పది : పది సంఖ్యా వాచకానికి విశేషణాలు పన్, పద్.

'పన్' రెండు సంఖ్యా వాచకానికి ముందు వస్తోంది.

పన్ + రెండు = పన్నెండు

నాలుగు, ఐదు, ఆరు, ఏడు, సంఖ్యావాచకాలకు పద్ విశేషణంగా వస్తుంది.

పద్ + నాలుగు = పద్నాలుగు
పద్ + ఐదు = పదైదు
పద్ + ఆరు = పదారు
పద్ + ఏడు = పదేడు

'ఆరు' సంఖ్యా వాచకానికి ముందు 'పద్' రావడం వల్ల పద్ + ఆరు = పదహారు పదగారు రూపాలు ఏర్పడు తున్నాయి. పదహారు, పదిహేడు 'హ' కారంతో కూడిన రూపాలు చాల కొద్దిమందిలో కనబడుతున్నాయి.

6.1.2.1.11 నూరు : మద్రాసు తెలుగులో 'వంద' రూపం కన్పడ్డంలేదు. దానికి బదులుగా నూరు సంఖ్యా వాచకం ప్రయోగింపబడుతోంది. నూరు కి 'నూట' విశేషణంగా వచ్చి నూట పది, నూట నాలుగు లాంటి సంఖ్యా వాచక రూపాలు వచ్చాయి. ఇన్నూరు, ఐనూరు, మున్నూరు రూపాలు కూడా మ. తె. లో కన్పడుతున్నాయి.

6.1.2.1.12 వెయ్యి : వెయ్యి, వేయి రెండు రూపాలు మ. తె. లో వున్నాయి. మ. తె. లో బహు వచనంగా కూడా 'వేలు' కు బదులుగావేయి వాడబడుతోంది.

ఉదా : నాలుగు వేలు > నాలుగు వేయి

రెండువేలు > రెండు వేయి

6.1.2.1.13 లక్ష : లచ్చగా వాడబడుతోంది. లచ్చం రూపం కూడా ఉంది. పది లచ్చ, పత్తు లచ్చం.

6.1.2.1.14 క్రోటి : తమిళ భాషలో శ్వాస నాద భేదం లేక పోవడం వల్ల ఆ భాషా ప్రభావం వల్ల మ. తె. లో కోడి రూపం ఏర్పడింది.

ఉదా : నాలు కోడి, రెండు కోడి

## 6.1.2.2 సార్వనామిక సంఖ్యా వాచకాలు

సంఖ్యా వాచకాలకి చివర పూరణార్థక ప్రత్యయాలు చేరడం వల్ల సార్వనామిక సంఖ్యా వాచకాలు ఏర్పడతాయి. మ. తె. లో 'ఓ' 'ఆమ్' 'అవదు' చేరడం వల్ల సార్వనామిక సంఖ్యా వాచకాలు ఏర్పడుతున్నాయి.

ఉదా : రెండు + ఓ = రెండో

రెండు + ఆమ్ = రెండామ్

రెండు + అవదు = రెండావదు

## 6.1.3 విభక్తులు

క్రియలతోను నామ వాచకాల తోను అన్వయం కుదిర్చి, వాక్యం లోని భావాన్ని స్పష్టపరచేవి విభక్తులు.

డు, ము, వు, లు ప్రథమ అని బాల. వ్యా (తత్సమ సూ. 1) మ. తె. లో 'డు' కు బదులుగా 'న్' వాడబడుతోంది.

ఉదా : ప్రా. తె. మ. తె.

ఈశ్వరుడు > ఈశ్వరన్

చెంగల్వరాయుడు > చెంగల్వరాయన్

### .1.3.1 ద్వితీయా విభక్తి :

ప్రా. తె. లో నిన్, నున్, లన్, కూర్చి, గురించి ద్వితీయా విభక్తి ప్రత్యయాలు. 'ను' ర్ణంబు - ద్వితీయ అని బాల. వ్యా. (తత్సమ సూ. 2)

మద్రాసు తెలుగులో ని, ను ప్రత్యయాలు 'గురించి' కి బదులుగా 'పత్తి' అనే ప్రత్యయం వాడబడుతోంది.

కర్మార్థంలో ని / ను వాడ బడుతోంది.

ని - అమ్మోరిని

ను - ఆమెను

ని, ను లోపించిన రూపాలు కూడా కనబడుతున్నాయి.

పిల్లని చూడ్డం - పిల్ల చూడ్డం

బిడ్డను తీసింది - బిడ్డ తీసింది.

ఉద్దేశార్థంలో 'గురించి' కి బదులుగా 'పత్తి' తమిళ ప్రత్యయం వాడబడుతుంది. 'నించి' కూడా గురించికి ప్రత్యామ్నాయంగా వాడబడుతోంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా : | దాని గురించి | > | దాని పత్తి, అదుపత్తి |
| | వాడి గురించి | > | వాన్నించి |
| | దాని గురించి | > | దాన్నించి |
| | అందు గురించి | > | అందు నించి |

### 6.1.3.2 తృతీయా విభక్తి :

ప్రా. తె. లో చేతన్, చేన్, తోడన్, తోన్ తృతీయావిభక్తి ప్రత్యయాలు - చేత, తోడ తృతీయ అని, బాల. వ్యా. (తత్సమ. సూ. 3) మ. తె. లో 'తోడా' 'లో' అనే ప్రత్యయాలు తృతీయా విభక్తికి వాడ బడుతున్నాయి.

| | ప్రా. తె. | | మ. తె. |
|---|---|---|---|
| 'తోడా' : | కళ్ళతో చూసేను | > | కన్ను తోదా చూసెడిసి నాను |
| | వాళ్ళతో చెప్పాలి | > | వాళ్ళతోదా చెప్పవాలి |
| 'లో' : | కాళ్ళతో నిలబడాలి | > | కాల్లలో నిలబడవాలి |
| | రోకలితో కొట్టి | > | రోకల్లో కొట్టి |
| | చేత్తో నూరుకోవాలి | > | చేయిలో నూరుకోవాలి |

### 6.1.3.3 చతుర్థి :

కొఱకు - కయి చతుర్థి అని బాల. వ్యా. (తత్సమ. సూ. 4) మ. తె. లో కోసం దా, కాగనె, అనే ప్రత్యయాలు కనబడుతున్నాయి.

| | | |
|---|---|---|
| కోసం | : | దాని కోసందా వస్తియి |
| కాగనే | : | అందు కాగనే చొప్పేది. |

'కాగ' అనేది తమిళ చతుర్థీ విభక్తి ప్రత్యయం - 'అది కాగ' 'అవనుకాగ' మొదలైన తమిళ రూపాల ప్రభావం వల్ల మ.తె. లో, 'కాగనే' అనే చతుర్థీ విభక్తి రూపం ఏర్పడింది.

### 6.1.3.4 పంచమి :

వలన, కంటె, పట్టి, పంచమి బాల. వ్యా. (తత్సమ. సూత్రం : 5) మ. తె. లో వల్ల, కన్న, వుడ, వొడ, విడ మొదలైనవి పంచమా విభక్తి ప్రత్యయాలుగా వాడబడుతున్నాయి.

| | | |
|---|---|---|
| వల్ల | : | దాని వల్లదా నాకుట్ట నంటాది. |
| క్రన్న | : | మీకన్న మాకు పుడిచింది. |
| వుడ | : | అది వుడ ఇది మంచిది. |
| పొడ | : | దాని పొడ దీన్నెత్తు కోవాల |
| విడ | : | తెలుగు విడ తమిళే ఈసే |

తమిళ భాషా ప్రభావం వల్ల వుడ, విడ, పొడ ప్రత్యయాలు మ. తె. లో ఏర్పడ్డాయి. 'నించి' కూడా వల్ల అనే అర్థంలో వాడబడుతోంది.

పిల్లల వల్ల > పిలకాయల నించి

దాని వల్ల > దాన్నించి

### 6.1.3.5 షష్ఠి :

ప్రా. తె. లో కిన్, కున్, యొక్క, లోన్, లోపల షష్ఠీ విభక్తి ప్రత్యయాలు. కు - యొక్క - లోపల - షష్ఠీ విభక్తి ప్రత్యయాలు అని బాల వ్యా. (తత్సమ సూ. 6) మ. తె. లో కి, కు ప్రత్యయాలు ఒకదాని కొకటి ప్రత్యమ్నాయాలుగా వాడబడుతున్నాయి.

కర్త్రర్థకంలో షష్ఠి ప్రత్యయం 'లో' కి బదులుగా తృతీయా ప్రత్యయం 'తో' వాడబడుతోంది.

నాకు తెలుగు లో మాట్లాడ్డం ఇష్టం > నాకు తెలుగుతో మాట్లాడ్డం పట్టును.

గమ్యార్థంలో 'కి' కి బదులుగా 'లో' వాడబడుతోంది.

అమెరికాకి పోయేడు > అమెరికాల్లో పోయినాడు.

'లో' బదులుగా 'కి'

రిక్షాల్లో పోతుంది. > రిక్షాక్కి పోతుంది.

సామాన్యార్థంలో షష్ఠి'లో' కి బదులుగా ద్వితీయ'ను' కనబడుతోంది.

మధ్యల్లో > నడుంగున్ను

సామాన్యార్థంలో ఉండు క్రియతో 'కి' ప్రత్యయం వస్తోంది.

పణం వుండికిని ఏమి ప్రయోజనం.

వ్యాపారార్థంలో 'కి' వాడబడుతోంది.

రూపాయికి విలువ పడి పుడ్సిందే

వ్యాధి సూచకాల్లో 'కు'

నాకు ఇడుపుకు కింద నొప్పి

కాలార్థంలో 'కు' కి బదులుగా 'కి' వాడబడుతోంది.

అరున్నర గంటలకు > అరున్నర గంటకి

పై పదాల్లో ప్రా. తె. కంటె భిన్నంగా మ. తె. లో కన్పించే రూపాలన్నీ తమిళ భాషా ప్రభావం వల్ల ఏర్పడ్డాయని చెప్పాలి.

### 6.1.3.6 సప్తమి :

అందు, న సప్తమి అని బాల. వ్యా. (తత్సమ. సూ. 7) మ. తె. లో 'లో' 'ల' సప్తమీ విభక్తి ప్రత్యయాలుగా వాడబడుతున్నాయి.

చెన్నపట్నంల వ్యాపారందా జాస్తి

ఒక విభక్తి పై మరొక విభక్తి రావడం మ. తె. లో కనబడుతోంది.

అందు + లో > అదిలే,

అదిలే నిజంలేదు

విభక్తి ప్రత్యయ రహిత పదాలు, ఒక ప్రత్యయానికి బదులుగా మరో ప్రత్యయం వచ్చిన రూపాలు మ. తె. లో కనబడుతున్నాయి.

ద్వితీయా విభక్తి ప్రత్యయం 'ని' లోపించిన రూపం.

పిల్లని చూడ్డం పిల్ల చూడ్డం

'లో' బదులుగా 'ల'

కార్లో > కార్ల, కార్ల బోతే కూడా

'గ' కు బదులు 'లో'

పోలీసుగా వున్నారు > పోలీసులో వున్నారు.

'ఏ' క బదులుగా 'దా' ఇది తమిళ ప్రభావం వల్ల ఏర్పడింది.

కల్తీయే > కల్పడందా

### 6.1.3.7 పరాను బంధాలు :

విభక్తి ప్రత్యయాలు కాని కొన్ని పదాల్ని పరాను బంధాలు అంటారు. కింద, మీంద, వెనక, అవతల, ఇవతల, కాడ, తలికే - పరాను బంధాలుగా మ. తె. లో వాడబడుతున్నాయి. ఇవి నామ వాచకాలపై ప్రత్యయాలుగా వాడ బడుతున్నాయి.

అవతల, వెనక అనేవి తరువాత అనే అర్థంలో పరాను బంధాలుగా వాడబడుతున్నాయి.

అవతల : రాసినవతల చూడవాల

వెనక : చేసిన వెనక విచారించి పిరియోజనం లేదు

తలికే : చేసే తలికే ఆలస్యమై పుడ్డింది.

### 6.1.4 ఔప విభక్తికాలు

నామ వాచకాల మీద ద్వితీయాది విభక్తులు చేరేటప్పుడు వాటికి మధ్య కొన్ని వర్ణాలు చేరతాయి. వాటినే ఉపవిభక్తులు, లేక ఔపవిభక్తికాలని అంటారు. తెలుగులో 'ఇ, టి, తి, అ, లు ఔప విభక్తికాలు.

మ. తె. లో 'ఇ, టి, అ' లు మాత్రమే ఔపవిభక్తికాలు 'తి' ఔప విభక్తికంగా కన్పించడంలేదు.

'ఇ' ఏక వచనంతో షష్ఠీ విభక్తి పరమయ్యేప్పడు 'ఇ' ఉపవిభక్తిగా వస్తోంది.

ట్రైను + కు = ట్రైనికి

వంట + కు = వంటకి

'అ' బహువచనాంత నామాలకు 'అ' ఉప విభక్తిగా చేరు తుంది.

గంటలు + కు గంటలకు

పిల్లలు + కు పిల్లలకు

'టి' : ద్వితీయాది విభక్తులు పరమయ్యేప్పడు కొన్ని సందర్భాల్లో 'టి' మరికొన్ని సందర్భాల్లో 'ంటి' ఆదేశంగా వస్తుంది.

నాడు, నేడు మొదలైన శబ్దాల్లో 'టి' ఆదేశంగా వస్తుంది.

ఉదా : నాటికి దా సూసింది

నేటికి జరుగుతే చాలు

ఇల్లు మొదలైన శబ్దాలకి 'ంటి' ఆదేశంగా వస్తుంది.

ఉదా : ఇంటికి అటు ప్రక్కదా వుండాలి.

కొన్ని శబ్దాల్లో 'టి' వైకల్పికంగా వస్తుంది.

అంగడికి / అంగటికి

లోపలికి / లోపటికి

కన్ను శబ్దంలో మాత్రం 'ంటి' ఔపవిభక్తి నిత్యంగా వస్తుంది.

నా కళ్లతో చూసేను > నాకంట్లో సూస్తిని

సంఖ్యా వాచకాలకి విభక్తి ప్రత్యయాలు పరమయ్యేప్పడు 'టి' 'ట' ఉపవిభక్తిగా వస్తోంది.

నూరు + కి > నూటికి

నూరు + పది > నూట పది

## 6.1.5 లింగం - వచనం

తెలుగులో లింగ వివక్ష అర్థాన్ననుసరించి ఉంది. లింగ, వచన, విభక్తులు నామ వాచకాలకు వర్తిస్తాయి. ఏక వచనంలో పుంలింగం, పుంలింగేతరం అని నామం రెండు విధాలు. బహువచనంలో పురుష-స్త్రీ, తిర్యక్ జడాలని మూడు విధాలు.

లింగ-వచన ఆధారంగా తెలుగులో నామ వాచకాల్ని క్రింది విధంగా విభజింపవచ్చు.




మ. తె. లో అమహద్బహువచన క్రియకు ఏక వచనం వాడడం కనబడుతోంది.

ఉదా : మానులు + ఉన్నాయి > మానులు వుండాది.

ఆవులు + ఉన్నాయి > ఆవులుండాది.

సంఖ్యా వాచక విశేషణాలు చేరడం వల్ల నామ వాచక లింగ వచనాలు సూచింప బడ్తాయి.

మ. తె. లో ఒక సంఖ్యా వాచక విశేషణం పుం, స్త్రీ, నపుంసక లింగాలకు వాడడం కనపడుతోంది.

ఉదా : ఒక అన్ని

ఒక పడుచు

ఒక మాను

మహద్వాచక సంఖ్యా విశేషణాలైన ఇద్దరు, ముగ్గురు, నలుగురు స్థానంలో సంఖ్యా వాచకమే వాడబడడం మ. తె. లో కనబడుతోంది.

ఉదా : ముగ్గురు బిడ్డలు > మూడు బిడ్డలు

నలుగురు మనుషులు > నాలుగు మనుష్యులు

ఇద్దరు తమ్ముళ్ళు > రెండు తమ్ములు

మూడు సంఖ్యా వాచక విశేషణంపై వచ్చే అమహద్బహు వచనం ఏక వచనంగా మ. తె. లో మారుతోంది.

ఉదా : మూడు చొక్కాలు > మూడు చొక్కా

ఆరున్నర గంటలకి > ఆరున్నర గంటకి

ఏడు నెలలు అయ్యింది > ఏడు నెల అయ్యింది

నాలుగేండ్లు > నాలుగు ఏడాది దా

రెండు సంవత్సరాలు > రెండు సమచ్ఛరం

పై రూపాలేర్పడ్డానికి కారణం తమిళ భాషా ప్రభావమని చెప్పవచ్చు. తమిళ భాషలో సంఖ్యా వాచక విశేషణం పై అమహద్బహు వచనం లేదు. కాని మ. తె. లో ప్రాతి పదికకు - లు ప్రత్యయం చేరిన అమహద్బహువచన రూపాలు కూడా కన్పిస్తున్నాయి.

ఉదా : కోంతిలు, జాగాలు, ఇల్లులు

మ. తె. లో ప్రాతి పదికకు - లు ప్రత్యయం చేర్చడం వల్ల మహద్బహువచన రూపాలు కూడా ఏర్పడుతున్నాయి.

బిడ్డలు, అమ్మలు, అక్కలు

ప్రాతి పదికకు 'ఉరు' ప్రత్యయం చేరడం వల్ల మనుష్య బోధక బహువచన రూపాలు ఏర్పడుతున్నాయి.

ఉదా : అందురు, కొందరు, ఇద్దురు

మ.. తె. లో మనుష్య బోధక బహువచన రూపాలు అమద్బహువచనంగా మారుతున్నాయి.

ఉదా : అందరూ > అన్ని వాల్లు

కొందరు > కొన్ని వాల్లు

మ. తె. లో సంఖ్యా వాచకాలపై 'మంది' ప్రత్యయం చేరడం వల్ల మనుష్యబోధక బహువచనాలేర్పడు తున్నాయి.

ఉదా : అయిదు మంది, ఆరుమంది"

మ. తె. లో 'మంది' ప్రత్యయం పై 'లు' ప్రత్యయం చేరి అయిదు మందులు, ఆరు మందులు లాంటి బహువచన రూపాలేర్పడుతున్నాయి.

'అంత, ఇంత, ఎంత' అనే అవ్యయాలపై 'మంది' ప్రత్యయం చేరడం వల్ల 'అన్ని, ఇన్ని, ఎన్ని' సంఖ్యా విశేషణాలుగా మారుతున్నాయి.

అంత మంది > అన్ని మంది

ఎంత మంది > ఎన్ని మంది

అన్ని, ఇన్ని, కొన్ని అనే సంఖ్యా వాచక విశేషణాలు అంత, ఇంత, ఎంత అనే పరిమాణార్థక అవ్యయాలుగా మారడం కూడా మ. తె. లో వుంది.

అన్ని రోజులు > అంతా దినాలు

కొన్ని రోజులు > కొంచెం దినాలు

ప్రా. తె. లో కొన్ని పదాలు నిత్య ఏక వచనాలుగా, కొన్ని నిత్య బహువచనాలుగా వాడబడుతున్నాయి. ప్రా. తె. లో నిత్య ఏక వచనాలుగా వ్యవహరింప బడుతున్న పదాలు కొన్ని మ. తె. లో బహువచనాలుగా వ్యవహరింపబడుతున్నాయి.

ఉదా : బియ్యం ప్రా. తె. లో నిత్య ఏక వచనం. మ. తె. లో బియ్యాలు అనే బహువచన రూపం వాడబడుతోంది.

పచ్చి బియ్యాలు దా వాడ్తుము.

## 6.2.0 క్రియా రూపాలు

భాషా భాగాలన్నింటి లోను ప్రధాన మైనవి క్రియలు. క్రియలేని వాక్యం సామాన్యంగా వుండదు. కర్త వ్యాపారాన్ని తెలియజేసేది, క్రియ. క్రియలు (1) సమాపకాలు (2) అసమాపకాలు అని రెండు రకాలు.

## 6.2.1 సమాపక క్రియలు :

వాక్యంలో సంపూర్ణార్థాన్నిచ్చేవి సమాపక క్రియలు. ఇవి మూడు విధాలు.

6.2.1.1 ధాతువు + కాల బోధక ప్రత్యయం + అర్థబోధక ప్రత్యయం + మనుష్య బోధక ప్రత్యయం

6.2.1.2 ధాతువు + అర్థ బోధకం + అర్థబోధక ప్రత్యయం

6.2.1.3 ధాతువు + అర్థ బోధక ప్రత్యయం

## 6.2.2 అసమాపక క్రియలు

వాక్యంలో సంపూర్ణార్థాన్నివ్వని క్రియలు అసమాపక క్రియలు. ఇవి మూడు విధాలు

6.2.2.1 ధాతువు + అసమాపక క్రియా ప్రత్యయం

6.2.2.2 ధాతువు + కాలబోధక ప్రత్యయం + అసమాపక క్రియా ప్రత్యయం.

6.2.2.3 ధాతువు + వ్యతిరేకార్థక ప్రత్యయం + అసమాపక క్రియాప్రత్యయం.

మ. తె. లోని క్రియా స్వరూపం ప్రా. తె. తో పోల్చి పరిశీలింప బడుతోంది.

### 6.2.3 సకర్మక ప్రేరణ ప్రత్యయాలు

క్రియలు సకర్మక, అకర్మక అని రెండు రకాలు. కర్మని ఆపేక్షించేవి సకర్మక క్రియలు. కర్మని ఆపేక్షింపనివి అకర్మక క్రియలు. ఇతరుల్ని ప్రేరేపించేవి ప్రేరణక్రియలు.

ప్రా. తె. లో చు, పు, ఇంచులు సకర్మక ప్రత్యయాలు. మ. తె. లో చు, పు, లు సకర్మక ప్రేరణ ప్రత్యయాలు.

ఉదా : సేరు - సేర్చు, కలియు - కలుపు

మాను - మాన్పు, తెలియు - తెలుపు

ప్రా. తె. లో ఇంచు, మించు, ఇప్పించు అనే ప్రేరణార్థక ప్రత్యయాలున్నాయి.

ఇంచు : కట్టు + ఇంచు = కట్టించు

తిట్టు + ఇంచు = తిట్టించు

పించు : తల + పించు = తలపించు

తెర + పించు = తెరిపించు

మ. తె. లో ధాతువు పై 'పెట్టు' చేర్చడం వల్ల ప్రేరణార్థక క్రియలు ఏర్పడుతున్నాయి.

సదువు + పెట్టు = సదవబెట్టు

తిను + పెట్టు = తినబెట్టు

ధాతువుకి 'వేయు' 'వేసి' చేర్చడం వల్ల ప్రేరణార్థకాలు ఏర్పడుతున్నాయి.

ఇచ్చు + వేయు > ఇచ్చివేయు

ఇచ్చు + వేసి > ఇచ్చేసి

### 6.2.4 భూతకాలిక క్రియా ప్రత్యయాలు

ప్రా తె. లో ఏ, అ, ఇన్ - లు భూత కాలిక ప్రత్యయాలు.

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. పు | చూచు + ఏ + ను | చూచు + ఏ + ము |
| మ. పు | చూచు + ఏ + వు | చూచు + ఏ + రు |
| ఉ పు | చూచు + అ + ను | చూచు + అ + ము |
| మ పు | చూచు + అ + వు | చూచు + అ + రు |

ఇన్ చెప్ + ఇన్ + ది = చెప్పింది.

వచ్చ్ + ఇన్ + ది = వచ్చింది.

మ. తె. లో తి, ఇతి, ఇనా, ఇన్‌లు భూతకాలిక ప్రత్యయాలు

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| ఉ. పు | చూచు + ఇతి + ని | చూచు + ఇతి + దు |
| మ. పు | చూచు + ఇతి + వి | చూచు + ఇతి + రి |
| ఉ. పు | చూచు + తి + ని | చూచు + తి + మి |
| మ. పు | చూచు + తి + వి | చూచు + తి + రి |

**ఇనా, ఇన్**

| | | |
|---|---|---|
| చొప్ + ఇనా + ది | = | చొప్పినాది |
| వచ్చి + ఇనా + ది | = | వచ్చినాది |
| చొప్ + ఇన్ + ది | = | చొప్పింది |
| వచ్ + ఇన్ + ది | = | వచ్చింది |

ప్రా. తె. లో కర్తృపదం, క్రియా పదం ఒకే లింగ వచనాల్లో వుంటాయి. కాని మ. తె. లో నపుంసక లింగంలో ఏక బహువచన భేదం లేదు. నామ వాచకం ఏవచనంలో వున్నా క్రియ ఏక వచనం లోనే కనబడుతోంది. ఇది తమిళ భాషా ప్రభావం.

ఉదా : ఇల్లు వుండాది

ఇల్లులు ఉండాది

ఆవు వచ్చింది

ఆవులు వచ్చింది

## 6.2.5 భూతకాలిక క్రియా విశేషణం

ప్రా. తె. లో ధాతువుకు 'ఇ' 'ఏసి' ప్రత్యయం చేరడం వల్ల భూతకాలిక క్రియా విశేషణ రూపాలేర్పడతాయి.

ఉదా : వచ్ + ఇ = వచ్చి, వచ్ + ఏసి = వచ్చేసి

తిన్ + ఇ = తిని, తిన్ + ఏసి = తినేసి

మ. తె. లో ఇడిచు, ఎడిచు, అనే ప్రత్యయాలు చేరడంవల్ల భూత కాలిక క్రియా విశేషణాలు ఏర్పడుతున్నాయి.

ఉదా : వచ్ + ఇడిచు + ని = వచ్చిడిస్తిని

వచ్ + ఎడిచు + ని = వచ్చెడిస్తిని

చేస్ + ఇడిచు + ని = చేసిడిస్తిని

చేస్ + ఎడిచు + ని = చేసెడిస్తిని

పై ప్రత్యయాలతో కూడిన రూపాలు మ. తె. లో ఏర్పడ్డానికి తమిళ భాషా ప్రభావమే కారణం. తమిళంలో 'విట్టు' అనే ప్రత్యయం మ. తె. లో 'ఇడుచు' ప్రత్యయానికి సమానం.

| | త | | మ. తె. |
|---|---|---|---|
| ఉదా : | సొల్లి + విట్టా | - | చొప్పి + ఇడిచు |
| | పోయి + విట్టు | - | పోయి + ఇడిచు |

ఈ ఇడిచు, ఎడిచు ప్రత్యయాల పైన 'ఏసి' ప్రత్యయం వస్తోంది.

వచ్ + ఇడిచు + ఏసి = వచ్చెడిసేసి

చేస్ + ఇడిచు + ఏసి = చేసెడిసేసి

ప్రా. తె. లో 'ఏక' 'నాక' అనే ప్రత్యయాలతో కూడిన భూతకాలిక క్రియా విశేషణం వుంది. ఇదే అర్థంలో మ. తె. లో భూతకాలిక ప్రత్యయమైన 'ఇన' 'వెనక' చేరిన రూపాలు కనబడుతున్నాయి.

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా : | చేస్ + ఏక | = | చేసేక | ప్రా. తె. |
| | వచ్చ్ + నాక | = | వచ్చినాక | |
| | చేస్ + ఇన + వెనక | = | చేసిన వెనక | మ. తె. |
| | వచ్చ్ + ఇన + వెనక | = | వచ్చిన వెనక | |

'వెనక' అనే పదంతో కూడిన రూపం ప్రాచీన తెలుగులో కనబడుతోంది. అందువల్ల మ. తె. లో ప్రాచీన రూపమైన 'వెనక' నిల్చి వుందని చెప్పవచ్చు. తమిళం లో 'పిన్, అప్పరం' అనే పదాలు 'వెనక' అనే పదానికి సమానార్థకాలుగా వాడబడుతున్నాయి.

ఉదా :

| త | | మ. తె. |
|---|---|---|
| సొల్లిట్ట్ + అప్పరం | = | చొప్పిన + వెనక |
| పణ్ణిట్ + అప్పరం | = | చేసిన + వెనక |
| వందిట్ట్ + పిన్ | = | వచ్చిన + వెనక |
| పాతిట్ట్ + పిన్ | = | చూసిన + వెనక |

### 5.2.6 క్త్వదర్థకం

ప్రా. తె. లో ధాతువుకి ఇన, అ, ప్రత్యయాలు చేరడం వల్ల క్త్వ దర్థక రూపాలు ఏర్పడతాయి. ఈ ప్రత్యయాలు చేరేటప్పడు సమాన హల్లుల మధ్య నున్న హల్లు లోపిస్తుంది. మ. తె. లో కూడా ఇన, అ ప్రత్యయాలు క్త్వ దర్థకాలుగా వున్నాయి. కాని అవి చేరేటప్పడు సమాన హల్లుల మధ్య అచ్చు లోపించదు.

| | ప్రా. తె. | | మ. తె. |
|---|---|---|---|
| ఉదా : పెట్ + ఇనా > | పెట్నా | > | పెట్టినా |
| | తిన్నా | > | తినినా |

మ. తె. లో 'ఏది' ప్రత్యయం కూడా కన్పిస్తోంది.

ఉదా : చూచు + ఏది = చూచేది

తిను + ఏది = తినేది

ప్రా. తె. లోను, మ. తె. లోను వచ్చే భూతకాలిక ప్రత్యయాలను క్రింది విధంగా గుర్తించవచ్చు.

| | ప్రా. తె. | మ. తె. |
|---|---|---|
| భూతకాలం | ఏ, అ, ఇన్ | తి, ఇతి, ఇనా, ఇన్ |
| భూతకాలిక క్రియా విశేషణం | ఇ, ఏసి, ఏక, నాక | ఏసి, ఇడిచు ఎడిచు, వెనక |
| క్త్వవదర్థకం | ఇనా, అ | ఇన, అ, ఏది |

## 6.2.7 భూతకాలేతర క్రియా ప్రత్యయాలు

భూతకాలం కంటే ఇతర మైన వర్తమాన, భవిష్యత్, వ్యతిరేకార్థక ప్రత్యయాల్ని భూతకాలేతర ప్రత్యయాలు అంటారు.

### 6.2.7.1 వర్తమాన కాలం

ప్రా. తె. లో ధాతువుకి తున్నా, తోన్, అనే ప్రత్యయాలు చేరడం వల్ల వర్తమానకాలిక రూపాలేర్పడతాయి.

ఉదా : చేస్ + తున్నా + ను = చేస్తున్నాను.

చేస్ + తోన్ + ది = చేస్తోంది

మ. తె. లో తుండా, తాన్ లు చేరడం వల్ల వర్తమాన కాలిక రూపాలేర్పడతాయి.

ఉదా : చేస్ + తుండా + ను = చేస్తుండాను

చేస్ + తాన్ + ది = చేస్తోంది.

### 6.2.7.2 భవిష్యత్కాలం

ప్రా. తె. లో తా, తున్ లు భవిష్యత్ కాల ప్రత్యయాలు.

చెప్ + తా + ను = చెప్తాను

చెప్ + తున్ + ది = చెప్తుంది

మ. తె. లో 'తు' భవిష్యత్కాల ప్రత్యయం

ఉదా : చాప్ + తా + ను = చొప్తును
చేస్ + తు + ను = చేస్తును.

### 6.2.8 భూతకాలేతర క్రియా విశేషణం

6.2.8.1 : వర్తమాన కాలిక క్రియా విశేషణం

ప్రా. తె. లో వర్తమాన కాలిక క్రియా విశేషణం ప్రత్యయం 'తూ'. మ. తె. లో వర్తమాన కాలిక క్రియా విశేషణం ప్రత్యయం 'తా'.

ఉదా : ప్రా. తె. = చేస్ + తూ + ది = చేస్తూంది
మ. తె. = చేస్ + తా + ది = చేస్తాంది

### 6.2.8.2 భవిష్యకాలిక క్రియా విశేషణం :

ప్రా. తె. లో భూతకాలేతర క్రియా విశేషణ ప్రత్యయం 'ఏ'.

మ. తె. లో కూడా భూతకాలేతర విశేషణం 'ఏ'. ప్రా. తె. లో ఈ 'ఏ' కి ముందు అంత, అందుకు, అప్పుడు పదాలు చేరుతున్నాయి. ఆ సందర్భంలో 'ఏ' 'ఎట్' గా మారుతుంది.

చేస్ + ఏ + పుడు = చేసేటప్పుడు
చెప్ + ఏ + పుడు = చెప్పేటప్పుడు

మ. తె. లో అందుకు బదులుగా 'దానికి' పదం వాడబడుతోంది. ఈ సందర్భంలో 'ఏ' 'ఎట్' గా మారడం లేదు.

ఉదా : ప్రా. తె. : చెప్ప్ + ఏ + అందుకు = చెప్పేందుకు
మ. తె. : చెప్ప్ + ఏ + దానికి = చెప్పేదానికి

'అందుకు' బదులుగా మ. తె. లో 'అను' అనే వ్యతిరేకార్థక ప్రత్యయం కూడా కనబడుతోంది.

ప్రా. తె. : చెప్ప్ + ఏ + అందుకు + వీలుకాదు = చెప్పేటందుకు వీలుకాదు.
మ. తె. : చెప్ప్ + అను = చెప్పను మాలదు
చెయ్ + అను = చెయ్యను మాలదు

మ. తె. లో భూతకాలేతర ప్రత్యయాల్ని ప్రా. తె. తో పోల్చి క్రింది పట్టికలో చూడవచ్చును.

| | ప్రా. తె. | మ. తె. |
|---|---|---|
| వర్తమాన కాలం | తున్నా, తోన్ | తుందా, తాన్ |
| భవిష్యత్ కాలం | తా, తున్ | తు |
| వర్తమాన కాలిక క్రియా విశేణం | తూ | తా |
| భూతకాలేతర విశేషణం | ఏ, ఎట్ | ఏ, అను |

### 6.2.9 వ్యతిరేకార్థ క్రియలు

మ. తె. లోనూ, ప్రా. తె. లోను 'అ' వ్యతిరేకార్థక ప్రత్యయం

ఉదా : చెప్ప్ + అ + ను = చెప్పను

నిషేధార్థక ప్రత్యయం - అక

చెప్ప్ + అక = చెప్పక

### 6.2.9.1 భూతకాలిక వ్యతిరేకార్థకం

భూతకాలిక తుమర్థక ధాతువులపై కాను, లేదు అనే వ్యతిరేకార్థక క్రియా ప్రత్యయాలు చేరి భూతకాలిక వ్యతిరేకార్థక రూపాలేర్పడుతున్నాయి.

చేసాను + కాను = చేసాను కాను

పోయాను + కాను = పోయాను కాను

చెప్ప్ + లేదు = చెప్పలేదు.

తిన + లేదు = తినలేదు

మ. తె. లో 'లేదు' అనే వ్యతిరేకార్థక ప్రత్యయం వుంది. 'కాను' అనే వ్యతిరేకార్థక పదం ఉపయోగించ బడడంలేదు.

### 6.2.9.2 వర్తమాన కాలిక వ్యతిరేకార్థకం

ప్రా. తె. లో కృదంత రూపం మీద 'లేదు' చేరడం వల్ల వర్తమాన కాలిక వ్యతిరేకార్థక క్రియారూపం ఏర్పడుతుంది. మ. తె. లో కూడా ఇదే విధంగా వుంది.

ఉదా : చెప్ప్ + అడం + లేదు = చెప్పడం లేదు.

చెప్ప్ + ఏది + లేదు = చెప్పేది లేదు.

### 6.2.9.3 భవిష్యత్కాలిక వ్యతిరేకార్థకం

ప్రా. తె. లోను, మ. తె. లోను 'పో' ధాతువు యొక్క కృదంత రూపానికి 'లేదు' చేరడం వల్ల భవిష్యత్కాలిక వ్యతిరేకార్థక క్రియలు ఏర్పడు తున్నాయి.

రా + పో + అడం + లేదు = రాబోవడం లేదు

కా + పో + అడం + లేదు = కాబోవడం లేదు

ప్రా. తె. లో 'లేను' అనే భవిష్యత్కాలిక వ్యతిరేకార్థక క్రియకు బదులుగా మ. తె. లో 'మాల్దు', 'ముడియదు', అనే పదాలు వాడ బడుతున్నాయి.

ప్రా. తె. = చెప్ప + లేను = చెప్ప లేను

మ. తె. = చెప్ప + అను + మాల్దు = చెప్పను మాల్దు

ప్రా. తె. = చెయ్ + లేను = చెయ్యలేను

మ. తె. = చెయ్ + అను + ముడియదు = చెయ్యను ముడియదు.

ఇది తమిళ ప్రభావం వల్ల ఏర్పడిన రూపం.

### 6.2.9.4 వ్యతిరేకార్థక క్రియా విశేషణం

ప్రా. తె. లోను, మ. తె లోను 'అకుండ' ప్రత్యయం చేరడం వల్ల వ్యతిరేకార్థక క్రియా విశేషణ రూపం ఏర్పడుతోంది.

తియ్య + అకుండ = తియ్యకుండ

వెయ్ + అకుండ = వెయ్యకుండ

### 6.2.9.5 వ్యతిరేకార్థక విశేషణం :

ప్రా. తె. లోను, మ. తె. లోను వ్యతిరేకార్థక విశేషణం 'అని' -

ఉదా : చెప్పని, చెయ్యని

### 6.2.9.6 వ్యతిరేకార్థక నామధాతువు :

ప్రా. తె. లో 'అక' ప్రత్యయం 'పో' ధాతువు యొక్క కృదంత రూపం చేరడం వల్ల కృదంతాలు ఏర్పడుతున్నాయి. ఇటు వంటి రూపాలు మ. తె. లో లేవు.

ప్రా. తె. లోని వ్యతిరేకార్థక క్రియా ప్రత్యయాల్ని మ. తె. లోని వ్యతిరేకార్థక క్రియాప్రత్యయాల్ని క్రింది పట్టికలో చూడవచ్చు.

| | ప్రా. తె. | మ. తె. |
|---|---|---|
| వ్యతిరేక నిషేధార్థకం | అ, అక | అ, అక |
| భూతకాలిక వ్యతిరేకార్థకం | లేదు, కాను | లేదు |
| వర్తమానకాలిక వ్యతిరేకార్థకం | లేదు | లేదు |
| భవిష్యత్కాలిక వ్యతిరేకార్థకం | లేదు, లేను | లేదు |
| వ్యతిరేకార్థక క్రియావిశేషణం | అకుండ | అకుండ, అకండ |
| వ్యతిరేకార్థక విశేషణం | అని | అని |
| వ్యతిరేకార్థక నామ ధాతువు | అక | - |

## 6.2.10 ప్రకార క్రియలు

### 6.2.10.1 చేదర్థకాలు :

ప్రా. తె. లో ధాతువుకి ఇతే, టే, అనే ప్రత్యయాలు చేరడంవల్ల చేదర్థకాలు ఏర్పడు తున్నాయి. మ. తె. లో కూడా 'ఇతే', 'టే' ప్రత్యయాలున్నాయి. అయితే వీటిపైన మళ్ళీ 'దా'

అనే ప్రత్యయం చేరుతోంది. ఇది తమిళ భాషా ప్రభావం వల్ల ఏర్పడింది.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రా. తె. | : | చూచ్ + ఇతే | = | చూస్తే |
| మ. తె. | : | చూచ్ + ఇతే + దా | = | చూస్తేదా |
| ప్రా. తె. | : | ఎత్ + ఇతే | = | ఎత్తితే |
| మ. తె. | : | ఎత్ + ఇతే + దా | = | ఎత్తితేదా |
| ప్రా. తె. | : | తిన్ + టే | = | తింటే |
| మ. తె. | : | తిన్ + టే + దా | = | తింటేదా |
| ప్రా. తె. | : | వున్ + టే | = | వుంటే |
| మ. తె. | : | వున్ + టే + దా | = | వుంటేదా |

### 6.2.10.2 ఆమోద సూచకత :

ప్రా. తె. లో ఆమోద సూచక ప్రత్యయాలు ఏను, ఆను. మ. తె. లో 'ఇనా' ఆమోద సూచక ప్రత్యయంగా వుంది.

ప్రా. తె. : చేస్ + ఏను = చేసేను, చేస్ + ఆను = చేశాను.

మ. తె. : చేస్ + ఇనా = చేసినా

### 6.2.10.3 తద్ధర్మార్థక కాలం :

ప్రా. తె. లో తద్ధర్మార్థకంలో తద్ధర్మార్థం కాకుండా అర్థవిపరిణామం చెంది చేసుండనా, వచ్చుండనా అనే రూపాలు ఏర్పడుతున్నాయి. మ. తె. లో కూడా తద్ధర్మార్థం అర్థ విపరిణామం చెంది 'వచ్చును.' చేసును' రూపాలు ఏర్పడుతున్నాయి.

ఉదా : సూసును, సేసును.

### 6.2.10.4 ఉభయ ప్రార్థనార్థకం :

ప్రా. తె. లోను మ. తె. లోను ఉభయ ప్రార్థనార్థక ప్రత్యయాలు తా, దా లు కనిపిస్తున్నాయి.

ఉదా : పో + దా + ము = పోదాము

పో + తా + ము = పోతాము

### 6.2.10.5 తుమర్థక ప్రత్యయాలు :

ప్రా. తె. లో తుమర్థక ప్రత్యయం 'అ' మ. తె. లో 'అను'.

ఉదా : చెప్ప్ + అ + లేను = చెప్పలేను

చెప్ప్ + అను + మాల్దు = చెప్పను మాల్దు

### 6.2.10.6 ప్రార్ధనాద్యర్ధకం :

ప్రా. తె. లో ప్రార్ధనార్ధక ప్రత్యయం రూప శూన్య పదాంశం. మ. తె. లో 'మి' ప్రార్ధనాద్యర్ధక ప్రత్యయం.

| ఉదా : | ప్రా. తె. | మ. తె. |
|---|---|---|
| | పో - ∅ | పో + మి |
| | తియ్యు + ∅ | తియ్యు + మి |

### 6.2.10.7 ప్రార్ధనాద్యర్ధక బహువచనం

ప్రా. తె. లో ప్రార్ధనాద్యర్ధక బహువచన ప్రత్యయం 'అంటే' మ. తె. లో 'అండి' ప్రత్యయంపై 'మి' ప్రత్యయం చేరుతోంది.

ఉదా : ప్రా. తె. చెయ్య్ + అండి = చెయ్యండి

మ. తె. : చెయ్య్ + అండి + మి = చెయ్యండి మి

### 6.2.10.8 ఇచ్ఛార్ధకం :

ప్రా. తె. లో ఇచ్ఛార్ధక ప్రత్యయం 'అలి' మ. తె. లో ఇచ్ఛార్ధక ప్రత్యయం 'వాలి'.

ప్రా. తె. చేయ్ + అలి = చేయాలి

మ. తె. చెయ్ + వాలి = చేయవాలి

### 6.2.10.9 నిషేధార్ధకం :

ప్రా. తె. లోను, మ. తె. లోను ధాతువు మీద 'అకు' అనే వ్యతిరేకార్ధక ప్రత్యయం వచ్చినప్పుడు, దానిపై రూపశూన్య పదాంశం చేరడం వల్ల నిషేధార్ధక ఏక వచన, బహువచన రూపాలేర్పడుతున్నాయి.

చేయ్ + అకు + ∅ = చేయకు

ధాతువు యొక్క తుమర్ధక రూపాలపై 'వద్దు' పదాన్ని చేర్చడం వల్ల కూడా నిషేధార్ధక ఏ. వ. రూపాలేర్పడుతున్నాయి.

చెప్ + వద్దు = చెప్పొద్దు

బహువచన ప్రత్యయం - 'అండి'

చెప్ + వద్దు + అండి = చెప్పొద్దండి.

ఇంత వరకు వివరించిన ప్రకార క్రియల్ని క్రింది విధంగా పట్టికలో పోల్చి చెప్పవచ్చు.

| | | |
|---|---|---|
| చేదర్థకం | ఇతే, టే | ఇతే, టే, దా |
| ఆమోద సూచకత | అను, ఏను | ఇనా |
| తద్ధర్మార్థక కాలం | ను | ను |
| ఉభయ ప్రార్థనార్థకం | రా, తా | దా. తా |
| తుమర్థకం | అ | అను |
| ప్రార్థనార్థక ఏకవచనం | ∅ | మి |
| ప్రార్థనార్థక బహువచనం | అండి | అండి + మి |
| ఇచ్ఛార్థకం | అలి | వాలి |
| నిషేధార్థక - ఏక బహువచనాలు | వద్దు+∅+అండి | ∅ వద్దు |

పై రూప నిర్మాణ పరిశీలన వల్ల మ. తె. లో క్రింది విలక్షణాలు కన్పిస్తున్నాయి.

నామ వాచక ప్రాతి పదికలు.

ప్రా. తె. లో మహద్వాచక పుంలింగ ఏకవచన ప్రత్యయం 'డు' మ.తె. లో 'డు' కి బదులుగా తమిళ ప్రత్యయమైన 'అన్' కనబడుతోంది.

ఉదా : చెంగల్వరాయన్

ప్రా. తె. లో అమహద్వాచక స్త్రీలింగ ప్రత్యయం 'కత్తె' మ.తె. లో 'కత్తె' కి బదులుగా తమిళ ప్రత్యయం 'కారి'వస్తోంది.

ఉదా : బిచ్చకారి

ప్రా. తె. లో భావార్థక ప్రత్యయం 'అడం' మ. తె. లో 'అడం' కి బదులుగా 'ఏది' ప్రత్యయం వాడ బడుతోంది.

ఉదా : రాసేది, చూసేది.

## సర్వనామాలు :

స్త్రీ లింగ ఏకవచన సర్వనామాలు 'ఆపె, ఈపె'. పుంలింగ ఏక వచన సర్వనామాలు వాండు, వీండు ప్రాచీన రూపాలు మ. తె. లో నిల్చి వున్నాయి. ప్రా. తె. లోని మనుష్యేతర బహువచన సర్వనామ రూపాలైన అవి, ఇవి మ. తె. లో వాడబడడం లేదు. ఆత్మార్థక ఏకవచన సర్వనామం 'తను' మ. తె. లో స్త్రీలింగ ద్యోతకంగా మాత్రమే వాడబడుతోంది.

## సంఖ్యా వాచకాలు :

'ఒకటి' ఔపవిభక్తిక రూపం. మ. తె. లో 'ఒణ్ణు' గా వాడబడుతోంది. ఇది స్త్రీ,

పుంలింగాలకు, రెంటికి వాడబడుతోంది.

ఉదా : ఒణ్ణు వొచ్చి

మ. తె. లో ఒకటి సంఖ్యా వాచకం పై ద్వితీయాది విభక్తి ప్రత్యయం 'ని' వస్తోంది.

ఉదా : ఓటి ఓటిని

తమిళంలో శ్వాసనాద భేదంలేదు. అందువల్ల మ. తె. లో 'నలుకురు' రూపం కన్పిస్తోంది. 'హ' కారంతో కూడిన 'పదహారు', 'పదిహేడు' లాంటి రూపాలు బహుకొద్ది మంది మాత్రమే వ్యవహరిస్తున్నారు. ఎక్కువ మంది 'గ' తో కూడిన రూపాల్ని వ్యవహరిస్తున్నారు.

ఉదా : పదగారు, పదిగేడు

దీనికి కారణం తమిళ భాషా ప్రభావం.

ప్రా. తె. లోని వంద సంఖ్యా వాచకానికి బదులుగా మ. తె. లో ' నూరు సంఖ్యా వాచకం' వాడబడుతోంది. మ. తె. లో కోటి రూపం 'కోడి' గా మారింది. ఈ మార్పుకు కూడా తమిళ ప్రభావమే కారణం.

**విభక్తులు**

ప్రా. తె. లోని ద్వితీయా విభక్తి ప్రత్యయం 'గురించి' కి బదులుగా మ. తె. లో 'పత్తి' అనే తమిళ ప్రత్యయం వాడబడుతోంది.

ఉదా : దాని పత్తి

'నించి' కూడా 'గురించి' కి బదులుగా వాడబడుతోంది. మ. తె. లో ' తోదా', 'లో' అనేవి తృతీయా విభక్తి ప్రత్యయాలుగా వాడబడుతున్నాయి.

ఉదా : వాళ్ళ తోదా చెప్పవాలి

చెయిలో నూరుకోవాల

కోసం, కాగనే అనే రూపాలు మ. తె. లో చతుర్థీ విభక్తి ప్రత్యయాలుగా వాడ బడుతున్నాయి. 'కాగ' అనేది తమిళ చతుర్థీ విభక్తి ప్రత్యయం. 'అది కాగ' 'అవన్ కాగ' మొదలైన తమిళ రూపాల ప్రభావం వల్ల మ. తె. లో 'కాగనే' అనే రూపం ఏర్పడింది. మ. తె. లో వుడ, విడ, వొడ అనేవి పంచమీ విభక్తి ప్రత్యయాలు ఇవి తమిళ ప్రత్యయాలు.

ఉదా : దానివిడ, అదివుడ, తెలుగు వొడ

**ఔపవిభక్తికాలు :**

మ. తె. లో 'తి' అనే ఔప విభక్తికం కనబడడం లేదు 'ఇ. టి. అ' లు మాత్రమే ఔపవిభక్తికాలుగా వాడబడుతున్నాయి.

**లింగం - వచనం :**

మ. తె. లో అమహద్బహు వచన క్రియకు ఏక వచన రూపం కనబడుతోంది.

ఉదా : ఆవులు వుండాది.

'మూడు' సంఖ్యా వాచక విశేషణ రూపం పై వచ్చే అమహద్బహు వచనం మ. తె. లో ఏక వచనంగా మారుతోంది.

ఉదా : మూడు చొక్కా

ప్రా. తె. లో నిత్య ఏక వచనాలుగా వ్యవహరింప బడుతున్న పదాలు కొన్ని మద్రాసు తెలుగులో బహు వచనాలుగా వ్యవహరింప బడుతున్నాయి.

ఉదా : బియ్యం > బియ్యాలు

క్రియారూపాలు : ప్రా. తె. లో చు, పు, ఇంచులు సకర్మక ప్రేరణ ప్రత్యయాలు మ. తె. లో చు. పు. లు మాత్రమే సకర్మక ప్రేరణ ప్రత్యయాలు. మ. తె. లో ధాతువుకి 'పెట్టు' చేర్చడం వల్ల ప్రేరణార్థక క్రియలు ఏర్పడుతున్నాయి.

ఉదా : తినబెట్టు

ప్రా. తె. లో ఏ, ఆ, ఇన్. లు భూత కాలిక ప్రత్యయాలు. మ. తె. లో తి, ఇతి, ఇనా, ఇన్ లు భూతకాలిక ప్రత్యయాలు.

ప్రా. తె. లో కర్తృపదం, క్రియా పదం ఒకేలింగ వచనాల్లో వుంటాయి. కానీ మ. తె. లో నపుంసక లింగంలో ఏక బహు వచన భేదంలేదు. నామ వాచకం బహువచనంలో వున్నా క్రియ ఏకవచనంలోనే వుంటుంది.

ఉదా : ఇల్లులు వుండాది, ఆవులు వచ్చింది.

ఇది తమిళ భాషా ప్రభావం.

ప్రా. తె. లో భూతకాలిక క్రియా విశేషణ ప్రత్యయాలు ఇ, ఏసి, మ. తె. లో భూతకాలిక క్రియా విశేషణ ప్రత్యయాలు ఇడిచు, ఎడిచులు. ఈ ప్రత్యయాలు తమిళంలోని 'విట్టు' పద సామ్యం వల్ల ఏర్పడ్డాయి.

ప్రా. తె. లో 'ఏక, నాక' భూతకాలిక క్రియా విశేషణాలు మ. తె. లో ఇన, వెనకలు భూతకాలిక క్రియావిశేషణాలు. 'వెనక' ప్రాచీన తెలుగులోని రూపం. అందువల్ల మ. తె. లో ప్రాచీన రూపాలు కొన్ని నిల్చి వున్నాయని చెప్పవచ్చు. తమిళంలోని 'పిన్, అప్పరం' పదాలు 'వెనక' అనే పదానికి సమాన అర్థకాలుగా, వాడబడుతున్నాయి.

ప్రా. తె. లో ఇన, అ, లు క్త్వవదర్థక ప్రత్యయాలు, మ. తె. లో 'ఏది' ప్రత్యయం కూడా కనపడుతోంది.

ఉదా : తీసేది, చూసేది.

ప్రా. తె. లో తున్నా, తాన్ లు వర్తమానకాలిక ప్రత్యయాలు. మ. తె. లో తుండా,

తాన్ లు వర్తమాన కాలిక ప్రత్యయాలు.

ప్రా. తె. లో 'తా' 'తాన్' లు భవిష్యత్కాల ప్రత్యయాలు. మ. తె. లో'తు' భవిష్యత్కాల ప్రత్యయం.

ప్రా.తె. లో వర్తమాన కాలిక క్రియా విశేషణం 'తూ' మద్రాసు తెలుగులో 'తా'. ప్రా. తె. లో భూతకాలేతర విశేషణం, ఏ, ఎట్ మ. తె. లో 'ఏ', ' అను' అనేవి భూత కాలేతర విశేషణాలు.

ప్రా. తె. లో లేదు, కాను భూత కాలిక వ్యతిరేకార్థాలుగా వాడబడుతున్నాయి. మ. తె. లో 'కాను' వ్యతిరేకార్థక పదంగా ఉపయోగింప బడడంలేదు.

ప్రా. తె. లో 'లేను' అనే భవిష్యత్కాలిక వ్యతిరేకార్థక క్రియకు బదులుగా మ. తె. లో 'మాల్డు' 'ముడియదు' అనే పదాలు వాడబడుతున్నాయి. ఇవి తమిళ భాషా ప్రభావం వల్ల ఏర్పడ్డ రూపాలు.

ప్రా. తె. లో 'అక' ప్రత్యయం, 'పో' ధాతువు యొక్క కృదంత రూపం, చేరడం వల్ల కృదంతాలు ఏర్పడుతున్నాయి. ఇటువంటి రూపాలు మ. తె. లో లేవు.

ప్రా. తె. లో ఛేదర్థక ప్రత్యయాలైన 'ఇతే, టే' లు మ. తె. లో కూడా వున్నాయి. కాని మ. తె. లో వీటిపై 'దా' అనే ప్రత్యయం చేరుతోంది.

ఉదా : ఎత్తి లేదా, తింటేదా

ఇది తమిళ భాషా ప్రభావం.

ప్రా. తె. లో ఏను, ఆను అనుమోద సూచక ప్రత్యయాలు. మ. తె. లో 'ఇనా' అనుమోద సూచక ప్రత్యయంగా వుంది. (చేసినా).

ప్రా. తె. లో తుమర్థక ప్రత్యయం - 'అ'. మ. తె. లో 'అను'

ఉదా : చెప్పను.

ప్రా. తె. లో ప్రార్థనాద్యర్థక ప్రత్యయం రూప శూన్య పదాంశం. మ. తె. లో ప్రార్థనాద్యర్థక ప్రత్యయం 'మి'.

ఉదా : పోమి, రామి

ప్రా. తె. లో ప్రార్థనాద్యర్థక బహువచన ప్రత్యయం 'అండి'. మ. తె. లో 'అండి' పై 'మి' ప్రత్యయం చేరుతోంది.

ఉదా : చెయ్యండి మి

ప్రా. తె. లో ఇచ్ఛార్థక ప్రత్యయం 'అలి'. మ. తె. లో 'వాలి'

ఉదా : చేయవాలి

పై పరిశీలన వల్ల మ. తె., ప్రా. తె. కంటే భిన్నమై విలక్షణంగా వుందని తేలింది.

☆☆☆☆☆

# 7. సంధి

అవ్యవహితోచ్చారణే సంధి అని భాషా శాస్త్రజ్ఞుల భావన.

"పూర్వ పర స్వరంబులకుం బరస్వరంబేకాదేశం బగుట సంధియనంబడు" [1] అని బాల వ్యాకరణ నిర్వచనం. కాని బాల వ్యాకరణానికి విరుద్ధమైన పరరూప సంధులు కొన్ని తెలుగులో కనబడుతున్నాయి.

మ.తె. లో 1. ప్రాతి పదికకు విభక్తి ప్రత్యయం పరమయ్యేప్పడు, 2. స్వతంత్ర పదాంశంపై స్వతంత్ర పదాంశం పరమయ్యేప్పడు సంధి కార్యాలు జరుగుతున్నాయి. సంధి జరిగిన సందర్భాల్లో ఒక వర్ణం ఆగమంగా రావడం కూడా జరుగుతుంది.

కోరాడ రామకృష్ణయ్యగారు "అచ్చుకు అచ్చు పరమయ్యేప్పడు, అచ్చుకు హల్లు పరమయ్యేప్పడు, హల్లుకు అచ్చు పరమయ్యేప్పడు, హల్లుకు హల్లు పరమయ్యేప్పడు సంధి ఏర్పడుతుందని" తమిళ వైయాకరుణుడైన తొల్కాపియనార్ చెప్పినట్లు 'సంధి' లో చెప్పారు.[2] కాని హల్లుకు హల్లు పరమయ్యేప్పడు ఏర్పడిన సంధి రూపాలు మ. తె. లో లేవు. వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణలోపాల వల్ల సంధి ఏర్పడుతుంది. ఈ అధ్యాయంలో మ. తె. లోని సంధి విధానం పరిశీలింప బడుతుంది.

మ. తె. లో వచ్చిన సంధి విధానాన్ని క్రింది విధంగా విభజింప వచ్చు.

## 7.1 రెండచ్చుల మధ్య జరిగే సంధి విధానం

| | | | | | |
|---|---|---|---|---|---|
| 7.1.1 | హ్రస్వాచ్చు | + | హ్రస్వాచ్చు | > | ∅ +హ్రస్వాచ్చు |
| 7.1.2 | హ్రస్వాచ్చు | + | హ్రస్వాచ్చు | > | దీర్ఘాచ్చు |
| 7.1.3 | హ్రస్వాచ్చు | + | దీర్ఘాచ్చు | > | దీర్ఘాచ్చు |
| 7.1.4 | హ్రస్వాచ్చు | + | దీర్ఘాచ్చు | > | హ్రస్వాచ్చు+ఆగమం+దీర్ఘాచ్చు |
| 7.1.5 | దీర్ఘాచ్చు | + | హ్రస్వాచ్చు | > | దీర్ఘాచ్చు+ఆగమం+హ్రస్వాచ్చు |
| 7.1.6 | దీర్ఘాచ్చు | + | దీర్ఘాచ్చు | > | దీర్ఘాచ్చు+ఆగమం+దీర్ఘాచ్చు |

## 7.1.1 హ్రస్వాచ్చు + హ్రస్వాచ్చు > ∅ + హ్రస్వాచ్చుగా మారడం

7.1.1.1 అ + అ > ∅ + అ

అత్త + అమ్మ = అత్తమ్మ

తంబ + అయ్య = తంబయ్య

అట్ల + అనేసి = అట్లనేసి

7.1.1.2 అ + ఉ > ∅ + ఉ

1. బాల వ్యాకరణం - చిన్నయసూరి, సంధి పరిచ్ఛేదం సూ. 1
2. సంధి - కోరాడ రామ కృష్ణయ్య P. 38

లేక + ఉండ = లేకుండ

ఎట్ల + ఉంటుంది = ఎట్లుంటుంది

7.1.1.3 ఇ + ఇ > ∅ + ఇ

పంపి + ఇస్తురు = పంపిస్తురు

అబ్బాయికి + ఇచ్చేరు = అబ్బాయికిచ్చేరు

7.1.1.4 ఇ + ఉ > ∅ + ఉ

ఏమి + ఉంది = ఏముంది

7.1.1.5 ఉ + అ > ∅ + అ

రసికుడు + అనేసి = రసికుడనేసి

నాళ్ళు + అయినాది = నాల్లయినాది

7.1.1.6 ఉ + ఇ > ∅ + ఇ

పంపు + ఇంచు = పంపించు

చిక్కు + ఇన = చిక్కిన

7.1.1.7 ఉ + ఉ > ∅ + ఉ

ఆవులు + ఉన్నాయి = ఆవులున్నాయి

పనులు + ఉన్నాయి = పనులున్నాయి

7.1.1.8 ఉ + ఒ > ∅ + ఒ

అద్దెకు + ఒచ్చిన = అద్దెకొచ్చిన

**7.1.2 హ్రస్వాచ్చు + హ్రస్వాచ్చు > దీర్ఘాచ్చు**

7.1.2.1 ఇ + ఇ > ఈ

పెట్టి + ఇడుస్తారు = పెట్టీడుస్తురు

7.1.2.2 ఉ + ఉ > ఊ

పోతు + ఉంది = పోతూంది

**7.1.3 హ్రస్వాచ్చు + దీర్ఘాచ్చు > దీర్ఘాచ్చు**

7.1.3.1 అ + ఏ > ∅ + ఏ

అట్ల + ఏమి = అట్లేమి

7.1.3.2 ఇ + ఏ > ∅ + ఏ

ఇచ్చి + ఏసి = ఇచ్చేసి

వచ్చి + ఏము = వచ్చేము

7.1.3.3 ఉ + ఏ > ∅ + ఏ

పొదచు + ఏది = పొదచేది

పూటు + ఏసుకొని = పూటేసుకొని

**7.1.4 హ్రస్వాచ్చు + దీర్ఘాచ్చు > హ్రస్వాచ్చు + ఆగమం + దీర్ఘాచ్చు**

7.1.4.1 ఉ + ఆ > అ + వ్ + ఆ

చేయు + ఆలి = చేయవాలి

**7.1.5 దీర్ఘాచ్చు + హ్రస్వాచ్చు > దీర్ఘాచ్చు + ఆగమం + హ్రస్వాచ్చు**

7.1.5.1 ఆ + అ > ఆ + య్ + అ

మా + అక్క = మా యక్క

7.1.5.2 ఈ + ఇ > ఈ + య్ + ఇ

మీ + ఇల్లు = మీ యిల్లు

**7.1.6 దీర్ఘాచ్చు + దీర్ఘాచ్చు > దీర్ఘాచ్చు + ఆగమం + దీర్ఘాచ్చు**

7.1.6.1 ఆ + ఊ > ఆ + య్ + ఊ

మా + ఊరు = మాయూరు

7.2 ఇంత వరకు రెండచ్చుల మధ్య జరిగిన సంధి మార్పులు వివరింపబడ్డాయి. ఇక ఒక అచ్చు, ఒక హల్లు మధ్య జరిగే సంధి మార్పులు వివరింపబడతాయి.

ఒక అచ్చు, ఒక హల్లు మధ్య జరిగే సంధి మార్పుల్ని క్రింది విధంగా వింగడింప వచ్చు.

7.2.1 అచ్చు + హల్లు > ∅ + దీర్ఘాచ్చు

7.2.2 అచ్చు + హల్లు > అచ్చు + ∅

7.2.3 అచ్చు + హల్లు > ∅ + ∅

**7.2.1 అచ్చు + హల్లు > ∅ + దీర్ఘాచ్చు**

7.2.1.1 అ + వా > ∅ + ఓ

అమ్మ + వాల్లది = అమ్మోల్లది

అయ్య + వారు = అయ్యోరు

7.2.1.2 అ + లో > ∅ + లో

మొదట + లో = మొదట్లో

7.2.1.3 ఇ + దా > ∅ + దా

కలిపి + దా = కల్పిదా

తెలిచి + దా = తెల్చిదా

7.2.1.4 ఇ + లే > ∅ + లే

పని + లేదు = పల్లేదు

7.2.1.5 ఉ + కా > ∅ + కా

ఎదురు + కా = ఎదుర్కా

7.2.1.6 ఉ + కో > ∅ + కో

తీసు + కో = తీస్కో

7.2.1.7 ఉ + తా > ∅ + తా

వాడు + తాము = వాడ్తాము

7.2.1.8 ఉ + దా > ∅ + దా

పోటీలు + దా = పోటీల్దా

7.2.1.9 ఉ + నా > ∅ + నా

కొట్టు + నారు = కొట్నారు

7.2.1.10 ఉ + రో > ∅ + రో

మరు + రోజు > మర్రోజు

7.2.1.11 ఉ + లో > ∅ + లో

కారు + లో = కార్లో

7.2.1.12 ఉ + వా > ∅ + ఓ

నాయుడు + వాళ్లు = నాయుడోళ్లు

## 7.2.2 అచ్చు + హల్లు > అచ్చు + ∅

7.2.2.1 అ + వా > ∅ + ∅

తెల్ల + వార్తె = తెల్లార్తె

7.2.2.2 ఉ + కొ > ఇ + ∅

ఎత్తు + కొని = ఎత్తిని

## 7.2.3 అచ్చు + హల్లు ∅ + ∅

ఉ + నా > ∅ + ∅

ఉండు + నారు = ఉండ్రు

విను + నారు = వింట్రు

మ. తె. లో సంధి జరిగేప్పుడు క్రింది ధ్వని సంబంధితమైన మార్పులు ఏర్పడ్డాయి.

## 7.3 లోప దీర్ఘత

తెలియ + లేదు = తెలీలేదు

పండిన + ఆకు = పండాకు

### 7.4 యడాగమం

| | | |
|---|---|---|
| మా + అక్క | = | మాయక్క |
| మీ + ఊరు | = | మీయూరు |

### 7.5. రుగాగమం

| | | |
|---|---|---|
| కుటుంబం + ఆలు | = | కుటుంబరాలు |
| కాళి + హస్తి | = | కాళాస్తి |

### 7.6 ఔప విభక్తికం

| | | |
|---|---|---|
| అత్తగారిల్లు + సొత్తు | = | అత్తగారింటి సొత్తు |

### 7.7 ఆదేశం గ > క

| | | |
|---|---|---|
| జరుగు + కుంటారు | = | జరుక్కుంటారు |
| వ > ప | | |
| సొంద + వాల్లు | = | సొందపోల్లు |

### 7.8. అక్షర లోపం + వకారాదేశం

| | | |
|---|---|---|
| బాగు + ఉండారు | = | బావుండారు |

### 7.9 లోపం + ద్విత్వం

| | | |
|---|---|---|
| పని + లేదు | = | పల్లేదు |

### 7.10 అచ్చులోపం + సంశ్లేషం

| | | |
|---|---|---|
| కొట్టు + నారు | = | కొట్నారు |

### 7.11 శ్వాసం నాదంగా మారడం

| | | |
|---|---|---|
| ధార + పోసుకొను | = | ధారబోసుకొను |

### 7.12 గసడదవాదేశం

| | | |
|---|---|---|
| సెలవు + చేసేది | = | సెలవు సేసేది |

### 7.1.3 అక్షర లోపం

| | | |
|---|---|---|
| బాగు + లేక | = | బాలేక |

పై పరిశీలన వల్ల ప్రా. తె. కు, మ. తె. కు సంధి స్వరూపంలో ఎక్కువ భేదం లేదని తెలిందిి. కాని మ. తె. లో పద మధ్యాచ్చు లోపించడం వల్ల సంశ్లేషంతో కూడిన రూపాలు ఏర్పడినట్లు కనబడుతున్నాయి. కొన్ని సందర్భాల్లో ద్విత్వాల్తో కూడిన రూపాలు కనబడు తున్నాయి. ఈ ద్విత్వ రూపాలు ఏర్పడ్డానికి కారణం తమిళ భాషా ప్రభావం.



# 8. మద్రాసు తెలుగు భాష - సాంఘిక విశేషాలు

ఇంతవరకు మద్రాసు నగరంలోని తెలుగు వారి సాంఘిక, సామాజిక స్థితిగతులు, మ. తె. లో ఏర్పడ్డ ధ్వని మార్పులు, రూప నిర్మాణం, సంధి గత మార్పులు, మ. తె. లో ప్రవేశించిన అన్య దేశ్యాలు మున్నగు వాటిని గూర్చి పరిశీలించడం జరిగింది. ఈ మార్పులు ఏర్పడ్డానికి కారణాలైన సాంఘిక, సామాజిక, ఆర్థిక పరిస్థితుల్ని ఈ అధ్యాయంలో వివరించడం జరుగుతుంది. ఈ కారణాల వల్ల మ. తె. లో ఏర్పడ్డ విలక్షణాలు కూడా ఈ అధ్యాయంలో చర్చించ బడతాయి.

మద్రాసు బహుభాషా వ్యవహృత ప్రాంతమని ముందే చెప్పబడింది. మద్రాసు నగరంలోని భిన్న భాషా వ్యవహర్తలకు ఆంగ్లం సంధాన భాషగా వాడబడుతోంది.

మద్రాసు నగరం లోని తెలుగు ప్రజలు బయట తెలుగు భాషను మాట్లాడే అవకాశం చాలా తక్కువ. రాజకీయ కారణాల వల్ల భారత దేశంలో ఆంగ్ల భాషకు ఉన్నత స్థానం ఏర్పడింది. మద్రాసు నగరం తమిళనాడు రాష్ట్రంలో వుండడం వల్ల రాష్ట్ర భాషయైన తమిళానికి ప్రముఖ స్థానం లభించింది. కాబట్టి మద్రాసులోని తెలుగు వారు సమాజంలో ఆంగ్ల భాషనో లేక తమిళ భాషనో తప్పని సరిగా మాట్లాడవలసి వస్తోంది. అందు వల్ల ఆంగ్ల, తమిళ భాషలు మ. తె. ను ప్రభావితం చేశాయి.

మద్రాసు లోని పాఠశాలల్లో, కళాశాలల్లో బోధనా మాధ్యమం తమిళంలేక ఆంగ్లం. తెలుగులో బోధనా మాధ్యమం చాలా తక్కువ. కళాశాలలో తెలుగులో బోధన లేదు. అందువల్ల మద్రాసులోని తెలుగు వారు ఆంగ్ల భాషనో, తమిళ భాషనో తప్పని సరిగా ఆశ్రయించవలసి వస్తోంది. కాబట్టి మద్రాసు నగర సాంఘిక పరిస్థితులు తెలుగు భాషను ప్రభావితం చేశాయి.

మద్రాసులో పాలకుల భాష తమిళం కావడం వల్ల ప్రభుత్వ కార్యాలయాల్లోను, ప్రవేటు సంస్థల్లోను తమిళ భాష ప్రాచుర్యాన్ని పొందింది. ఉద్యోగావకాశాల కోసం మద్రాసులోని తెలుగువారు అనేకులు తమిళ భాషని నేర్చుకోవలసి వస్తోంది. వ్యాపార రంగంలో కూడ ఆంగ్ల, తమిళ భాషలు ఎక్కువ ఉపయోగంలో వుండడం వల్ల మ. తె. ఈ రెండు భాషల ప్రభావానికి గురయ్యింది.

ఈ విధంగా అనేక సాంఘిక, రాజకీయ కారణాల వల్ల మద్రాసులోని తెలుగువారు అన్య భాషా ప్రభావితులవడం వల్ల ఇంట్లో తెలుగును మాట్లాడేటప్పుడు ప్రా. తె. కంటె భిన్నమైన తెలుగును వ్యవహరిస్తున్నారు.

మ. తె. భాషలోని విలక్షణతని గుర్తించడానికిగాను మ. తె. లోని ప్రత్యేక పదజాలాన్ని గ్రహించి వివరించాల్సి వుంది.

వ్యవహర్తల కులం, ప్రాంతం, వయసు, హోదా, లింగ వివక్ష మొదలైనవి భాషా విధ్యానికి కారణాలవుతున్నాయి. ఈ కారణాలవల్ల ఏర్పడ్డ భాషా విశేషాల్ని క్రింది విధంగా ర్తించవచ్చు.

రెడ్డి కులస్థులు మద్రాసులో అధిక సంఖ్యలో వుండి తమిళులతో కలిసిపోయి తమిళ భాషా సంస్కృతుల ననుసరించడంవల్ల వీరి భాషా సంస్కృతులు ప్రత్యేకతను సంతరించుకున్నాయి. వీరి భాష ద్వారా అనేక సాంఘిక విశేషాలను తెలుసుకోవచ్చు. భాషతోపాటు వివాహాచారాల్లో కూడా తమిళ సంప్రదాయాన్ననుసరించడంవల్ల సాంఘిక ఆచారాలకి సంబంధించిన తమిళ పదాలు వీరి భాషలో చోటు చేసుకున్నాయి. ఉదా :- ఆచారం అనే పదానికి బదులుగా 'సాంగ్యం' అనే తమిళ పదాన్ని వాడడం కనబడుతోంది.

దాయాదులు అనే తెలుగు పదానికి తమిళంలో పంగాళి సమానార్థకం. 'పంగు' అంటే వాటా అని 'ఆళు' అంటే మనుషులు అని తమిళంలో అర్థం. ఆస్తిలో వాటా పంచుకొనేవారు కాబట్టి దాయాదులు అనే పదానికి బదులుగా 'పంగాళి' వాడబడింది. మద్రాసులోని రెడ్డియార్ల వ్యవహారంలో 'పంగాళి' పదం వినబడుతోంది.

రెడ్డియార్ల తరువాత మద్రాసులోని నాయుడు కులస్థుల భాష ఎక్కువగా తమిళ బాషా సంస్కృతుల ప్రభావానికి లోనయ్యింది. వీరు తమిళులతో కలిసిపోయి తమిళ సంస్కృతిని అనుసరించడం వల్ల ఆచార వ్యవహారాలకి సంబంధించిన తమిళ పదజాలం ఈ కులస్థుల్లో కనబడుతోంది. ప్రా. తె. లో 'లాంఛనాలు' అనే పదం వీరిలో 'సీర్‌వరిసె' గాను, కట్నం అనే పదం 'సీదనం'గాను వ్యవహరింప బడుతున్నాయి.

మద్రాసు లోని దేవాంగ కులస్థులు ఇప్పటికినీ తమ కుల వృత్తిని చేస్తూ దాదాపు ఒకే ప్రాంతంలో నివసించడం వల్ల వీరిభాషా సంస్కృతుల్లో పెద్ద మార్పు కలుగ లేదు. కాని వీరి భాషా సంస్కృతులపై కూడ తమిళ భాషా సంస్కృతుల ప్రభావం లేకపోలేదు.

ఉదా :- అడికడి., సొత్తు., అరకొర., వెలవాసి వంటి తమిళ పదాలు వీరిలో కనబడుతున్నాయి.

మద్రాసులోని చాకలి వారు 'సెలవయాలర్' సంఘాన్ని స్థాపించుకున్నారు. ఈ సంఘంలో మద్రాసులోని చాకలి కులానికి చెందిన తమిళులు, తెలుగువారు ఉన్నారు వీరు సాంస్కృతిక భేదం లేకుండా ఒకటిగా జీవిస్తున్నారు. అందువల్ల తమిళ తెలుగు మిశ్రితమైన సంస్కృతి వీరిలో కనబడుతోంది.

మాల, మాదిగ కులాల వారు సాంఘికంగా ఆర్థికంగా వెనుకబడి వుండడంచే మద్రాసులో వీరు మిగిలిన వర్ణాల వారితో కలియక ప్రత్యేకంగా నివసిస్తున్నారు. కొ తరాల క్రిందట వీరు మద్రాసుకు వలసపోయి జీవిస్తున్నా ప్రత్యేక తెగగా జీవించడంవల్ల వీరిపై తమిళ భాషా సంస్కృతుల ప్రభావం తక్కువగా కనబడుతోంది.

వ్యవహర్తలు వలస వచ్చిన ప్రాంతాన్ని బట్టి కూడా భాషా సాంఘిక విశేషాలు ఏర్పడతాయి. ఉదా :- చిత్తూరు, నెల్లూరు నుండి వచ్చిన వారిలో తమిళ భాషా సంస్కృతుల ప్రభావం ఎక్కువగా కనబడుతోంది. ఆంధ్రరాష్ట్రంలోని ఇతర ప్రాంతాల నుండి ముఖ్యంగా కోస్తా జిల్లాల నుండి వచ్చిన వారిలో తమిళ భాషా సంస్కృతుల ప్రభావం తక్కువగా కనబడుతోంది.

ఉన్నత హోదాలో వున్న వ్యక్తి వ్యవహరించే పద జాలం అన్య భాషా ప్రభావితమై వుంటుంది. మ. తె. వారిలో వున్నత హోదాలో గల వ్యవహర్తల్లో ఆంగ్ల భాషా సంస్కృతుల ప్రభావం అధికంగాను, తక్కువ హోదాగల వారిలో తమిళ సంస్కృతి అధికంగాను కనబడుతోంది.

లింగ వివక్షననుసరించి కూడా భాషా విలక్షణతను, సాంఘిక విశేషాల్ని గుర్తించవచ్చు. మ. తె. వారిలో స్త్రీ, పురుష సంభాషణల్లో భేదం కనిపిస్తోంది. సంస్కృతి, ఆచారాలకు సంబంధించిన ప్రభావం స్త్రీలలో అధికంగా కనబడుతోంది. స్త్రీ, పురుష సంబోధనల్లోకూడా భేదం కనిపిస్తోంది. సంఘంలో పురుషుడికి అధిక స్థానం వుండడంవల్ల వారి భాషలో గౌరవ వాచకాలు తక్కువగా కనబడుతున్నాయి. ఉదా :- ఏమే., ఒసే., లాంటి పదజాలం భార్యని సంబోధించేటప్పడు వాడబడుతున్నాయి.

మద్రాసులోని తెలుగు వారు చాలా వరకు ఇతర ప్రాంతాల నుండి వలసపోయి మద్రాసులో స్థిర నివాసమేర్పరచుకొని మేనరికాలనే చేసుకోవడం వల్ల ప్రామాణిక తెలుగులోని కొన్ని బంధు వాచకాలు మ. తె. లో ఏర్పడ్డాయి. వీటి వల్ల అనేక సాంఘిక విశేషాల్ని తెలుసుకోవచ్చు.

బంధువాచకాలు ప్రాథమిక పదజాలంలో ఒక భాగం. బాంధవ్య పదజాలం సామాన్య భాషా శాస్త్రంలో ఒక ముఖ్యవిభాగం. దేశ చరిత్ర, జాతి సంస్కృతి, సాంఘిక జీవన విధానం, భాషా విశేషాలు మొదలైన విషయాల్ని తెలుసుకోవడానికి బాంధవ్య పదజాలం సామాజిక భాషా శాస్త్రజ్ఞులకు, భాషా వేత్తలకు ఉపకరిస్తోంది.

సామాన్యంగా ప్రాథమిక పదజాలం మార్పులకు గురికాదు. కాని మ. తె. ను పరిశీలిస్తే బంధువాచక పదజాలం కూడ అన్య భాషా ప్రభావితమైనట్లు కనబడుతోంది.

ఉదా :- మమ్మీ, డాడి, ఆంటీ, అంకుల్ మున్నగునవి.

ప్రా. తె. లో తండ్రి సోదరుని, తల్లి సోదరుని చిన్నాన్న, మామయ్య అని వేరు వేరుగా సంబోధించడం జరుగుతోంది. కాని ఆంగ్ల భాషలో ఈ రెండు బంధువాచకాలకు 'అంకుల్' అనే పదం వాడబడుతోంది. మ. తె. లో కూడా ఈ అంకుల్ పదం కనబడుతోంది. అలాగే 'ఆంటీ' పదం అత్తయ్యకు, పిన్నమ్మకు పర్యాయ పదంగా వ్యవహరింప బడుతోంది. ఇవికాక మదర్, ఫాదర్, ఫాదరిన్‌లా, సిస్టరిన్‌లా, మదరిన్‌లా లాంటి పదాలు మ. తె. వారి వాడుకలో ఎక్కువగా కనబడుతున్నాయి. ఇలా ఆంగ్ల పదజాలాన్ని ఉపయోగించ డానికి కారణం సాంఘిక పరిస్థితులే.

'అత్త' బంధువాచకానికి 'అత్తమ్మ', 'అత్తయ్య', 'అత్తగారు' మున్నగునవి పర్యాయ పదాలుగా వాడబడుతున్నాయి. తండ్రి సోదరితో రక్త సంబంధం వుంది కాబట్టి సామీప్యాన్ని సూచించే విధంగా 'మేనత్త' అనే పదానికి 'అత్తమ్మ' అనే బంధువాచకం వాడబడుతోంది. భర్త తల్లిని నిర్దేశించేటప్పడు అత్తగారు, అత్తయ్య అనే పదాలు వాడబడుతున్నాయి. ంఘికంగా వున్నతమైన బ్రాహ్మణ, రెడ్డి, వైశ్య కులాల్లో 'గారు' పూజ్యార్థక ప్రత్యయం

వాడబడుతోంది. మేనరికం చేసుకుంటే భర్త తల్లితో రక్త సంబంధముంటుంది. కనుక భర్త తల్లి అత్తమ్మ అని వ్యవహరింపబడుతోంది.

భర్తను నిర్దేశించేటప్పుడు కులవాచకం చేర్చి వాడడం కొన్ని కులాల్లో కనిపిస్తోంది. ముఖ్యంగా సాంఘికంగా వున్నతమైన రెడ్డి, వైశ్య కులాల్లో ఈ పద్ధతి కనిపిస్తోంది.

ఉదా :- మారెడ్డి గారు, మా శెట్టి గారు.

ఈ కుల వాచకాలతో పాటు 'గారు' పూజ్యార్థక ప్రత్యయం చేర్చి వ్యవహరిస్తున్నారు. సాంఘికంగా వెనుకబడ్డ మాల, మాదిగ కులాల్లో భర్తని 'మావ' అని నిర్దేశించడం జరుగుతోంది. గృహస్థాశ్రమంలో పురుషుడికి వున్నతమైన హోదా వుండడం వల్ల సాంఘికంగా వున్నతమైన కొన్ని కులాల్లో ముఖ్యంగా బ్రాహ్మణ కులంలో భర్తకు నిర్దేశక పదం కనబడ్డంలేదు. గృహానికి యజమాని అనే అర్థంలో 'ఇంటాయన' పదం కూడా భర్తకు నిర్దేశక పదంగా నాయుడు, చాకలి కులాల్లో వాడబడుతోంది.

ప్రా.తె. లో తనకంటే పెద్దవాడైన మేనత్త కొడుకుని, మేనమామ కొడుకుని 'బావ' అని, ,చిన్న వాడైతే బావ మరిది అని, భార్య సోదరుని బావమరిది అని నిర్దేశించడం జరుగుతుంది. కాని మ. తె. లో ఈ పదాలన్నింటికి బదులుగా 'మామ' వాడబడుతోంది. మద్రాసులోని తెలుగు వారు ఎక్కువగా మేనరికాలను చేసుకోవడం వల్ల ఈ పదం వాడబడుతోందని చెప్పవచ్చు. మేనమామని గాని, మేనమామ కొడుకుని గాని వివాహం చేసుకొన్నా 'మామ' అని సంబోధించడం జరుగుతోంది. ముఖ్యంగా మద్రాసులోని రెడ్డి, నాయుడు, చాకలి, మాల, మాదిగ కులాల్లో ఈ పద్ధతి కనిపిస్తుంది.

'అమ్మ' సంబోధనా పదంగాను, నిర్దేశక పదంగాను వాడబడుతోంది సాంఘికంగా వున్నతమైన వారిలోను, విద్యాధికుల్లోను 'అమ్మ'ను 'మదర్' అని నిర్దేశించడం జరుగుతుంది. తెలుగు 'అమ్మ' కు 'సంస్కృత' 'మాత' సమానార్థకం. 'మాత' అని తల్లిని ఎవరు సంబోధించడం గాని, నిర్దేశించడంగాని జరగదు. కాని మద్రాసులోని మాది కులస్థులో ఈ పదం వాడబడింది. దీనికి కారణం క్రైస్తవ మత ప్రభావం. మాదిగ కులస్థుల తాము మాతంగి మహర్షి వంశానికి చెందిన వారమని, మాతంగి తమ కుల దైవమని చెప్పకుంటారు. ఈ మాతంగి దేవతను 'మాత' అని వ్యవహరించడం వల్ల తల్లికి కూడ మాత అనే పదం వీరు వాడుతున్నారని చెప్పవచ్చు.

వియ్యంకులు అనే బంధువాచకం 'సంబంది' అని వాడబడుతోంది. తమిళంలో 'సమ్మంది' అంటే సంబంధం కలుపుకొన్న వారు అని అర్థం. అదే అర్థంలో మ. తె. నాయుళ్లలో ఈ పదం వాడబడుతోంది.

పూజ్యార్థక ప్రత్యయాలు ఆయా జాతి సంస్కృతికి ప్రతీకలు. వీటిననుసరించి కూడా సాంఘిక విశేషాల్ని తెలుసుకోవచ్చు. మ. తె. లో అమ్మ, అయ్యగారు అనే పూజ్యార్థక ప్రత్యయాలు కనబడుతున్నాయి. కులాల ననుసరించి, సాంఘిక స్థాయిననుసరించి ఈ ప్రత్యయాలు వాడబడు తున్నాయి. తరువాత పేజీల్లోని పట్టికల్లో ఆయా కులాల్లోని పూజ్యార్థక ప్రత్యయ వివరణ ఇవ్వబడింది.

| పూజ్యార్థక ప్రత్యయాలు | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| అమ్మ | + | + | + | + | + | + | | + | |
| అయ్య | | | + | + | + | + | | + | |
| గారు | + | | + | + | + | | | | |

గమనిక :- ఆయా పట్టికల్లో ఇవ్వబడ్డ సంఖ్య కులాలను సూచిస్తుంది.

1. రెడ్డి, 2. నాయుడు, 3. దేవాంగ, 4. బ్రాహ్మణ, 5. వైశ్య, 6. విశ్వబ్రాహ్మణ, 7. చాకలి, 8. మాల, 9. మాదిగ.

| పూజ్యార్థక ప్రత్యయం - అమ్మ | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| అత్తమ్మ | | | + | | + | + | | | |
| పెద్దమ్మ | | | + | + | | + | | | |
| చిన్నమ్మ | + | + | | | | | | + | |

| పూజ్యార్థక ప్రత్యయం - అయ్య | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| అక్కయ్య | | | + | + | | | | | |
| అత్తయ్య | | | + | + | | | | | |
| తాతయ్య | | | | | + | | | | |
| జేజయ్య | | | | | | | | + | |

| పూజ్యార్థక ప్రత్యయం - గారు | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| అత్తగారు | + | | | + | | | | | |
| తాతగారు | | | | | + | + | | | |
| నాన్నగారు | | | + | + | + | | | | |
| బావగారు | | | | + | + | | | | |
| మామగారు | | | | + | + | | | | |
| శెట్టిగారు | | | | | + | | | | |

అమ్మ పూజ్యార్థక ప్రత్యయం చాలా వరకు అన్ని కులాల్లోను కనబడుతోంది. చాకలి మాదిగ కులాల్లో మాత్రం కనబడ్డంలేదు. గౌరవ ప్రత్యయాలు సాధారణంగా సంఘంలో వ్యక్తి యొక్క హోదాను బట్టి వాడడం జరుగుతుంది. కాని ఈ కులం వారిలో అటువంటి సందర్భంలో కూడా గౌరవ వాచకాలు కనబడ్డంలేదు.

అయ్య అనే పూజ్యార్థక ప్రత్యయం దేవాంగ, బ్రాహ్మణ, వైశ్య, విశ్వబ్రాహ్మణ కులాల్లో వాడబడుతోంది. 'జేజయ్య' అనే పదం 'మాల' కులం వారిలో కూడా కనబడుతోంది. వీరు తండ్రిని 'అయ్య' అని సంబోధిస్తారు. అందువల్ల తాతయ్యపదానికి బదులు జేజయ్య పదం వీరిలో కనబడుతోంది.

'గారు' పూజ్యార్థక ప్రత్యయం రెడ్డి, దేవాంగ, బ్రాహ్మణ, వైశ్య, విశ్వ బ్రాహ్మణ కులాల్లో మాత్రమే కనబడుతోంది. తక్కిన కులాల్లో ఈ ప్రత్యయం వాడబడడం లేదు.

తమిళ భాషలో పూజ్యార్థక ప్రత్యయాలు లేవు. నాయుడు, రెడ్డి కులాల వారి భాషపై తమిళ భాషా ప్రభావం ఎక్కువగా వుండడం వల్ల పూజ్యార్థకప్రత్యయాలు వీరి భాషలో సామాన్యంగా కనబడ్డంలేదు.

చాకలి వారు, మాల వారు, మాదిగవారు ఇప్పటికీ కులవృత్తి చేసుకుంటూ ఇతర కులాల వారితో కలియక ప్రత్యేకంగా నివసిస్తున్నందువల్ల వీరి భాషపై అన్య భాషా ప్రభావం తక్కువగా వుంది. అంతేకాక సాంఘికంగా వెనుకబడి వుండడం వల్ల వీరి భాషలో పూజ్యార్థక ప్రత్యయాలు కనబడ్డంలేదు.

మాల మాదిగ కులాల వారి భాష ప్రాచీన తెలుగు భాషకి దగ్గరగా వుంది ప్రాచీన తెలుగు భాషలోని రూపాలు కొన్ని ప్రా. తె. లో నశించాయి. కానీ వీరి భాషను పరిశీలిస్తే ప్రా. తె. లో నశించిన ప్రాచీన తెలుగు రూపాలు కొన్ని వీరి వ్యవహారంలో వున్నట్లు తెలుస్తుంది.

ఉదా :- నంబిక (నమ్మకం)

పెండ్లి (పెళ్ళి) మొదలైన అనుస్వారంతో కూడిన రూపాలు ప్రా. తె. లో నశించాయి. మ. తె. లో నిలిచి వున్నాయి. మ. తె. లో కోండలు, కూంతురు, కోంతి అనే పదాల్లో దీర్ఘం మీద పూర్ణానుస్వారోచ్చారణ వుంది. ఇటువంటి ప్రాచీన పదజాలం వీరిలో ఇంకా నిలిచి వుండడానికి కారణం సామాజిక పరిస్థితులే. సంఘంలో వీరు కడజాతి వారుగా పరిగణింపబడడం వల్ల ఇతరులతో కలియకుండా ప్రత్యేకంగా జీవించడం వల్ల వీరి భాష అన్య భాషా ప్రభావితం కాక ప్రాచీనత్వాన్ని నిలుపుకొంది.

సాంఘికంగా వున్నతమైన కులాల వారికంటే తక్కువ కులాల వారి భాష ఎక్కువగా ధ్వని సంబంధమైన మార్పులకు లోనైనట్లు కనబడుతోంది. ఉదా :- సదువు., సద్దన్నం., సినాయన., సామి., మొదలైన పదాలు ఎక్కువగా చాకలి, మాల, మాదిగ కులాలవారి వ్యవహారంలో వినబడుతున్నాయి.

మూర్ధన్యాక్షరాలను వాడడం వున్నతమైన భాషా సంస్కృతులకు నిదర్శన

మ. తె. భాషను పరిశీలిస్తే నాయుడు కులస్థుల్లో మూర్ధన్యేతరాలను వాడవలసిన చోట మూర్ధన్యాలను వాడినట్లు తెలుస్తుంది. ఉదా :- వణ్ణం, అణ్ణ., దీనికి కారణం తమిళ భాషా ప్రభావమని చెప్పవచ్చు.

ఒక వ్యక్తి యొక్క భాషోచ్చారణా పద్ధతులు ఆ వ్యక్తి యొక్క సాంఘిక స్థాయిని తెలియజేస్తాయి. ఉదా :- ఏడ, ఆడ, ఛినిమా, ఇంది లాంటి పదాలు సాంఘికంగా తక్కువ స్థాయిలో వున్న చాకలి, మాల మాదిగ కులాల వారి వ్యవహారంలో ఎక్కువగా వినబడుతున్నాయి.

సంయుక్తాన్ని అసంయుక్తంగా పలకడం కూడా మాల, మాదిగ కులాలకు చెందిన వ్యవహర్తల్లో ఎక్కువగా కనబడుతోంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | వ్యవహారం | > | యవారం |
| | బ్రాహ్మణులు | > | బాపనోల్లు |
| | వ్యవసాయం | > | వివసాయం |
| | అక్షరం | > | అచ్చరం |

పురోహితుడు అనే పదానికి బదులుగా రెడ్డి, నాయుడు, చాకలి, వైశ్య కులాలకు చెందిన వారు అయ్యోరు, అయ్యవారు అనే పదాల్ని వాడుతున్నారు.

నేడు చాలా వరకు కుల వృత్తిని విడిచిపెట్టి వున్నత విద్యను అభ్యసించి వున్నత పదవుల్లో వుండడం వల్ల మాల, మాదిగ కులాల వారిలో కూడ వున్నత భాషా సంస్కృతులు కనబడుతున్నాయి. ఉదా :- పురోహితుడు., కుమార్తె., తృష్ణ., స్పర్థ, హైందవ వంటి పదాలు మాదిగ కులానికి చెందిన వ్యవహర్తల్లో వినబడుతున్నాయి.

కులం వల్ల, విద్యార్హతల వల్ల నామవాచకాల్లో ఆయా వ్యవహర్తల్లో ఎక్కువ భేదం కనిపిస్తుంది.(నిష్పత్తికి చూడండి పట్టికలు 1, 2, 3) క్రియల్లో భేదం అంతగా లేదు. (నిష్పత్తికి చూడండి పట్టికలు 5, 6, 7) నామ వాచకాలకి పర్యాయ పదాలు ఎక్కువగా వుండడం వల్ల ఎక్కువ భేదాలు ఏర్పడ్డాయని చెప్పవచ్చు. ధ్వని సంబంధమైన మార్పులు కూడా క్రియల్లో ఎక్కువగా కనబడ్డం లేదు. సాధారణంగా ప్రాతి పదికకు ప్రత్యయాలు చేరిన రూపాలే ధ్వని సంబంధితమైన మార్పులకు గురవుతాయి. అందువల్ల క్రియా ప్రాతిపదికల్లో ధ్వని సంబంధిత మార్పులు ఎక్కువగా కనబడ్డం లేదు.

పై పరిశీలనలో అగ్ర కులాలని చెప్పకొనబడుతున్న బ్రాహ్మణ, రెడ్డి, నాయుడు కులాల్లో ఆంగ్ల భాషా ప్రభావం ఎక్కువగా వున్నట్లు కనబడుతోంది. (నిష్పత్తికి చూడండి పట్టికలు 1, 2)

తక్కువ కులాల వారిలో కూడా ఉన్నత విద్యార్హతలు కలవారిలో ఆంగ్ల భాషా ప్రభావం ఎక్కువగా కనబడుతోంది. ఉదాహరణకు చాకలి, మాల (నిష్పత్తికి చూడండి పట్టిక 3) ఉన్నత విద్యార్హతలు కల వారు సంఘంలో వున్నత స్థాయిలో వుండి అనేక

మంది భిన్న భాషా వ్యవహర్తలతో మెలగుతూ వుంటారు. కాబట్టి వారి భాషలో సంధాన భాష (link language) యైన ఆంగ్ల భాషా ప్రభావం ఎక్కువగా కనబడుతోంది. నిరక్షరాస్యులపై తమిళ భాషా ప్రభావం ఎక్కువగా కనబడుతోంది. (నిష్పత్తికి చూడండి పట్టిక 4) దీనికి కారణం వీరు నివసించు పరిసర ప్రాంతాల ప్రభావం. ప్రాథమిక విద్యార్హతలు గల వారిలో తమిళ, ఆంగ్ల భాషా ప్రభావాలు సమానంగా కనబడుతున్నాయి.

విశ్వ బ్రాహ్మణ, చాకలి, దేవాంగ కులాల్లో తమిళం ఆంగ్లం మిశ్రితమై కనబడుతోంది. మాల, మాదిగ, కులాల్లో తమిళ భాషా ప్రభావం అధికంగా వున్నట్లు కనబడుతోంది. (నిష్పత్తికి చూడండి పట్టికలు 1, 2) దీన్నిబట్టి సాంఘికంగా వున్నత స్థాయిలో వున్న వారిలో ఆంగ్ల భాషా ప్రభావం అధికంగాను, మధ్యస్తుల్లో రెండు భాషల ప్రభావం సమానంగాను తక్కువ స్థాయిలో వున్న వారిలో తమిళ భాషా ప్రభావం అధికంగాను వున్నట్టు తేలింది.

ఉద్యోగస్థులైన స్త్రీ పురుషుల్లోను, పెద్ద పెద్ద వ్యాపారుల్లోను ఆంగ్ల భాషా ప్రభావం అధికంగా కనబడుతోంది. గృహిణుల్లో తమిళ భాషా ప్రభావం అధికంగా వుంది. ఆర్థికంగా వున్నత స్థాయిలో వున్నవారి భాషలో ఆంగ్ల భాషా ప్రభావం ఎక్కువగాను ఆర్థికంగా వెనుక బడిన వారి భాషలో తమిళ భాషా ప్రభావం ఎక్కువగాను కన్పిస్తుంది.

పై పరిశీలన వల్ల సాంఘిక, సామాజిక, ఆర్థిక పరిస్థితులు మ. తె. భాషను ఎలా ప్రభావితం చేశాయో, తత్ఫలితంగా మద్రాసు తెలుగు ప్రా. తె కంటె ఏ విధంగా విలక్షణతను పొందిందో తెలిసింది.



# పట్టిక - 1 నామ వాచకాలు

## వ్యవహర్తల వారిగా భాషాపద ప్రయోగ శాతం

| | స్త్రీలు | | | | | | | | | పురుషులు | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కులం | వివిధ భాషా పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల పదాల శాతం | తమిళ పదాలు | తమిళ పదాల శాతం | ఆంగ్ల తమిళ పదాలు | ఆంగ్ల తమిళ పదాల శాతం | తెలుగు పదాలు | తెలుగు పదాల శాతం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల పదాల శాతం | తమిళ పదాలు | తమిళ పదాల శాతం | ఆంగ్ల తమిళ పదాలు | ఆంగ్ల తమిళ పదాల శాతం | తెలుగు పదాలు | తెలుగు పదాల శాతం |
| రెడ్డి | 321 | 50 | 15.57 | 41 | 12.77 | 91 | 28.34 | 230 | 71.65 | 248 | 20 | 8.06 | 30 | 12.09 | 50 | 20.16 | 198 | 79.83 |
| నాయుడు | 213 | 32 | 15.02 | 28 | 13.14 | 60 | 28.16 | 153 | 71.83 | 242 | 20 | 8.26 | 58 | 23.96 | 78 | 32.23 | 164 | 67.76 |
| దేవాంగ | 256 | 12 | 4.68 | 46 | 17.96 | 58 | 22.65 | 198 | 77.34 | 218 | 82 | 37.61 | 11 | 5..04 | 93 | 42.66 | 125 | 57.34 |
| బ్రాహ్మణ | 248 | 16 | 6.45 | 38 | 15.32 | 54 | 21.77 | 194 | 78.22 | 211 | 92 | 43.06 | 8 | 3.79 | 100 | 47.39 | 111 | 52.60 |
| వైశ్య | 242 | 18 | 7.43 | 10 | 4.13 | 28 | 11.57 | 214 | 88.42 | 187 | 26 | 13.90 | 19 | 10.16 | 45 | 24.06 | 142 | 75.93 |
| విశ్వ బ్రాహ్మణ | 193 | 12 | 6.21 | 23 | 11.91 | 35 | 18.13 | 158 | 81.86 | 246 | 25 | 10.16 | 10 | 4.06 | 35 | 14.22 | 211 | 85.77 |
| చాకలి | 248 | 91 | 36.69 | 48 | 19.35 | 139 | 56.04 | 109 | 43.95 | 218 | 18 | 8.25 | 43 | 19.72 | 61 | 27.98 | 15.7 | 72.01 |
| మాల | 215 | 38 | 17.67 | 36 | 16.74 | 74 | 34.41 | 141 | 65.58 | 182 | 26 | 14.28 | 2 | 1.09 | 28 | 15.88 | 154 | 84.61 |
| మాదిగ | 214 | 2 | 0.93 | 10 | 4.67 | 12 | 5.60 | 202 | 94.39 | 265 | 30 | 11.32 | 2 | 0.75 | 32 | 12.07 | 233 | 87.92 |
| మొత్తం | 2150 | 271 | 12.60 | 280 | 13.02 | 551 | 25.62 | 1599 | 74.37 | 2017 | 339 | 16.80 | 183 | 9.07 | 522 | 25.18 | 1495 | 74.10 |

## పట్టిక - 2 నామవాచకాలు

## కులాల వారిగా భాషా పద ప్రయోగ శాతం

| కులం | వివిధ భాషా పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల పదాల శాతం | తమిళ పదాలు | తమిళ పదాల శాతం | ఆంగ్ల తమిళ పదాలు | ఆంగ్ల తమిళ పదాల శాతం | తెలుగు పదాలు | తెలుగు పదాల శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రెడ్డి | 569 | 70 | 12.30 | 71 | 12.47 | 141 | 24.78 | 428 | 75.22 |
| నాయుడు | 455 | 52 | 11.42 | 86 | 18.90 | 138 | 30.32 | 317 | 69.67 |
| దేవాంగ | 474 | 94 | 19.83 | 57 | 12.02 | 151 | 31.85 | 323 | 68.14 |
| బ్రాహ్మణ | 459 | 108 | 23.63 | 46 | 10.02 | 154 | 33.55 | 305 | 66.44 |
| వైశ్య | 429 | 44 | 10.25 | 29 | 6.76 | 73 | 17.01 | 356 | 82.98 |
| విశ్వబ్రాహ్మణ | 439 | 37 | 8.42 | 33 | 7.51 | 70 | 15.94 | 369 | 84.05 |
| చాకలి | 466 | 109 | 23.39 | 91 | 19.52 | 200 | 42.91 | 266 | 5708 |
| మాల | 397 | 64 | 16.12 | 38 | 9.57 | 102 | 25.69 | 295 | 74.30 |
| మాదిగ | 479 | 32 | 6.68 | 12 | 2.57 | 44 | 9.18 | 435 | 90.81 |
| మొత్తం | 4167 | 610 | 14.63 | 463 | 11.11 | 1073 | 25.75 | 1394 | 74.25 |

# పట్టిక - 3 నామవాచకాలు

## అక్షరాస్యుల పద ప్రయోగ శాతం

### పురుషులు

| కులం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల శాతం | తమిళ పదాలు | తమిళ శాతం | ఆంగ్ల తమిళ పదాలు | శాతం | తెలుగు పదాలు | శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రెడ్డి | 248 | 20 | 8.06 | 30 | 12.09 | 50 | 20.16 | 198 | 79.83 |
| దేవాంగ | 218 | 82 | 37.61 | 11 | 5.04 | 93 | 42.66 | 125 | 57.34 |
| బ్రాహ్మణ | 211 | 92 | 43.06 | 8 | 3.79 | 100 | 47.39 | 111 | 52.60 |
| విశ్వబ్రాహ్మణ | 246 | 25 | 10.16 | 10 | 4.06 | 35 | 14.22 | 211 | 85.77 |
| మాదిగ | 265 | 30 | 11.32 | 2 | 0.75 | 32 | 12.07 | 233 | 87.92 |
| మొత్తం | 1188 | 249 | 20.95 | 61 | 5.13 | 310 | 26.09 | 878 | 73.90 |

### స్త్రీలు

| కులం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల శాతం | తమిళ పదాలు | తమిళ శాతం | ఆంగ్ల తమిళ పదాలు | శాతం | తెలుగు పదాలు | శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నాయుడు | 213 | 32 | 15.02 | 28 | 13.14 | 60 | 28.16 | 153 | 71.83 |
| వైశ్య | 242 | 18 | 7.43 | 10 | 4.13 | 28 | 11.57 | 214 | 88.42 |
| చాకలి | 248 | 91 | 36.69 | 48 | 19.35 | 139 | 56.04 | 109 | 43.95 |
| మాల | 215 | 38 | 17.67 | 36 | 16.74 | 74 | 34.41 | 141 | 65.58 |
| మొత్తం | 918 | 179 | 19.49 | 122 | 13.28 | 301 | 32.78 | 617 | 67.21 |

# పట్టిక - 4 నామవాచకాలు
# నిరక్షరాస్యుల భాషా పద ప్రయోగ శాతం

## పురుషులు

| కులం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల శాతం | తమిళ పదాలు | తమిళ శాతం | ఆంగ్ల తమిళ పదాలు | శాతం | తెలుగు పదాలు | తెలుగు శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నాయుడు | 242 | 20 | 8.26 | 58 | 23.96 | 78 | 32.23 | 164 | 67.76 |
| వైశ్య | 187 | 26 | 13.90 | 19 | 10.16 | 45 | 24.06 | 142 | 75.93 |
| చాకలి | 218 | 18 | 8.25 | 43 | 19.72 | 61 | 27.98 | 157 | 72.0 |
| మాల | 182 | 26 | 14.28 | 2 | 1.09 | 28 | 15.38 | 154 | 84.6 |
| మొత్తం | 829 | 90 | 10.85 | 122 | 25.57 | 212 | 25.57 | 617 | 74.4 |

## స్త్రీలు

| కులం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల శాతం | తమిళ పదాలు | తమిళ శాతం | ఆంగ్ల తమిళ పదాలు | శాతం | తెలుగు పదాలు | తెలుగు శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రెడ్డి | 321 | 50 | 15.57 | 41 | 12.77 | 91 | 28.34 | 230 | 71.65 |
| దేవాంగ | 256 | 12 | 4.68 | 46 | 17.96 | 58 | 22.65 | 198 | 77.34 |
| బ్రాహ్మణ | 248 | 16 | 6.45 | 38 | 15.32 | 54 | 21.77 | 194 | 78.22 |
| విశ్వబ్రాహ్మణ | 193 | 12 | 6.21 | 23 | 11.91 | 35 | 18.13 | 158 | 81.86 |
| మాదిగ | 214 | 2 | 0.93 | 10 | 4.67 | 12 | 5.60 | 202 | 94.39 |
| మొత్తం | 1232 | 92 | 7.46 | 158 | 12.82 | 250 | 20.29 | 982 | 79.70 |

# పట్టిక - 5 క్రియలు

## వ్యవహర్తల వారిగా భాషాపద ప్రయోగ శాతం

| | స్త్రీలు | | | | | | | | | పురుషులు | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కులం | వివిధ భాషా పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల పదాల శాతం | తమిళ పదాలు | తమిళ పదాల శాతం | ఆంగ్లం తమిళం | ఆంగ్లం తమిళ పదాల శాతం | తెలుగు పదాలు | తెలుగు పదాల శాతం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల పదాల శాతం | తమిళ పదాలు | తమిళ పదాల శాతం | ఆంగ్లం తమిళం | ఆంగ్లం తమిళ పదాల శాతం | తెలుగు పదాలు | తెలుగు శాతం |
| రెడ్డి | 239 | 5 | 2.09 | 3 | 1.25 | 8 | 3.34 | 231 | 96.65 | 187 | 5 | 2.67 | 3 | 1.60 | 8 | 4.27 | 179 | 95.72 |
| నాయుడు | 131 | 12 | 9.16 | 4 | 3.05 | 16 | 12.21 | 115 | 87.78 | 126 | 2 | 1.58 | 1 | 0.79 | 3 | 2.38 | 123 | 97.61 |
| దేవాంగ | 128 | - | - | 1 | 0.78 | 1 | 0.78 | 127 | 99.21 | 146 | 10 | 6.84 | 1 | 0.68 | 11 | 7.53 | 135 | 92.46 |
| బ్రాహ్మణ | 119 | - | - | 2 | 1.68 | 2 | 1.68 | 117 | 98.31 | 124 | 9 | 7.25 | 5 | 4.03 | 14 | 11.29 | 110 | 88.70 |
| వైశ్య | 192 | 4 | 8.08 | 1 | 0.52 | 5 | 2.60 | 187 | 97.39 | 152 | 1 | 0.65 | 1 | 0.65 | 2 | 0.31 | 150 | 98.38 |
| విశ్వ బ్రాహ్మణ | 152 | 1 | 0.65 | 1 | 0.65 | 2 | 1.31 | 150 | 98.68 | 119 | 1 | 0.84 | 3 | 2.52 | 4 | 3.36 | 115 | 96.63 |
| చాకలి | 128 | 11 | 8.56 | 4 | 3.12 | 15 | 11.71 | 113 | 88.28 | 211 | 8 | 3.79 | 12 | 5.68 | 20 | 9.47 | 191 | 90.52 |
| మాల | 181 | 6 | 3.31 | 3 | 1.65 | 9 | 4.97 | 172 | 95.02 | 143 | 2 | 1.39 | - | - | 2 | 1.39 | 141 | 98.60 |
| మాదిగ | 132 | - | - | 16 | 12.12 | 16 | 12.12 | 116 | 87.87 | 221 | - | - | - | - | - | - | 221 | 100% |
| మొత్తం | 1402 | 39 | 2.78 | 35 | 12.49 | 74 | 5.27 | 1328 | 94.72 | 1429 | 38 | 2.65 | 26 | 1.81 | 64 | 4.47 | 1365 | 95.52 |

# పట్టిక - 6 క్రియలు

## కులాల వారిగా భాషా పద ప్రయోగ శాతం

| కులం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల శాతం | తమిళ పదాలు | తమిళ శాతం | ఆంగ్ల తమిళ పదాలు | శాతం | తెలుగు పదాలు | తెలుగు శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రెడ్డి | 426 | 10 | 2.34 | 6 | 1.40 | 16 | 3.75 | 410 | 96.24 |
| నాయుడు | 257 | 14 | 5.44 | 5 | 1.94 | 19 | 7.39 | 238 | 92.60 |
| దేవాంగ | 274 | 10 | 3.64 | 2 | 0.72 | 12 | 4.37 | 2.62 | 95.62 |
| బ్రాహ్మణ | 243 | 9 | 3.70 | 7 | 2.88 | 16 | 6.58 | 227 | 93.41 |
| వైశ్య | 344 | 5 | 1.45 | 2 | 0.56 | 7 | 2.03 | 337 | 97.96 |
| విశ్వ బ్రాహ్మణ | 271 | 2 | 0.73 | 4 | 1.47 | 6 | 2.21 | 285 | 97.78 |
| చాకలి | 339 | 19 | 5.60 | 16 | 4.71 | 35 | 10.32 | 304 | 89.67 |
| మాల | 324 | 8 | 2.46 | 3 | 0.92 | 11 | 3.39 | 313 | 96.60 |
| మాదిగ | 353 | - | - | 16 | 4.53 | 16 | 4.53 | 337 | 95.46 |
| మొత్తం | 2831 | 77 | 2.71 | 61 | 2.15 | 138 | 4.87 | 2693 | 95.12 |

# పట్టిక - 7 క్రియలు

# అక్షరాస్యుల్లో భాషా పద ప్రయోగ శాతం

## పురుషులు

| కులం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల శాతం | తమిళ పదాలు | తమిళ శాతం | ఆంగ్ల తమిళ | శాతం | తెలుగు పదాలు | శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రెడ్డి | 187 | 5 | 2.67 | 3 | 1.60 | 8 | 4.27 | 179 | 95.72 |
| దేవాంగ | 146 | 10 | 6.84 | 1 | 0.68 | 11 | 7.53 | 135 | 92.46 |
| బ్రాహ్మణ | 124 | 9 | 7.25 | 5 | 4.03 | 14 | 11.29 | 110 | 88.70 |
| విశ్వబ్రాహ్మణ | 119 | 1 | 0.84 | 3 | 2.52 | 4 | 3.36 | 115 | 96.63 |
| మాదిగ | 132 | - | - | 16 | 12.12 | 16 | 12.12 | 116 | 87.87 |
| మొత్తం | 708 | 25 | 3.53 | 28 | 3.95 | 53 | 7.48 | 655 | 92.51 |

## స్త్రీలు

| కులం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల శాతం | తమిళ పదాలు | తమిళ శాతం | ఆంగ్ల తమిళ పదాలు | శాతం | తెలుగు పదాలు | శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నాయుడు | 131 | 12 | 9.16 | 4 | 3.05 | 16 | 12.21 | 115 | 87.78 |
| వైశ్య | 192 | 4 | 8.08 | 1 | 0.52 | 5 | 2.60 | 187 | 97.39 |
| చాకలి | 128 | 11 | 8.56 | 4 | 3.12 | 15 | 11.71 | 113 | 88.28 |
| మాల | 181 | 6 | 3.31 | 3 | 1.65 | 9 | 4.97 | 172 | 95.02 |
| మొత్తం | 632 | 33 | 5.22 | 12 | 1.89 | 45 | 7.12 | 587 | 92.87 |

# పట్టిక - 8 క్రియలు

## నిరక్షరాస్యుల బాషా పద ప్రయోగ శాతం

### పురుషులు

| కులం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల శాతం | తమిళ పదాలు | తమిళ శాతం | ఆంగ్ల తమిళ పదాలు | శాతం | తెలుగు పదాలు | శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నాయుడు | 126 | 2 | 1.58 | 1 | 0.79 | 3 | 2.38 | 123 | 97.61 |
| వైశ్య | 152 | 1 | 0.65 | 1 | 0.65 | 2 | 0.31 | 150 | 98.38 |
| చాకలి | 211 | 8 | 3.79 | 12 | 5.68 | 20 | 9.47 | 191 | 90.52 |
| మాల | 143 | 2 | 1.39 | - | - | 2 | 1.39 | 141 | 98.60 |
| మొత్తం | 632 | 13 | 2.05 | 14 | 2.21 | 27 | 4.27 | 605 | 95.72 |

### స్త్రీలు

| కులం | మొత్తం పదాలు | ఆంగ్ల పదాలు | ఆంగ్ల శాతం | తమిళ పదాలు | తమిళ శాతం | ఆంగ్లం తమిళం | శాతం | తెలుగు పదాలు | శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రెడ్డి | 239 | 5 | 2.09 | 3 | 1.25 | 8 | 3.34 | 231 | 96.65 |
| దేవాంగ | 128 | - | - | 1 | 0.78 | 1 | 0.78 | 127 | 99.21 |
| బ్రాహ్మణ | 119 | - | - | 2 | 1.68 | 2 | 1.68 | 117 | 98.31 |
| విశ్వబ్రాహ్మణ | 152 | 1 | 0.65 | 1 | 0.65 | 2 | 1.31 | 150 | 98.68 |
| మాదిగ | 221 | - | - | - | - | - | - | 221 | 100% |
| మొత్తం | 859 | 6 | 0.69 | 7 | 0.81 | 13 | 1.51 | 846 | 98.48 |

# 9. పరిశోధనా ఫలితాలు

సామాజిక భాషా పరిశీలన వల్ల భాషను సమాజ పరిస్థితులు ఎలా ప్రభావితం చేస్తాయో తెలుసుకోవచ్చు. మద్రాసు నగరం భిన్న బాషలకు, భిన్న జాతులకు, భిన్న మతాలకు, భిన్న కులాలకు, భిన్న సంస్కృతులకు నిలయం కావడం వల్ల సామాజికంగా భిన్నత్వం కలిగి వుంటుంది. అటువంటి సామాజిక భిన్నత్వం భాషని వివిధ స్థాయిల్లో ఏ విధంగా ప్రభావితం చేస్తుందో ఈ సిద్ధాంత వ్యాసంలో నిరూపింపబడింది.

చిన్న గ్రామంగా వుండిన మద్రాసు నగరం రాజకీయ, సాంఘిక కారణాల వల్ల ఏ విధంగా అభివృద్ధి చెందిందో, బ్రిటీషువారి పరిపాలనా కాలంలోను, దేశీయులైన ఫ్రెంచి, డచ్, పోర్చుగీసు వారు ఆక్రమించినపుడు, ఏ విధమైన మార్పులకు గురయిందో వివరింపబడింది.

మద్రాసు నగరం దిన దినాభివృద్ధి చెంది నేడు భారత దేశంలోని పెద్ద నగరాల్లో ప్రముఖ స్థానాన్ని పొందింది అనే విషయాన్ని తెలుసుకోవడంతో పాటు నేటి మద్రాసు నగర సాంఘిక, సామాజిక, ఆర్థిక స్థితిగతుల్ని కూడా తెలుసుకోవడం జరిగింది. ఈ సామాజిక పరిస్థితులు మద్రాసులో వ్యవహరింపబడు భాషల్లో వ్యవహర్తల సంఖ్య దృష్ట్యా రెండవ స్థానాన్ని పొందిన తెలుగు భాషని ఏవిధంగా ప్రభావితం చేశాయో సహేతుకంగా నిరూపించడం జరిగింది.

భాషా వైవిధ్యం సామాన్యంగా ధ్వనుల్లో ఎక్కువగా వుంటుంది. వర్ణ విజ్ఞానం అనే అధ్యాయంలో మ. తె. లోని ధ్వనులు ఏ విధంగా ప్రామాణిక భాష కంటే భిన్నంగా వున్నాయో వివరించడం జరిగింది. అన్య భాషా ప్రభావం వల్ల మ. తె. లో ఏర్పడ్డ ధ్వని మార్పులు సూత్ర బద్ధం చేయబడి వివరించబడ్డాయి. ప్రా. తె., మ. తె. భాషల్లోని వర్ణాల తులనాత్మక పరిశీలన వల్ల మ. తె. భాషా విలక్షణత గుర్తింప బడింది. ప్రా. తె. లో ద్విరుక్తాలు అన్య భాషా ప్రభావం వల్ల మ. తె. లో అద్విరుక్తాలుగా మారాయి. అదే విధంగా అద్విరుక్తాలు ద్విరుక్తాలుగా మారినట్లు కూడా తెలుపబడింది. ప్రా. తె. లో సంయుక్తాలు మ. తె. లో అసంయుక్తాలుగాను, కొన్ని సందర్భాల్లో ద్విత్వాలుగాను మారాయి. ప్రా. తె. లో పదాంతంలో సంయుక్తాలు లేవు. మ. తె. లో అన్య భాషా ప్రభావం వల్ల రెండు హల్లుల సంయుక్తాలు, మూడు హల్లుల సంయుక్తాలు కూడా కనబడుతున్నాయి. ఈ విధంగా ధ్వని సంబంధితమైన మార్పుల్ని బట్టి మ. తె., ప్రా. తె. కంటే భిన్నంగా వుందని నిరూపింప బడింది. మ. తె. అన్య భాషా ప్రభావితమైనా అనేక ప్రాచీన రూపాల్ని నిలుపుకుంది. ఉదా :- కోంతి., పేండ మొదలైన అనుస్వారంతో కూడిన ప్రాచీన తెలుగు రూపాలు ప్రా. తె. లో నశించాయి. మ. తె. లో దీర్ఘంపై పూర్ణ బిందువుతో కూడిన రూపాలు నిలిచాయి. ఉదా :- మూంతి, పొంత మొదలైనవి.

రూప నిర్మాణం అనే అధ్యాయంలో మ. తె. భాషయొక్క రూప నిర్మాణాన్ని వివరించి ప్రా. తె. కంటే మ. తె. స్వరూపం ఏ విధంగా భిన్నమై వుందో నిరూపించ

బడింది. ఉదా :- తమిళ భాషా ప్రభావం వల్ల ప్రా. తె. లో లేని కొన్ని ప్రత్యయాలు మ. తె. లో వచ్చి చేరాయి. నామ వాచక ప్రాతి పదికల్లో 'డు' ప్రత్యయానికి బదులుగా 'అన్'., 'కత్తె' కు బదులుగా 'కారి' అనే తమిళ ప్రత్యయాలు కన్పిస్తున్నాయి. పుంలింగ ఏక వచన సర్వనామాలు 'వాండు' : 'వీండు'గా అను స్వారంతో కూడిన ప్రాచీన తెలుగు రూపాలు కనబడుతున్నాయి. ప్రా. తె. లోని మనుష్యేతర బహు వచన సర్వనామాలు మ. తె. లో లేవు. తమిళ భాషా ప్రభావం వల్ల మ. తె. భాషలో సంఖ్యా వాచకాల్లో కూడా మార్పు కన్పిస్తోంది. ఉదా :- నలుకురు, పదిగేడు, నూరు మున్నగునవి. ప్రా. తె. లో లేని పత్తి., కాగ, విడ అనే తమిళ విభక్తి ప్రత్యయాలు మ. తె. లో కన్పిస్తున్నాయి. ప్రా. తె. లోని నిత్య ఏకవచనాలు రూపంలో కొన్ని మ. తె. లో బహు వచనాలుగా వాడబడుతున్నాయి.

ఉదా :- బియ్యం బియ్యాలు

ప్రా. తె. లో కర్తృ పదం క్రియా పదం ఒకే లింగంలో వుంటాయి. మ. తె. లో నపుంసక లింగంలో ఏక, బహువచన భేదం లేదు. భూతకాలిక క్రియా విశేషణాల్లో 'వెనక' అనే ప్రాచీన తెలుగు రూపం మ. తె. లో నిలిచి వుంది. ఈ విధంగా రూప నిర్మాణాన్ని బట్టి మ. తె. ప్రా. తె. కంటే భిన్నంగా వుందని నిరూపింప బడింది.

అన్య భాషా ప్రభావమనే అధ్యాయంలో ఆంగ్ల, తమిళ భాషలు మ. తె. ను ఎలా ప్రభావితం చేశాయో వివరించ బడింది. క్రింది రూపాలు అన్య భాషా ప్రభావానికి ఉదాహరణలు.

| ఆంగ్ల | తమిళ |
|---|---|
| 1. హరిజన్స్ | 1. కర్పు (శీలం) |
| 2. చీప్ | 2. తొలిల్ (వృత్తి) |
| 3. విలేజ్ | 3. వళకం (అలవాటు) |

మ. తె. సంధి స్వరూపాన్ని వివరిస్తూ ప్రా. తె. కంటే భిన్నంగా వున్న మ. తె. రూపాలు గుర్తింప బడ్డాయి. ఉదా :- పద మధ్యాచ్చు లోపించడం వల్ల సంశ్లేషంతో కూడిన రూపాలు ఏర్పడినట్లు కనబడుతున్నాయి.

ఉదా :- కలిపి + దా = కల్పిదా

కారు + లో = కార్లో

ఈ విధంగా ధ్వని, రూప, సంధి స్థాయిలో ఏర్పడ్డ భాషా వైవిధ్యాన్ని సామాజిక పరిస్థితులతో అన్వయించి సామాజిక పరిస్థితులు, సాంఘిక విలువలు, ఆర్థిక స్థితి గతులు, విద్యార్హతలు భాషని ఎలా ప్రభావితం చేశాయో తెలుసుకోవడం జరిగింది. మ. తె. లోని వాక్యాల్ని ఆంధ్ర దేశానికి చెందిన వారు, ప్రా. తె. భాషా వ్యవహర్తలు అర్థం చేసుకోవడం కష్టం. అదే విధంగా మద్రాసులోని తమిళులు కాని, ఇతర భాషల వారు గాని మ. తె. ను అర్థం చేసుకోవడం కష్టం. మ. తె. భాష పూర్తిగా అటు తమిళంగా'

ఇటు తెలుగు కాక రెండు భాషల మిశ్రమమై ఒక ప్రత్యేకమైన భాషగా వుండడమే దీనికి కారణం.

మ. తె. పై ఇంకా ఎంతో పరిశోధన జరగవలసి వుంది. నా పరిశోధన కేవలం కొన్ని భాషా విశేషాల వరకే పరిమితం చేయ బడింది. మ. తె. భాష పద వ్యుత్పత్తి పరిశీలన చేయడం చాలా అవసరం. అదే విధంగా మ. తె. భాష వాక్య నిర్మాణాన్ని కూడ పరిశీలించి ప్రా. తె. కంటె వాక్యనిర్మాణంలో మ. తె. ఎలా భిన్నంగా వుందో నిరూపించడం అవసరం. నా సిద్ధాంత వ్యాసం కొరకు సేకరించిన మ. తె. భాషా పదజాలాన్ని పరిశీలిస్తే అందులోని ధ్వని మార్పులకు గాని, రూప నిర్మాణానికి గాని, సంధి గత మార్పులకు గాని ఇంకా ఇతర భాషా సూత్రాలకు వేటికీ లొంగని పదజాలం కొంత వుంది. ఇటు వంటి పదజాలంపై పరిశోధన సాగించడం ఎంతేని అవసరం.

ఈ విధమైన పరిశోధన చేయడం వల్ల ప్రత్యేక మాండలికంగా చెప్పబడుతున్న మ. తె. భాషా స్వరూపాన్ని సంపూర్ణంగా తెలుసుకోగలుగుతాము. మద్రాసు నగరానికి సంబంధించిన తెలుగు పైనే కాక, తమిళనాడులోని మాండలికాలన్నింటి పైన పరిశోధన జరగాల్సిన అవసరం ఎంతేని వుంది. ఈ కార్యం ఒకరు, ఇద్దరు వ్యక్తుల వల్ల అయ్యేది కాదు. ఆంధ్ర ప్రభుత్వం గాని, తమిళనాడు ప్రభుత్వంగాని ఈ కార్యాన్ని చేపట్టి పరిశోధన చేయాల్సిన అవసరం ఎంతేని వుంది.

తెలుగు భాషలో రచింపబడే సిద్ధాంత వ్యాసాలు సంఖ్యా దృష్టిలో బహు కొద్ది. ఈ కారణంగా భావి పరిశోధకులు తెలుగు భాషా సంబంధిత సిద్ధాంత వ్యాసాల్ని తెలుగు భాషలోనే రచించి, తెలుగు భాషకు సేవ చేస్తారని ఆశిస్తున్నాను. నా ఈ సిద్ధాంత వ్యాసం తెలుగు భాషా శాస్త్రానికి ఏ కొద్ది మాత్రం తోడ్పడిందని పండితులు భావించినా నా కృషి ఫలించిందని భావిస్తాను.



# అనుబంధం - 1

## పురపాలక విభాగాలు

1. అంజుగమ్ అమ్మయార్ నగర్
2. అంబేద్కర్ నగర్
3. అగరం (ఉ)
4. అగరం (ద)
5. అజాద్ నగర్ (ఉ)
6. అజాద్ నగర్ (ద)
7. అడయారు (తూ)
8. అడయారు (ప)
9. అన్నానగర్ (తూ)
10. అన్నానగర్ (ప)
11. అన్నానగర్ (మధ్య)
12. అన్బళగన్ నగర్
13. అమ్మన్ కోయిల్
14. అమింజికరై (తూ)
15. అమింజికరై (ప)
16. అమీర్ మహల్
17. అళగిరి నగర్
18. అశోక్ నగర్
19. ఆదికేశవ పురం
20. ఆళ్వారుపేట (ఉ)
21. ఆళ్వారుపేట (ద)
22. ఇళంగో నగర్
23. ఉమరు పులవర్ నగర్
24. ఎం.జి.ఆర్. నగర్
25. ఎగ్మూర్
26. ఎడపాళయం
27. ఎలిఫెన్ట్‌గేట్
28. ఐనావరం
29. ఓల్డ్ వాషర్‌మెన్‌పేట
30. ఔవై నగర్ (ఉ)
31. ఔవై నగర్ (ద)
32. కట్టలేశ్వరర్‌నగర్
33. కన్నప్పర్‌నగర్
34. కలైఙర్ కరుణానిధి నగర్
35. కల్యాణర్‌నగర్
36. కామరాజర్‌నగర్ (ఉ)
37. కామరాజర్‌నగర్ (ద)
38. కారనీశ్వరన్‌నగర్ (ద)
39. కీల్పాక్ (ఉ)
40. కీల్పాక్ (ద)
41. కుమారన్ నగర్ (ఉ)
42. కుమారన్‌నగర్ (ద)
43. కుమారస్వామి నగర్ (ఉ)
44. కుమారస్వామినగర్ (ద)
45. కృష్ణాంపేట
46. కొండితోపు
47. కొండున్ గైయూర్
48. కొరుక్కుపేట
49. కొళత్తూర్
50. కోడంబాకం
51. కోమలీశ్వరన్‌పేట
52. కోస పేట
53. కోసుమణి నగర్
54. గంగాదీశ్వరన్ కోయిల్

55. గిండీ (తూ)
56. గిండీ (ప)
57. గ్రేస్ గార్డెన్
58. చింతాద్రిపేట
59. చూలై
60. చెట్‌పెట్
61. చెర్రియన్ నగర్ (ఉ)
62. చెర్రియన్ నగర్ (ద)
63. చేపాక్
64. జాంబజార్
65. జి.డి. నాయుడునగర్ (తూ)
66. జి.డి. నాయుడునగర్ (ప)
67. జీవానగర్ (ఉ)
68. జీవానగర్ (ద)
69. తండయార్‌పేట
70. తట్టన్ కుళం
71. తవ్‌సండ్ లైట్స్
72. త్యాగరాయ నగర్
73. తిరువట్టేశ్వరన్ నగర్
74. తిరువళ్లిక్కేని
75. తిరువళ్ళువర్ నగర్
76. తిరువాన్మియూర్ (తూ)
77. తిరువాన్మియూర్ (ప)
78. తిరు. వి. కా నగర్
79. తేనాంబేట
80. నక్కీరర్ నగర్
81. నటేశన్ నగర్
82. నాగమ్మ అమ్మయార్ నగర్ (ఉ)
83. నాగమ్మ అమ్మయార్ నగర్ (ద)
4. నారాయణప్ప నాయకన్ గార్డన్
85. నావలర్ నెడుంజెళియన్ నగర్
86. నావలర్‌నెడుంజెళియన్‌నగర్ (తూ)
87. నుంగంబాకం
88. నెహ్రూనగర్
89. పట్టాళం
90. పన్నీర్ సెల్వం నగర్
91. పార్క్ టవున్
92. పుదుప్పేట
93. పురుషవాక్కం
94. పులియందోపు
95. పెడునాయకన్‌పేట
96. పెరంబూరు (ఉ)
97. పెరంబూరు (తూ)
98. పెరంబూరు (ద)
99. పెరియార్ నగర్ (ఉ)
100. పెరియార్ నగర్ (ద)
101. పెరుమాల్ కోయిల్ గార్డన్
102. పెరుమాల్ పేట
103. బాలసుబ్రహ్మణ్యం నగర్
104. బెసంట్ నగర్
105. బేసిన్ బ్రిడ్జి
106. భారతిదాసన్ నగర్
107. భారతి నగర్
108. భీమన్నపేట
109. మఱైమలై అడిగల్ నగర్ (ఉ)
110. మఱైమలై అడిగల్ నగర్ (ద)
111. మాధవ్ పెరుమాల్ పురం
112. మ.పో.సీ. నగర్
113. మీనాక్షమ్మన్‌పేట
114. ముత్యాలపేట

115. మెరీనా

116. మైలాపూర్

117. మొట్టై గార్డన్

118. రాజా అన్నామలై నగర్

119. రాజాజీ నగర్

120. రాధాకృష్ణన్ నగర్

121. రాయపురం

122. రాయపేట

123. వడపళని (తూ)

124. వడపళని (ప)

125. వడ్డైనగర్

126. వల్లల్ సీతాకాతి నగర్

127. వ్యాసార్ పాడి (ద)

128. వ్యాసార్ పాడి (ఉ)

129. వెలాచ్చేరి

130. వి.ఓ.సీ. నగర్

131. విజయ రాఘవులు నగర్

132. విజయరాఘవులు నగర్ (ద)

133. విడుదలై గురుస్వామి నగర్ (ప)

134. విరుగం బాక్కం

135. విల్లివాక్కం

136. వివేకానంద పురం

137. శాంథోమ్

138. షెనాయ్ నగర్

139. సంజీవరాయన్ పేట

140. సత్యమూర్తి నగర్

141. సత్యవాణి ముత్తు నగర్

142. సాలిగ్రామం

143. సింగార గార్డన్

144. సిరువళ్ళూర్

145. సెంచియమ్

146. సెవెన్ వెల్స్ (ఉ)

147. సెవెన్ వెల్స్ (ద)

148. సైదాపేట (తూ)

149. సైదాపేట (ద)

150. సౌకార్‌పేట



# MADRAS DISTRICT




NOTE: THE BOUNDARY OF MADRAS DISTRICT IS COTERMINOUS WITH THAT OF THE MADRAS CORPORATION

Bay of Bengal

| Division No. | Division Population |
|---|---|
| 10 | 20548 |
| 13 | 19617 |
| 15 | 14892 |
| 16 | 18319 |
| 17 | 18090 |
| 18 | 20930 |
| 20 | 20114 |
| 47 | 18991 |
| 48 | 19211 |
| 49 | 22463 |
| 52 | 17427 |
| 56 | 18917 |
| 59 | 25388 |
| 61 | 16931 |
| 64 | 13871 |
| 65 | 14935 |
| 66 | 17385 |
| 67 | 18620 |
| 68 | 23619 |
| 69 | 14531 |
| 82 | 20480 |
| 90 | 14118 |
| 92 | 18780 |
| 94 | 19421 |
| 95 | 21592 |
| 96 | 13072 |
| 99 | 18665 |
| 102 | 22148 |
| 129 | 19906 |
| 143 | 17493 |

Boundary, District ... ... —·—·—
" Division ... . — — — — —
Division, Number .. .. 148
" Population .. .. 24998

Railway line with Station (Broad gauge) RS
Railway line with Station (Metre gauge) RS
National Highway .. NH
River ... ... .. .. ...

Based upon Survey of India map with the permission of the Surveyor General of India

## అనుబంధం - 2

## అన్యదేశ్యాలు

### 2.1 యథాతథంగా ఎరువు తెచ్చుకోబడిన వ్యస్త తమిళ పదాలు

అగల్లు = ప్రమిదలు
అపిడి = అలాగ
ఇనపు = లోబడి
ఎన్నం = ఉద్దేశం
ఏళ్మై = పేదరికం
ఒణ్ణు = ఒకటి
ఒళపు = శ్రమ
కట్టడం = భవనం
కంద్రావి = అసహ్యం
కన్నాడి = అద్దం
కర్తు = అర్థం
కర్పు = శీలం
కిండల్ = ఎగతాళి
కూటం = గుంపు
గలాటా = గొడవ
గేలి = ఎగతాళి
జన్నల్ = కిటికి
తొలిల్ = వృత్తి

నేర్మై = నిజాయితీ
నోండు = తప్పు
పంజం = కరువు
పూట్ట్ = తాళం
పొరామె = అసూయ
పొరుత్తం = సరిపోవు
మచ్చా = మరిది
మేడు = ఎత్తు
మొట్టై = గుండు
రగల = గొడవ
వల్లాలు = చాకలి
పళకం = అలవాటు
వాద్దియార్ = ఉపాధ్యాయుడు
వీన్ = వృథా
వోల = తాటాకు
సీదనం = కట్నం
సూదు = జూదం

## 2.2 యథాతథంగా స్వీకరించబడిన సమస్త తమిళ పదాలు

అడకలం = పూడ్చిపెట్టు
అడికడి = అప్పుడప్పుడు
అదావదు = అదివచ్చి
అరసాంగం = ప్రభుత్వం
అరసియల్ = రాజకీయం
అవళవుదాం = అంతే
ఈడిపడి = సంబంధించి
ఏరకొరయ = దగ్గర దగ్గర
ఏర్కనవే = ఇంతకుముందే
ఏరాలమా = ఎక్కువగా
ఒదంగలే = పనికిరాలే
ఒళుంగా = చక్కగా
ఓయువు = విశ్రాంతి
కచ్చిసార్బ = పార్టీ తరపున
తలమురై = తరం
దిడీరని = హటాత్తుగా
నడమురై = నడిచే పద్ధతి
నాటుపురం = పల్లెటూరు
నేరడిగా = ఎదురుగా
పరయన్ = మాలవాడు
పలకం = అలవాటు
పొరుత్తవరలుం = సంబంధించినంత వరకు
పోకు వర్తం = రవాణా
మట్లపడి = వేరే విధంగా
మరుపడియుం = మళ్ళీ
వయసానమ్మ = వయస్సైన అమ్మ
వర్షపొరపు = సంవత్సరాది (ఉగాది)
వరుమానం = రాబడి
వారి వారి = కుమ్మరించి
సిరిసిరిగా = చిన్న చిన్నగా
సీర్వరిసె = కానుకల వరుస

## 2.3 యథాతథంగా స్వీకరించబడిన వ్యస్త ఆంగ్ల పదాలు

అటెండన్స్
అలాయిడ్
ఆపరేషన్
ఆపర్చునిటీ
ఆఫీస్
ఆపోసిట్
ఇన్స్టిక్ట్
ఇండివిడ్యువల్
ఇన్ఫ్లుయన్స్
ఇంపార్టెంట్
ఈవినింగ్
ఎక్స్టెన్షన్
ఎయిటీ
ఎయిమ్
ఎలక్షన్
ఎసన్షియల్
ఏరియా
ఒపీనియన్
ఒరిజినల్
కజిన్స్
కమర్షియల్
కరక్ట్
కల్చరల్
కష్టమర్స్
కాఫీ
కామన్
కాస్ట్

క్రియేట్
కెపాసిటీ
కొలీగ్స్
కౌన్సిలర్
కంట్రోల్
క్లర్క్
గవర్నమెంట్
చేర్మన్
చేంబర్
చౌల్టరీ
టచ్చ్
టవున్
ట్రాన్స్ఫర్స్
ట్రీట్మెంట్
టూరిస్ట్
టెంపరరీ
టెంపుల్
టైపిస్ట్
టేస్ట్
టైమ్
డయాబిటీస్
డ్రస్
డాష్
డిస్ట్రిక్ట్
డీసెంట్
డ్యూటి
డెవలప్మెంట్
డెవలప్డ్
డెలివరీ

డ్రైవర్
డొరి
తర్బీన్
నర్స్
నెక్స్ట్
నెంబర్
నెససిటి
నేషనల్
పర్సనాలిటీ
పర్సెంట్
ప్లస్టూ
పర్వర్టడ్
పాలిటెక్నిక్
ఫాదరిన్లా
పాపులేషన్
ప్రాబ్లమ్
ఫార్మాలిటీ
పాలిటెక్స్
ఫ్యాక్చర్
ఫాదర్
ఫిట్టర్
ప్రిఫరెన్స్
ఫుల్
ప్యూర్
పెన్షన్
ఫెయిల్
పోలీస్
ఫోర్మెన్
బ్రదర్

బ్యాంకి
బిజినెస్
బిల్డింగ్
బెటర్
బోర్
మదర్
మాన్సూన్
మిక్సింగ్
మీటింగ్
మీడియం
మీనింగ్
మున్సిపాలిటీ
మెజారిటీ
మేగజైన్స్
మైగ్రేట్
మైంటేనన్స్
యాక్షన్
యాక్సిడెంట్
యాంబిషన్
యూస్ఫుల్
రెడీ
రెస్ట్
రేడియో
రోడ్
లగ్జరీ
లారి
లాండ్రి
లీవ్
లెవల్

వీక్
వీవర్
వెజిటేరియన్
సపోర్ట్
సర్జరీ
సర్వీస్
సిట్యువేషన్
సిస్టర్
స్ట్రిక్ట్
స్ట్రీట్
స్వీట్స్
స్కూల్
స్టెప్స్
సెలక్షన్
సెల్ఫిష్
స్పెషల్
స్టేటస్
షుగర్
షాప్స్
షేమ్
హస్బెండ్

## 2.4 యథాతథంగా స్వీకరించబడిన సమస్త ఆంగ్ల పదాలు

అంకుల్స్
అండర్ టేకింగ్
అపాయింట్మెంట్
ఇన్‌చార్జ్
ఈక్వల్ రాంక్
ఎకానామికలీ బాక్‌వాడ్
ఎక్స్ క్లూడింగ్
ఎంటర్‌ప్రైజ్
ఎంటర్‌టైన్‌మెంట్
కాంట్రాక్ట్సు
కాస్ట్‌ఫీలింగ్స్
కో ఎడ్యుకేషన్
గోడవున్స్
చీఫ్ మినిష్టర్
ట్వంటీ ఫైవ్ ఇయర్
టాప్ స్టార్
ట్రామ్స్
టెలిఫోన్ ఆపరేటర్
డిస్‌కన్‌టిన్యూ
డ్రైనేజ్ సిస్టమ్
తర్టీ ఫైవ్
నార్త్ ఇండియా
న్యూస్ పేపర్
ఫస్ట్ ఇయర్
ఫెసిలిటీస్
ఫ్లాట్ సిస్టమ్
ఫార్మేషన్ స్టేజ్
ఫిఫ్టీ ఫర్సంట్
ఫుడ్ కార్పొరేషన్
ప్రైవేట్ పార్టీ
పోర్ట్ ఆఫీస్
పోస్టల్ సర్కిల్
బాంక్ డీలింగ్స్
బాంబ్స్
బాంబే కంపెనీ
మదర్స్ మదర్
మదర్ టంగ్
మెకానికల్ ఇంజనీరింగ్

మెట్రో వాటర్

మొరాలిటీ వైస్

యంగర్ జనరేషన్

రియలెస్టేట్

రిలేటివ్స్

రైల్వే

లవ్ మేరేజ్

లీడర్స్

లైబ్రరీ బుక్స్

లోకల్ లాంగ్వేజ్

వాటర్ ఫెసిలిటీ

సర్కంటెన్సస్

సూపర్వైసర్

స్కూల్ లైఫ్

హౌసింగ్‌బోర్డు

## 2.5 మ. తె. లో హిందూస్థానీ పదాలు

| | | |
|---|---|---|
| గిరాకి | : | ధర ఎక్కువ |
| చీటీ | : | కాగితం |
| జాగా | : | స్థలం |
| తయార్ | : | సిద్ధం |
| తాహతు | : | శక్తి, బలం |
| నౌకరు | : | సేవకుడు |
| పత్రం | : | కాగితం |
| బజారు | : | విక్రయ స్థలం |
| బందోబస్తు | : | భద్రము, పరిష్కారము |
| బేజారు | : | అలసట, విసుగు |
| హుషారు | : | జాగ్రత్త, సరదా |

## 2.6 ధ్వని మార్పులతో గ్రహింపబడ్డ ఆంగ్ల పదాలు

| ఆ.భా | మ. తె. |
|---|---|
| అకౌంట్స్ | అకౌంట్లు |
| అడ్జస్ట్ | అడ్జస్టు |
| హరిజన్స్ | అరిజనులు |
| కార్ | కారు |

| | |
|---|---|
| కాలేజ్ | కాలేజి |
| కోట్ | కోటు |
| గ్రూప్ | గ్రూపు |
| చీప్ | చీపు |
| బల్బ్ | బల్బు |
| బస్ | బస్సు |
| రేస్ | రేసు |
| విలేజ్ | విలేజి |
| వైర్ | వైరు |
| లోడ్స్ | లోడ్సు |
| సూట్ | సూటు |
| సైన్ | సైను |

## 2.7 ఆగత మిశ్ర పదజాలం

### 2.7.1 తమిళం + తెలుగు

| | |
|---|---|
| అడికడి బోతాను | అడికడి + పోతాను |
| అదిలే లేదు | అదిలే + లేదు |
| అప్పరం వచ్చి | అప్పరం + వచ్చి |
| ఇడుపు కింద | ఇడుపు + కింద |
| ఎళిదుండాడు | ఎళిదు + ఉండాడు |
| ఒత్తు కోడు | ఒత్తు + కోడు (ఒప్పకోడు) |
| ఒళుంగా నడుస్తుల్లే | ఒళుంగా + నడుస్తుల్లే |
| కుమ్ముడుతాను | కుమ్ముడు + తాను |
| కొంజుం సేపు | కొంజుం + సేపు |
| కొండుం వరాలి | కొండుం + వరాలి |
| కొండుం వొస్తారు | కొండుం + వస్తారు |
| గవనం వుండదు | గవనం + ఉండదు |
| తంగితిమి | తంగు + ఇతిమి |
| తనీగా నడిస్తే | తనీగా + నడిస్తే |

| | |
|---|---|
| తనీపట్ట మాదిరి | తనీపట్ట + మాదిరి |
| తయంగను | తయకం + అను |
| తిండాడతావు | తిండు + ఆడతావు |
| తూకుతాను | తూకు + తాను |
| తూకు వేసుకొని | తూకు + వేసుకొని |
| తూకే వరకు | తూకు + వరకు |
| తై నెల | తై + నెల |
| నడతేము | నడుతు + ఏము |
| నడుతరం వాల్లు | నడుతరం + వాల్లు |
| నడుంగులో | నడుంగు + లో |
| నోండి ఎత్తేస్తురు | నోండి + ఎత్తేస్తురు |
| పదింజీ మాదిరి | పదిం + మాదిరి |
| పళగతాము | పళగు + తాము |
| పాడు పడితిమి | పాడు + పడితిమి (కష్ట పడేము) |
| పుడుచును | పుడు + చును |
| పురింజీ కాదు | పురింజు + కాదు |
| పురియలే కదా | పురియలే + కదా |
| పొదచేది | పొదచు + ఏది |
| పొదుజనం | పొదు + జనం |
| పొదువుగా | పొదువు + గా |
| పోలుడుషాల | పోలుడు + వాల |
| మలిగె అంగడి | మలిగె + అంగడి |
| మత్తవాల్లు | మత్త + వాల్లు |
| మారుద లేదా | మారుద + లేదా |
| ముడిచేను | ముడుచు + ఏను |
| ముడింజిపోయింది | ముడింజు + పోయింది |
| వరి వేస్తురు | వరి + వేస్తురు |
| వాంగింది | వాంగు + ఇంది |
| వెలగేస్తును | వెలగు + ఏస్తును |

| | |
|---|---|
| వోల వేసి | ఓల + వేసి |
| సమ్మంది వాల్లు | సమ్మంది + వాల్లు |
| సమ్మాళించేస్తాము | సమ్మాళించు + ఏస్తాము |
| సిలమందులు | సిల + మందులు |
| సిల విషయాల్లో | సిల + విషయాల్లో |
| సెలవు సేసేసి | సెలవు + సేసేసి (ఖర్చు చేసేసి) |
| సొట్టినారు | సొట్టి + నారు |

### 2.7.2 ఆంగ్లం + తెలుగు

| | |
|---|---|
| ఇస్త్రీ పెట్టి | ఇస్త్రీ + పెట్టి |
| ఈజీగా వుంది | ఈజీగా + వుంది |
| ఎక్స్‌ప్రెస్ చేసేప్పుడు | ఎక్స్‌ప్రెస్ + చేసేప్పుడు |
| క్రాస్ చేసేది | క్రాస్ + చేసేది |
| కోర్స్ ఎత్తేను | కోర్స్ + ఎత్తేను |
| చాన్స్ లేదు | చాన్స్ + లేదు |
| జాబ్ కోసం | జాబ్ + కోసం |
| టైమ్ దొరకదు | టైమ్ + దొరకదు |
| ట్రైనింగ్ ఎత్తేను | ట్రైనింగ్ + ఎత్తేను |
| డాన్స్‌లాడికిని | డాన్స్ + ఆడికిని |
| నోటీస్ కొట్టి | నోటీస్ + కొట్టి |
| ఫస్ట్ దైవం | ఫస్ట్ + దైవం |
| ఫాలో చేస్తున్నారు | ఫాలో + చేస్తున్నారు |
| పాస్ చేసినాను | పాస్ + చేసినాను |
| ఫిట్ లేదు | ఫిట్ + లేదు |
| ఫియెట్ బండి | ఫియట్ + బండి |
| బైండ్ చేసికావాల | బైండ్ + చేసి + కావాల |
| మూల్ చెయ్యడం | మూల్ + చెయ్యడం |
| రౌడీ తనం | రౌడీ + తనం |
| రోడ్డు మొన | రోడ్డు + మొన |
| లైటు స్తంబం | లైటు + స్తంబం |

| | |
|---|---|
| విన్ చేయవాల | విన్ + చేయవాల |
| సెటిల్ అయ్యేరు | సెటిల్ + అయ్యేరు |

### 2.7.3 తెలుగు + తమిళం

| | |
|---|---|
| అనే పోద్దానే | అనే + పోద్దానే |
| అబ్బాయికి మట్టుం | అబ్బాయికి + మట్టుం |
| ఒక అళవు | ఒక + అళవు |
| ఒక వాయి | ఒక + వాయి |
| జనతొగె | జన + తొగె |
| తెలుంగు పడం | తెలుంగు + పడం |
| పిడకలు అడికి | పిడకలు + అడికి |
| భోజన సెలవు | భోజన + సెలవు |
| నిండా పుడుచును | నిండా + పుడుచును |
| మంచి కర్తు | మంచి + కర్తు |
| మూట తూకుతాను | మూట + తూకుతాను |
| రెండు కోడి | రెండు + కోడి (రెండు కోట్లు) |
| వీబూది ఇడుతారు | వీబూది + ఇడుతారు |

### 2.7.4 తెలుగు + ఆంగ్లం

| | |
|---|---|
| ఒక ట్రిప్పు | ఒక + ట్రిప్పు |
| కత బుక్కులు | కత + బుక్కులు |
| దండిగా పేరంట్స్ | దండిగా + పేరంట్స్ |
| నిండా అడ్వాన్స్ | నిండా + అడ్వాన్స్ |
| నిండాకేర్ | నిండా + కేర్ |
| నిండా ప్రిఫరెన్స్ | నిండా + ప్రిఫరెన్స్ |
| నిండా మిక్స్ | నిండా + మిక్స్ |
| నిండా రిజర్వుడు | నిండా + రిజర్వుడు |
| నిండా సింపుల్ | నిండా + సింపుల్ |
| నీల్ల లారి | నీల్ల + లారి |
| నేన్దా ఫస్ట్ | నేన్దా + ఫస్ట్ |
| సొంత ఫ్రెండ్స్ | సొంత + ఫ్రెండ్స్ |

| | |
|---|---|
| మా వైఫ్ | మా + వైఫ్ |
| మూడు పోర్షన్లు | మూడు + పోర్షన్లు |
| రెండవరు | రెండు + అవరు |

## 2.8 వాక్య స్థాయిలో తమిళ ప్రభావం

| ప్రామాణిక తెలుగు | మద్రాసు తెలుగు | తమిళం |
|---|---|---|
| అక్కడే మేము వున్నాము | అక్కడదా మేము తంగితిమి | అంగెదా నాంగె తంగినోమ్ |
| అలా తిరిగి రావచ్చు | అట్నే సుట్టుకోని రావచ్చు | అపిడీ సుత్తిట్టు వరలాం |
| మాటిమాటికీ వచ్చేస్తాడు | అడికడి వచ్చెడిస్తుడు | అడికడి వందిడువాన్ |
| దొంతర్లు కట్టేరు | అడుకడుక్కా కట్టినాడు | అడుకడుక్కా కట్టినాంగె |
| మరు నిమిషమే మరపు వచ్చేస్తుంది. | అతడు నిమిషమే మరపు వచ్చిడిసును | అడుత నిమిడమే మరుది వందిడుం |
| అలాంటి ఉద్దేశమే రానంటుంది | అది మాదిరి ఎన్నమే రానంటావుంది | అది మాదిరి ఎన్నమే వరమాటేన్నుదు |
| ఆయన్నే నేను మొక్కుతాను | ఆయన్దా నేను కుమ్ముడుతాను | అవరెదా నాన్ కుమ్ముడు వేన్ |
| భర్త ఒప్పకోడు అందుకని చేర్చలేదు | ఇంటాయన ఒత్తుకోడు అందుకుదా సేరవలేదు | వీటుకారు ఒత్తుకుమాటాం అదికుదా సేరవిల్లె |
| ఇప్పుడు నచ్చడం లేదు | ఇప్పడుదా పట్టుకోలె | ఇప్పోదా పుడికిలే |
| దొర్లి పడిపోయేడు | ఉరిలిపడి పూడ్సినాడు | ఉరిలి పుళిందుట్టాన్ |
| ఏదీ అర్థం కాదు | ఎరినే పురింజే కాదు | ఎదిమే పురియాదు |
| దగ్గర దగ్గర నలభై సంవత్సరాలు | ఏరకొరయగా నలపై సమచ్చరం | ఏరకొరయ నాపదు వర్షం |
| ఇంతకు ముందే చెప్పేశాను | ఏర్కనవె సొప్పిడిస్తిని | ఏర్కనవే సొల్లిట్టేన్ |
| ఒకరోజుకి ఒప్పకొని తీరాలి | ఒకనాటికి ఒత్తిదానె రావాలి | ఒరునాళికు ఒత్తుట్టి వరునుం |
| శ్రమ వుంటే కచ్చితంగా వస్తుంది | ఒళపు వుంటే కండిప్పా వచ్చును | ఒళపు ఇరుందా కండిప్పా వరుం |

| | | |
|---|---|---|
| కళ్లతో చూసేను | కంట్లో చూస్తిని | కణ్ణిలే పార్తేన్ |
| కచ్చితంగా ఉంటుంది | కట్టాయంగా వుణ్ణు | కట్టాయమా ఇరుక్కుం |
| కనిపెట్టడానికి వీలుకాదు | కండి పెట్టను మాలదు | కండి పుడిక్క ముడియాదు |
| చివర్లో చూస్తే రెండురోజులు అయిపోయింది | కడానచూస్తే రెండునాల్లు అయిపోయిడిసింది | కడలేపార్తా రెండునాల్లు ఆయిడిచ్చి |
| కలిపేసే ఉంటుంది | కల్వడం సేసిదావుణ్ణు | కల్వడం పణ్ణిట్టిదా ఇరుక్కుం |
| కాలు ఎత్తే వరకు | కాలుతూకే వరలుం | కాలు తూకర వరలుం |
| కుటుంబ పరిస్థితి చాలా కష్టంగా ఉంటుంది | కుడుంబ నిలమె నిండా మోసంగా వుణ్ణు | కుడుంబ నిలమె రొంబ మోసమా ఇరుక్కుం |
| తీసుకొస్తారు | కొండునొస్సారు | కొండుటు పోరువాంగె |
| ట్రైన్‌లో పోవాలి | ట్రైన్ పెట్టి పోయిడవాల | ట్రైన్ పుడిచుపోయిడనం |
| ప్రస్తుతం ఏపార్టీ వుందో | తచ్చమయం ఏ పార్టీ వుందో | తచ్చమయం ఎంద పార్టీ ఇరుక్కో |
| వేరే విధంగా ఉంటుంది | తనీపట్ట మాదిరి వుణ్ణు | తనీపట్ట మాదిరి ఇరుక్కుం |
| తిప్పేసి వస్తుంది | తిరిపిడిసేసి వచ్చును | తిరిపిట్టు వరుం |
| తెలుగు శ్మశానం వుంది | తెలుంగు సుడిగాడువుల్లే | తెలుంగు సుడిగాడు ఇరుక్కు |
| కదా అక్కడే పూడుస్తారు | అక్కడదా పాదచేది | కిల్లె అంగెదా పొదకిరదు |
| తెలుగు కంటే తమిళం నచ్చింది | తెలుగువిడ తమిళ్ పట్టి వుంది | తెలుంగు విడ తమి పుడిక్కుం |
| వీధి వీధిగా తిరగాలి | తెరు తెరువా సుత్తవాలి | తెరు తెరువా సుత్తనుం |
| దానికే కరువు వచ్చింది కదా | దానికిదా పంజం వచ్చేసింది | అదికుదా పంజం వందిడిచ్చే |
| దాని గురించే నేను చెప్పేది | దాని పత్తిదా నేనుచొప్పేది | అదుపత్తిదా నాన్ సొల్లరుదు |

| | | |
|---|---|---|
| దేనికీ నేను వెనుకాడను | దేనికి నేను తయంగను | ఎదికిమే నాను తయంగమా టేన్ |
| నడిచే పద్ధతి ఏదీ నచ్చదు | నడముర్రై ఎదియో పట్టదు | నడముర్రై ఎదియో పుడికాదు |
| నాకు సంబంధించినంత వరకూ మంచిదే | నన్ను పొరుల్ వరలుం మంచిద్దా | యన్నై పొరుల్ వరలుం నల్లద్దా |
| నర్స్ కోర్స్ చదివేను | నర్స్ కోర్సు ఎత్తేను | నర్స్‌కోర్స్ ఎడిత్తేన్ |
| నాన్నకు చేరిందిగా ఉంటుంది | నాయనకు సేరిందిగావుణ్ణు | అప్పాకుసేందిఇరుక్కుం |
| నాలుగు తరాల ముందు | నాలుగు తలముర్రై ముందు | నాలుతలముర్రై మున్నాలె |
| చాలా అసహ్యమై పోయింది | నిండా కంద్రావి అయి పోయిడిసింది | రొంబ కంద్రావి ఆయిడిచ్చి |
| పొడవుగా మిద్దెలు కట్టేస్తారు | నీటుగా మాడివీడు కట్టేడిస్తురు | నీటా మాడివీడు కట్టిడు వాంగు |
| పొలం కొని డబ్బు వృధా చేసేశాడు | నెలం వాంగి డబ్బు వీన్ చేసిడిసినాడు | నెలంవాంగా దుడ్డు వీన్ పణ్ణిటాన్ |
| ను బయటకి వచ్చేశానుకదా నేను ఎత్తి వేసేసాను | నేన్‌దా వెలగేస్తినే నేను తూకి అట్నే వేసిడిస్తిని | నాన్ వెలగిటేన్ నాన్‌తూకి అపిడి పోటిటేన్ |
| ఎదురుగాచూస్తే హఠాత్తుగా వస్తుంది | నేరడిగాసూసినా ఢిడీరని వచ్చును | నేరడియా పాత్తాల్ ఢిడీరని వరుం |
| నేర్చుకోవాలనే కాని తప్పి తీసేస్తారు | నేర్చుకోవాలనే కండి నోండి ఎత్తేస్తురు | కత్తినమే కండి నోండి ఎడుతుడు వాంగె |
| తాళం వేసుకొని పోతాను | పూటేసుకుని పోతాను | పూటు పోట్టుకిటు పోవెన్ |
| పెండ్లి ఖర్చుకని ఉండింది | పెల్లి సెలవుకని వుణ్ణింది | కల్యాణ సెలవుకాగ ఇరుందదు |
| సామాన్యంగా చూస్తే జన సంఖ్య ఎక్కువ | పొదువుగా సూసిన జన తొగె జాస్తి | పొదువా పాత్తాల్ జన తొగె జాస్తి |
| సంబంధం రానంటుంది | పొరుత్తందానే రానంటాంది | పొరుత్తం దానె వరమాట్టేన్నుదు |

| | | |
|---|---|---|
| మంచి అర్థం వుంటుంది | మంచి కరుత్తు వుణ్ణు | నల్ల కరుత్తు ఇరుక్కుం |
| మిగిలినవాళ్ళ అభిప్రాయం ప్రకారం | మత్తవాల్ల అభిప్రాయం పడి | మత్తవంగె అభిప్రాయం పడి |
| మనసులో హత్తుకొనే విధంగా | మనసిలో పదింజె మాదిరి | మనసిలే పదింజే మాదిరి |
| తగిలించి వదిలేస్తారు | మాటించి వుడిచేస్తురు | మాటిట్టు విట్టుడు వాంగె |
| ముందంజ వేసి వుంటారు | మున్నేట్రంగా వుంట్రు | మునేట్రమా ఇరుపాంగె |
| సగం సగమే రాస్తారు | మొట్ట మొట్టగా రాస్తురు | మొట్ట మొట్టయా ఎళిదువాంగే |
| గుండ్రై పోతుంది | మొట్టై పూడుస్తుంది | మొట్టై పోయిడుం |
| రేడియో కార్యక్రమాలు | రేడియో నిగచ్చివా | రేడియో నిగచ్చిదా |
| చాలా నచ్చుతాయి. | నిండా పట్ను | రొంబ పుడిక్కుం |
| పన్ను వేసేస్తారు | వరివేసిడుస్తురు | వరి పోట్టిడు వాంగె |
| ఆదాయం ఎక్కువ వుంటే కదా | వరుమానం జాస్తిగా వుంటే దానె | వరుమానం జాస్తియ: ఇరుందా దానే |
| వాళ్ళ వాళ్ళ ఇష్టాన్ననుసరించి కుటుంబాన్ని నడిపించేము | వాల్ల వాల్ల పిరియపట్టి కుడుంబాన్ని నరుతేము | అవంగెవంగె పిరియ-పడి కుడుంబత్తై నడత్తినోమ్ |
| తరువాతి కాలానికి దాచి పెట్టుకోవాలి | వెనక సేవ్ చేసి పోటు కోవాల | పిన్నాలె సేవ్ పణ్ణి పోటుకిరోం |
| తాటాకు వేసి కట్టేస్తారు | వోల వేసి కట్టిడినారు | వోల పోటు కట్టిడు వాంగె |
| చదివి పూర్తిచేసాను | సదిగి ముడిచేను | పడిచి ముడిచేను |
| సమర్థించుకొని రావాలి | సమ్మాళించుకోని వచ్చిడవాల | సమ్మాళించ్చుట్టు వరనుం |
| చిన్న చిన్నగా రాసి వుంది | సిరిసిరిగా ఎళిది వుణ్ణింది | సిరిసిరియా ఎళిది ఇరుకు |
| కొన్ని సమయాల్లో ఎగతాళి | సిల సమయంలో కిండల్ | సిల సమయత్తిలే |

| | | |
|---|---|---|
| చేస్తారు | చేస్తురు | కిండల్ పణ్ణు వాంగె |
| మంచిగా వుండాలనే కాని | సీరుగా వుండ వలెనేకండి | సీరా ఇరుకణమే కండి |

## అనుబంధం - 3

### ప్రత్యేక పదజాలం

అడుక్కోనొస్తాను = అడిగి వస్తాను
ఇల్లల్లకాడ = ఇంటి దగ్గర
ఉండవాల = ఉండాలి
ఏడ్సునే వుంటారు = ఏడుస్తూనే వుంటారు
ఏముండు = ఏముంది
కట్టిడిసినారు = కట్టిచ్చేరు
చిన్నప్పల్లో = చిన్నప్పటిలో
డాన్సులాడికిని = డాన్సులాడుకొని
తిరిపిడిసేసి = తిప్పేసి
తెలిపించు = తెలియజేయు
నడతేము = నడిపించేము
నిల్సుడు = నిలుస్తాడు
పరిగెత్తిడిసినారు = పరిగెత్తేసేరు
పెట్టిడిస్తురు = పెట్టేస్తారు
పెరిగిపోయుండ్లే = పెరిగిపోయింది కదా
మాటాడ్తురు = మాట్లాడ్తారు
ముక్కిమానవోల్లు = ముఖ్యమైనవాళ్ళు
ముడింజేను = ముగించేను
మమ్మల్నాలే = మాలాగే
రసిగరనేసి = రసికుడని
లేసుకుంటాము = లేస్తాము
వినుకొంటాము = వింటాము
వుండేవరలుం = వుండేవరకు
సదవకొంటోల్లుగా = చదవని వాళ్ళుగా
సానా మందులు = చాలామంది
సేరవలేదు = చేరలేదు

★★★★

## అనుబంధం - 4

## వ్యవహర్తల వివరాలు

| క్ర సం. | వ్యవహర్త పేరు | లింగం | వయస్సు | విద్యార్హత | మద్రాసు లోనివాస కాలం | కులం | వృత్తి | స్వస్థలం | చిరునామా | పు. సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | శశిరేఖ టి | స్త్రీ | 58 | 5 | 58 | రెడ్డి | గృహిణి | అల్లూరు | 13. ఈశ్వరన్‌కోయిల్‌స్ట్రీట్ వెస్ట్‌మాంబళం | 72 |
| 2. | కృష్ణారెడ్డి యం. | పు | 55 | ఎస్.ఎస్.ఎల్.సి. | 55 | రెడ్డి | ఫిట్టర్ | నాగలాపుం | 43. రెడ్డి స్ట్రీట్, విల్లివాక్కం | 135 |
| 3. | లక్ష్మి డి. | స్త్రీ | 34 | ఎస్.ఎస్.ఎల్.సి. | 34 | నాయుడు | నర్స్ | చిత్తూరు | 29. శ్రీనివాసా స్ట్రీట్, ఐనావరం | 28 |
| 4. | కోదండపాణినాయుడు | పు | 60 | - | 60 | నాయుడు | వ్యాపారం | చిత్తూరు | 11. చెంగల్వరాయన్ స్ట్రీట్, షెనాయ్ నగర్ | 138 |
| 5. | కౌసల్య జి. | స్త్రీ | 53 | 4 | 40 | దేవాంగ | గృహిణి | కాళహస్తి | 35. కృష్ణాతోట్టం, కొరుకుపేట | 48 |
| 6. | చంద్రశేఖరన్ ఎన్. | పు | 45 | బి.ఇ. | 30 | దేవాంగ | ఇంజనీర్ | సత్యవేడు | 6. రెండవ మెయిన్‌రోడ్, సీతమ్మకాలని, తేనాంపేట | 79 |
| 7. | పద్మావతి ఎస్. | స్త్రీ | 38 | 3 | 38 | బ్రాహ్మణ | గృహిణి | తంజావూరు | 29. ఫ్లవర్ స్ట్రీట్, అరుంబాకం | 9 |
| 8. | సుబ్రహ్మణ్యం డి | పు | 40 | +2(ఇంటర్) | 40 | బ్రాహ్మణ | క్లర్కు | విల్లుపురం | 100. తులసింగం మొదలిస్ట్రీట్, పెరంబూరు | 97 |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 9. మయూరవల్లి పి. | స్త్రీ | 30 | 10 | 30 | వైశ్య | గృహిణి | తిరువళ్ళూరు | 4. రామకృష్ణారోడ్డు, జార్జిటౌన్ | 147 |
| 10. బాబు టి.కె. | పు | 35 | 4 | 35 | వైశ్య | వ్యాపారం | నెల్లూరు | 6. రాయపేట | 122 |
| 11. సావిత్రి కె. | స్త్రీ | 55 | 5 | 55 | విశ్వకర్మ | గృహిణి | వేలూరు | 11. రామస్వామిస్ట్రీట్, టి.నగర్ | 72 |
| 12. దత్తాత్రేయశర్మ డి. | పు | 49 | బి.ఎ. | 49 | విశ్వకర్మ | వ్యాపారం | ధర్మవరం | 30. దేవరాజమొదలి స్ట్రీట్ పార్కుటవున్ | 91 |
| 13. కల ఎం. | స్త్రీ | 30 | ఎస్.ఎస్.ఎల్.సి. | 30 | చాకలి | టైపిస్టు | రాజపాళయం | 56. వరదప్ప మొదలి స్ట్రీట్ న్యూవాషర్‌మెన్‌పేట | 69 |
| 14. సుబ్బయ్య ఆర్. | పు | 56 | - | 30 | చాకలి | చాకలివృత్తి | చెంగల్పట్టు | 10. మురుగేశన్ మొదలి స్ట్రీట్ చెట్‌పట్ | 60 |
| 15. లలిత కె. | స్త్రీ | 35 | ఎస్.ఎస్.ఎల్.సి | 35 | మాల | గృహిణి | నెల్లూరు | 4. అంబేద్కర్‌నగర్, పెరియమేడ్డు | 2 |
| 16. తిరుపాల్ బి. | పు | 50 | - | 50 | మాల | స్వీపర్ | ఆత్మకూరు | 63. పుల్లారెడి పురం, కీల్పాకు | 40 |
| 17. పెంచలమ్మ పి. | స్త్రీ | 45 | - | 45 | మాదిగ | స్వీపర్ | పొదలకూరు | 30. రాంనగర్, కృష్ణాంపేట | 45 |
| 18. కొండయ్య జి. | పు | 50 | ఎస్.ఎస్.ఎల్.సి | 50 | మాదిగ | సూపరిం-టెండెంట్ | సత్యవేడు | 5/2/2, పదకొండోక్రాస్ స్ట్రీట్ ఐ.సి.ఎఫ్. సౌత్ కాలని | 11 |

## అనుబంధం - 5

## ప్రశ్నావళి

### 1. వ్యవహర్త సాంఘిక జీవనానికి సంబంధించిన ప్రశ్నలు

1. మీ పేరేమిటి ?
2. మీ ఇంటి పేరేమిటి ?
3. మీ గోత్రం ఏంటి ?
4. మీ వయసెంత ?
5. ఏం చదివారు ?
6. మీ మతం ఏంటి ?
7. మీ కులం ఏంటి ?
8. మీ వృత్తి ఏంటి ?
9. మీ ఆదాయమెంత ?
10. ఆస్తులేమైనా ఉన్నాయా ?
11. మీ సొంత ఊరు ఏది ?
12. ఇక్కడ ఎంతకాలం నుండి ఉన్నారు ?
13. ఏ ప్రాంతం నుంచి వచ్చారు ?
14. ఎప్పుడు వచ్చారు ? ఎందుకు వచ్చారు ? ఎవరు వచ్చారు ? ఒంటరిగానా ? కుటుంబమంతానా ?
15. ఇంటి అడ్రసు ?
16. మీ ఇల్లు ఉండే ప్రాంతం ?
17. మీ తండ్రి పేరేమిటి ? తల్లి పేరేమిటి ? వారేం చేస్తారు ?
18. మీ భార్య / భర్త పేరు ఏమిటి ? ఏం చేస్తారు ?
19. ఈ నగరంలో మీరు ఏఏ చోట్ల ఉన్నారు ?
20. మీకు ఎంతమంది సోదరులు, సోదరీమణులున్నారు ? వారేం చేస్తారు ?
21. మీకు ఎంత మంది పిల్లలు ? వాళ్ళేం చేస్తున్నారు ?
22. మీ ఇరుగు పొరుగు వారు మీతోను, మీ కుటుంబంలోని వారితోను ఎట్లా మెలుగుతారు ?

## 2. వ్యవహర్త భాషా జ్ఞానానికి సంబంధించిన ప్రశ్నలు

1. మాతృ భాషకాక మరే భాషలైనా తెలుసా ?
2. మీ స్నేహితులతోను, ఇరుగు పొరుగు వారితోను, బంధువులతోను ఏ భాషలో మాట్లాడుతారు ?
3. మాతృభాషలో మధ్యమధ్య ఆంగ్ల భాషను చేర్చి మాట్లాడ్డంలో మీ అభిప్రాయమేమిటి?
4. మాతృభాషలో విద్యా బోధనను గూర్చి మీ అభిప్రాయమేమిటి ?
5. మీ పిల్లలు ఏ భాషా మాధ్యమంలో చదువుతున్నారు ? ఎందువల్ల ?
6. మీ మాతృభాష తెలుగేనని మీరు ఒప్పుకుంటారా ?
7. మీకు తెలుగు బాగా వచ్చును కుంటున్నారా ?
8. మీ పెద్దలు మీ కంటే తెలుగు బాగా మాట్లాడతారని మీరనుకుంటున్నారా ? మీరెందుకు మాటాడలేక పోతున్నారు ?
9. మీ భాష మీద తమిళ భాషా ప్రభావం వుందని మీరనుకుంటున్నారా ? ఎందువల్ల?
10. మీ మాతృ భాషని చదవాలని మీకు ఆసక్తి వుందా ?

## వ్యవహర్త నివసించు ప్రదేశంలోని భాషా భేదానికి సంబంధించిన ప్రశ్నలు

మద్రాసు తెలుగు భాషను గూర్చి మీ అభిప్రాయమేమిటి ?

2. మద్రాసు తెలుగు కాక ఇతర తెలుగు మాండలికాలను గూర్చి మీ అభిప్రాయమేమిటి?
3. ఇక్కడి నుండి వేరేచోటికి వెళ్ళినప్పుడు భాషని బట్టి, మీ కులానికి సంబంధించిన వారిని గాని, ప్రాంతానికి సంబంధించిన వారిని గాని గుర్తించగలరా ? ఎప్పుడైనా గుర్తించారా ?
4. ఇతర కులాల, ప్రాంతాల వారిని భాషని బట్టి గుర్తించగలరా ?
5. మద్రాసు తెలుగు వారు మాట్లాడే పద్ధతి మీకు నచ్చిందా ?
6. మద్రాసులోని తెలుగు భాష ఆంధ్రరాష్ట్రంలోని తెలుగు భాషకంటే వేరే విధంగా వుందా ? భేదం ఎక్కడ వుంది ?
7. ఇక్కడ ఇంకా ఏఏ భాషలు మట్లాడుతారు ?
8. ఇతర కులాల వాళ్ళు మాట్లాడే తెలుగును గూర్చి మీ అభిప్రాయమేమిటి ? వాళ్ళు మీకంటే బాగా మాట్లాడుతారా ? ఏ కులం వాళ్ళ భాష బాగుంటుంది ?

ఇక్కడున్న వేరే కులాల వాళ్ళతో మీరు తెలుగు మాట్లాడుతారా ?

ఇక్కడ తెలుగు భాషని అభివృద్ధి చేయడానికి ఏమైనా సలహాలు ఇస్తారా ?

## 4. వ్యవహర్త నివసించే ప్రదేశంలోని ఇతర భాషలను గూర్చిన ప్రశ్నలు

1. తమిళులను గూర్చి, తమిళ భాషను గూర్చి మీ అభిప్రాయమేమిటి ?
2. ఇక్కడ తెలుగు వారికి, ఇతర భాషలను మాట్లాడే వారికి ఏమైనా అభిప్రాయ భేదాలున్నాయా ? ఎందువల్ల ?
3. ప్రతి ఒక్కరు మాతృ భాషతో పాటు ఇతర భాషలను కనీసం రెండింటినన్నా నేర్చుకోవాలనడాన్ని గూర్చి మీ ఉద్దేశమేమిటి ?
4. ఎన్ని తెలుగు కుటుంబాలు ఈ ప్రాంతంలో వున్నాయి ? ఎంతమంది తెలుగు వాళ్ళు ఇక్కడ ఉన్నారు ?

## 5. వ్యవహర్త స్వీయాభిప్రాయాలను గూర్చిన ప్రశ్నలు

1. కుల తత్త్వాలను గూర్చి మీ ఉద్దేశ్యమేమిటి ?
2. మతం మీద, భగవంతుడి మీద మీకు నమ్మకముందా ?
3. మీ మత గ్రంథాన్ని గూర్చి కొంచెం చెపుతారా ?
4. సాంఘిక పునరుద్ధరణను గూర్చి మీ అభిప్రాయమేమిటి ?
5. నేటి యువతరాన్ని గూర్చి మీ అభిప్రాయమేమిటి ?
6. మీ విద్యార్థి దశ ఎలా జరిగింది ? ఏదైనా గుర్తుంచుకోదగ్గ సంఘటన ఉందా ?
7. మీ స్నేహితులు ఎలాంటి వారు ? ఇతరుల అభిప్రాయం మీద ఆధారపడే వాళ్ళ ఎవరన్నా ఉన్నారా ? ఎందువల్ల ?
8. మీ కుల దైవం ఎవరు ?

## 6. వ్యవహర్త యొక్క సాంఘిక, సామాజిక కార్యకలాపాలకు సంబంధించిన ప్రశ్నలు

1. మీరు ఏఏ పండుగలు చేసుకుంటారు ?
2. మీ మత సంబంధమైన పండుగలు మీరు ఏ విధంగా జరుపుకుంటారు ?
3. వివాహ కార్యం మీలో ఏపద్ధతిలో జరుగుతుంది ? ఎలా చేస్తారు ?
4. పెళ్ళి సంబంధాలు ఎక్కడ చూస్తారు ?
5. మీ కులానికి సంబంధించిన వాళ్ళు ఒకే ప్రాంతంలో వున్నారా ? లేక చాలా ప్రాంతాల ఉన్నారా ?
6. పెళ్ళి రోజును ప్రతి సంవత్సరం చేసుకుంటారా ?
7. మీ ఇంటికి వచ్చిన బంధువుల్ని, అతిథుల్ని ఏ విధంగా చూస్తారు ?
8. ఈ ప్రాంతంలో ఏమైనా సంఘాలు ఉన్నాయా ?
   1. భాష, సాంఘిక, సాంస్కృతిక, మత

9. తెలుగు జానపద పాటలు మీకు ఏమైనా తెలుసా ?

10. తెలుగు సామెతలు ఏమైనా తెలుసా ? చెపుతారా ?

11. శవానికి అంత్యక్రియలు ఏవిధంగా చేస్తారు ? దానికి సంబంధించిన కార్యాలు ఏం చేస్తారు ?

## 7. ప్రమాదాలు, పోట్లాటల గూర్చిన ప్రశ్నలు

1. మీ ప్రదేశంలో వీధి పోట్లాటలేమైనా ఉన్నాయా ?
2. పోట్లాటలకు కారణమేమిటి ?
3. ఎప్పుడైనా పోట్లాట చూశారా ? మీరు దాన్లో పాల్గొన్నారా ?
4. రోడ్డు ప్రమాదాల్ని ఎప్పుడైనా చూశారా ? ఏదైనా ఒకదాన్ని వివరిస్తారా ?
5. కుటుంబ ఆస్తుల పంపకాలలో తగవులాటలను ఎప్పుడైనా మీరు చూశారా ?

## 8. వ్యవహర్త జీవిత ధ్యేయం, ఆశయాలకు సంబంధించిన ప్రశ్నలు

1. మీ జీవితానికి సంబంధించి మీ ఆశయాలేమిటి ?
2. మీ ఉద్దేశాలు, అభిలాషలు ఏమిటి ?
3. జీవితంలో గొప్ప వాడవడానికి ఏం సాధించాలని మీ ఉద్దేశం ? ఏం చేయాలి ?

## 9. వ్యవహర్త దిన చర్యకు సంబంధించిన ప్రశ్నలు

1. తెల్లవారి లేచింది మొదలు రాత్రి పడుకునే వరకు మీ దిన చర్యను గూర్చి చెపుతారా?
2. మీ ఇంట్లో చిన్న పిల్లలకు కథలు చెప్పే అలవాటు మీకు ఉందా ? ఉదాహరణకి ఏదైనా కథ చెపుతారా ?
3. నేటి రాజకీయాలను గూర్చి మీ అభిప్రాయమేమిటి ? వాటి ప్రభావం సంఘం మీద ఎంతవరకు ఉంది ?
4. నేటి సినిమాలను గూర్చి మీ అభిప్రాయమేమిటి ?
5. దిన పత్రికలు, వార పత్రికలు చదువుతారా ? వాటిని గూర్చి మీ అభిప్రాయమేమిటి?
6. T. V. లో RADIO తెలుగు భాషకు సంబంధించి కార్యక్రమాలేమైనా చూస్తారా ? అవి మనకు వుపయోగంగా ఉన్నాయా ?

## 10. ఆధునిక పురోగమనానికి సంబంధించిన ప్రశ్నలు

1. ఆధునిక పురోగమనాన్ని గూర్చి మీ అభిప్రాయమేమిటి ?
2. ఈ ప్రాంతంలో సమస్యలేమైనా ఉన్నాయా ? వాటిని పరిష్కరించడం ఎలా ?

ఈ ప్రాంతంలో మీరు వచ్చినప్పటికి, ఇప్పటికి ఆర్థిక, పారిశ్రామిక, రాజకీయ, అభివృద్ధులు, మార్పులు ఏమైనా జరిగాయా ?

# SOURCE MATERIAL

1. Dar Commissioner Report, New Delhi.

(Report of the linguistic Provinces Commission) 1948

2. First Report of the Commissioners for linguistic minorities. 1959

3. Madras Administration Report 1980

4. Memorandum submitted by the Government of Madras to the Indian Statutory Commission 1928

5. Muthuswamipillai's census of India 1981. Parts XIII - A & B, Village & Town Directory.

6. Pataskar Commission Report 1957

7. Report of the Economic Survey of Madras city 1954-1957

8. Report of the Nehru Committee, All Parties conference. 1928

9. States Recognization Committee report, New Delhi. 1955.

# REFERENCE MATERIAL


1. Agasthialingam.S., **Kanikkara Dialect of Tamil,** Publication No.45, Annamalai University, Annamalai Nagar,1976.

1a. Akkiredy Sanikommu, **English Loan words in Telugu,** Unpublished Ph.D.Thesis, Sri Venkateswara University,Tirupati,1970.

2. Anandaraj, **A Tamil Dialect of Mysore,** Unpublished M.A.Thesis,Annamalai University,1970

3. Annapurnamma.R., **A contrastive study of old and Modern Telugu,** unpublished Ph.D.Thesis, Annamalai University, 1977.

4. Baldevrajgupta, **Research in Indian linguistics,** Ariana Publishing house, New Delhi, 1983.

5. Barnabas Subhash, A.P., C.Mehanta, **Caste in Changing India,** The Indian Institute of Public Administration, New Delhi, 1967.

6. Bean.S.S,.**Linguistic Variation and caste system in South Asia,** Indian Linguistics 35-4,Pune,1974.

7. Bell, R.T., **Socio linguistics: Goals, approaches and problems** B.T.Bat ford ltd., London,1976.

8. Bright.W., **Linguistic change in some Indian caste dialects,** international journal of American linguistics, Indian University, Vol.26, No.3,1960.

9. Bright.W., **A study of caste and dialect in Mysore,** Indian linguistics, 21-45,50,1960.

10. Bright.W.**Social dialects and language history,** Current Anthropology, Vol.I., 1960.

11. Bright.W., Ramanujam, A.K., **Socio linguistic variation and language change,** IX th International congress of linguistics,1962.

12. Brown, C.P.,"**A Dictionary of the Mixed Dialects and foreign words used in Telugu,** Madras Christian Knowledge society press, 1984.

13. Chandran, **A.Kannada dialect of Madurai,** Unpublished M.A.Thesis, Annamalai University, 1972.

14. Emeneau, M.B., **Bilingualism and structural Borrowing,** American philosophical Society, 1962.

14 a. Foulkes.T., **Castes and Tribes of Southern India,** Asian Educational Services, New Delhi,1987.

15. Govindareddy, **A Telugu Dialect of South Arcot,** Unpublished, M.A.Thesis, Annamalai University, 1972.

16. Hanumantharao, P.U., **State of influence of other languages on today's Telugu,** II nd All India Dravidian Linguistics Conference, Tirupathi,1972.

17. Harry Hoijer, **Language in Culture.**

18. Henry.M., Hoeming Swald, **Language and linguistic Reconstruction.**

19. Hunter,W.H., **The imperial Gazetter of India,** Vol,.IX.

20. Hutton, J.H., **Caste in India. Its nature, Function and Origins,**Cambridge University Press, 1946.

21. Jagadesan, **A descriptive study of the Telugu Chettiyar dialect of Tamil,** Unpublished M.A.Thesis, Annamalai University,1970.

22. Jagadeesaperumal, **Kanyakumari Nadar dialect of Tamil,** Unpublished M.A.Thesis, Annamalai University,1972.

23. Kamatchinathan, A., **The Tirunelveli Tamil Dialect,** Pub.No.19 Annamalai University, 1969.

24. Karunakaran, **Relative efficiencies of standard Telugu and Coimbatore dialect of Telugu,** Unpublished M.A.Thesis. Annamalai University,1964.

25. Karunakaran, **Studies in Tamil Socio linguistics,** Oppur Achagam Madras-18, 1978.

26. Khadar Mohideen, S., **Descriptive outline of a Muslim Dialect of Telugu,** Unpublished M.A.Thesis, Annamalai University 1970.

27. Kothandaraman,R., **Some Bilingual observations with special reference to Tamil-English contact situation,** Unpublished M.A.Thesis, Annamalai University, 1968.

28. Krishnamurthy, Bh.**Bilingualism and social dialects in Telugu,** The American Insitute of Indian Studies, Madras,1972.

29. Krishnaswamy Nayudu, **Old Madras,** 1965.

30. Kumaraswami Raja, N., **A Generative grammar of Rajapalayam Telugu,** Unpublished Ph.D.Thesis, Annamalai University.

31. Muthuswamipillai.P., **The social differentiation of Tamil in Madurai city,** Unpublished Ph.D.thesis, Annamalai University,1981.

32. Namberumalsamy, **A Telugu dialect of Madura,** Unpublished M.A.Thesis, Annamalai University,1972.

33. Narasimha Reddy,P.C., **Socio linguistic aspects of Telugu - Tamil Bilingualism with special reference to Bilingual Telugu spoken in Nagiri,** Unpublished Ph.D.Thesis, S.V.University Tirupathi,1982.

34. Narula.S.S., **Social roots of Indian Linguistics.**

35. Natarajan, M., **Kallar Dialect of Tanjore District,** Unpublished M.A.Thesis, Annamalai University, 1969.

36. Natarajan, S. **Mudaliar Dialect of South Arcot District,** Unpublished M.A.Thesis, Annamalai university, 1969.

37. Natarajapillai, **Vellala Dialect of Salem Tamil,** Unpublished M.A.Thesis, Annamalai University,1972.

38. Noam Chomsky, **Language and Mind.**

39. OLTO Jesberson, **Language its nature development and origin.**

40. Pandit, P.B., **India as a Socio linguistic area.**

11. Patnayak, D.P., **Caste and Language,** I.J.D.L. 2.1 Trivendrum 1975.

. Patnayak, D.P., **Language, culture and science, Muliti lingualism and Mother tongue education,** C.I.I.L.,Mysore,1981.

43. Peter Trudgill, **Socio linguistics an introduction,** Penguin Books Limited, London, 1975.

44. Ponnambalam.V., **A descriptive analysis of the Nakaram Chettiyar Dialect of Tamil,** Unpublished M.A.Thesis, Annamalai

University, 1971.

45. Ramakrishna, Korada., **Madras Telugu-Noun Morphology,** Unpublished M.Phil Thesis, University of Madras, 1979.(Telugu)

46. Ramaswami, **A descriptive study of a Tamil Dialect (Harijan of South Arcot),** Unpublished M.A.Thesis, Annamalai University, 1970.

47. Ramaswamy, **A dialect of Trichy, Tamil,** unpublished M.A Thesis, Annamalai University, 1972.

48. Rangan.K, **Difference in speech between educated and uneducated Harijan,** unpublished M.A Thesis, Annamalai University,1965.

49. Ranson, C.W., **A City in transition Studies in the Social life of Madras,**1938.

50. Sakthivel.S., **Tribal languages of India,** Pub.No.61, Annamalai University, 1978.

51. Sankaranarayanan.G., **Brahmin Dialect of Thirunelveli District,** Unpublished M.A Thesis, Annamalai University,1969.

52. Saraswati, Kottapalli, **Madras City place Names,** Unpublished, M.Phil Thesis, University of Madras 1980.(TELUGU).

53. Sarvamangala Gowri,K., **Madras Telugu verb Morphology,** Unpublished M.Phil Thesis, University of Madras,1979.(TELUGU)

54. Shanmugam Pillai.C., **Vellala Dialetic of South Arcot district** Unpublihsed M.A Thesis, Annamalai University,1969.

55. Siddeshwar Verma, **Linguistic Survey of India, Part-I and II.**

56. Sivananda Sarma, **Karimnagar Dialect of Telugu,** Telugu Akademi of Hyderabad, 1974.

57. Sivaramamurthy, N. **Social Stratification in Telugu, a rural cas of study,** Indian Lingustics Vol.40.No.2, Pune,1979.

58. Siva Shanmugham.C., **Social differntiation of Tamil Coimbatore,** Unpublished Ph.D Thesis, Annamalai Universit 1981.

59. Somasundara Raju, **Parvata Raja Kula dialect of Salem Tamil,** Annamalai University, 1972.

60. Somasundara, B., **Madras a Telugu City,** Madras1953.

61. Srinivasachary, **History of the City of Madras,** 1939.

62. Srinivasachary, **History of Madras,** Varadachary & Co., Madras, 1825.

63. Subrahmanyam.P.S., **An introduction to modern Telugu,** pub. No. 34 Annamalai University, 1974.

64. Suseendirarajah.S., **A descriptive Study of Ceylon Tamil,** Unpublished Ph.D. Thesis, Annamalai University,1967.

65. Swarajyalakshmi.V., **A descriptive Grammar of Cuddapah, Dialect.**

66. Vaidya Nathan. R., **Brahmin Dialetic of Tanjore District,** Unpublished M.A.Thesis, Annamalai University,1969.

67. Veerabhadra Rao.K., **Telugu Sahityam pai Engligh Prabhavam (Telugu),** Ajanta Printers, Secundrabad ,1960.

68. Velayudha Raja.K.R., **Telugu's in Tamil Nadu,** Souvenir, I World Telugu Conference, Hyderabad 1975.

69. Venkatappa.R., **Chennapatnam Telugu Patnam (Telugu),** Madras,1949.

70. Viswanatha Reddy **Kethu, Kadapa - Urla Perlu(Telugu).**

# Views of the Examiners

The Scholar has rightly chosen a Topic which is useful for reconstructing the cultural and linguistic factors of a particular society.

The scholar has Judiciously selected her informants, distributing them to different areas and fields, like Caste, Sex, Education and area.

The scholar has collected the data basing on the questionnaire which was prepared scientifically.

Research can become a contribution to a field of knowledge only when it is adequately communicated. For this purpose precise writing is essential. The scholar has communicated the thesis in a precise writing. For this the scholar deserves congratulations.

The best word to express an idea need not be necessarily the longest. Keeping this principle in view the scholar has used simple words and made the style attractive.

Introductory chapter is very informative. The language analysis is fine. The scholar could vividly bring out the influence of Tamil on Madras Telugu and culture.

The thesis reveals that the scholar has reviewed all the available literature. The Bibliography bears testimony to this fact.

The scholar could come to a definite conclusion in every aspect. She could make some generalisations on the basis of the data.

The charts I-VII given in pages 99-105 are an index to the scholars mathematical approach to the subject. These charts add weight to the thesis.

The thesis is complete in every aspect. For this the scholar deserves encomium.

The research scholar Mrs. K. Mehermani deserves hearty congratulations for the excellent work done without the benefit of a regular guidance from a recognised guide.

Sri Annapoorna Graphics - Nellore.